అపరాధ పరిశోధన అనుబంధం—44

# నాలుగు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## గుడ్డి ప్రేమ

చన : లలిత కుమారి

## జన్మ రహస్యం

రచన : వసుంధర

## మహా మాంత్రికుడు

రచన : అజీజ్

## హతుడు - హంతకుడు

రచన : కె. బి. యస్. కుమార్

'శాన్యోరా' సీరియల్ - తొమ్మిదవ భాగం

అపరాధ పరిశోధన సప్లిమెంట్ — 44
ఆగస్టు, 1977
వెల : 3_00 రూపాయలు
ఏడాది చందా 39 రూపాయలు
జీవిత చందా 250 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్ :
శ్యామ దామోదర్ రెడ్డి

సంపాదక వర్గం :
టెంపోరావ్
శ్యాంబాబు
రమణశ్రీ
ఏ. వీ. మోహన్రావ్
సుజనశ్రీ
వసుంధర
కంచర్ల రమణ

కార్యాలయం :
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు_29
ఫోన్_36959

ముద్రణ :
క్రాంతి ప్రెస్,
12, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు_1.

# గుడ్డి ప్రేమ

లలిత కుమారి

పోర్టికోలో జీప్ ఆపి దిగుతూ రిస్టు వాచీ చూసుకున్నాను.

రాత్రి పన్నెండు గంటలు!

తాళం తీసి లోనికెళ్ళి లైటు వేశాను. తలుపులోపల గడియపెట్టి, బెడ్ రూంలోకి నడిచాను. బూట్సు విప్పి బట్టలు మార్చుకుని, పక్క మీద వాలబోతుండగా కాలింగ్ బెల్ మోగింది!

ఉద్యోగ రీత్యా ఈ ఢిల్లీ నగరంలో ఒంటరిగా నివసిస్తున్నాను. నేను సి.బి.ఐ. అధికారిని! మా ఉద్యోగ నియమాల దృష్ట్యా ఇంటికి వచ్చేంతటి దగ్గర పరిచయస్థులెవ్వరూ నాకు లేరు. ఇంత రాత్రివేళ సాధారణంగా

ఇంటి కెవ్వరూ రారు. ఈ జీవితంలో మిత్రులకంటే అధికంగా శత్రువులే తారస పడుతుంటారు.

దేనికైనా మంచిదని బల్ల సొరుగులోంచి పిస్తోలు అందుకుని తలుపు వైపు నడిచాను. ఈలోగా రెండో సారి మోగింది బెల్. గడియతీసి, కొద్దిగా తలుపు తెరిచాను. మసక చీకట్లో మెట్లమీద, ఓ వ్యక్తి నిల్చునున్నాడు!

తలుపు పూర్తిగా తెరిచి—"ఎవరు?" అన్నాను.

అతను చేతులు జోడించి—"నమస్తే!" అన్నాడు.

ప్రతి నమస్కారం జేస్తూ పరీక్షగా చూశాను.

అతను నడి వయస్కుడు. తెల్ల పాంటూ, నీలి చొక్కా వేసుకున్నాడు. కాళ్ళకి తెల్లని కేన్వాస్ బూట్సు, నల్లగా, సామాన్య వ్యక్తిలా కనిపిస్తున్న అతని మొహం ఎక్కడో చూసినట్టే వుంది. ఎక్కడ చూశానో సరిగ్గా జ్ఞాపకం రావడం లేదు.

"నన్ను గుర్తు పట్టారా సార్?" అడిగాడతను.

"లేదు! ప్రయత్నిస్తున్నాను."

"నా పేరు అళగప్పన్! మర్చంట్ నేవీలో స్టీవార్డ్‌గా పని చేస్తున్నాను. ఏడాది క్రితం ఇక్కడి హార్బర్లో లంగరు వేసివున్న మా వాణిజ్య నౌకలో ఓ హత్య జరిగింది. అప్పుడు మీరు వచ్చి కొన్ని గంటల వ్యవధిలో నేహంతకుణ్ని పట్టుకున్నారు. నే నింతవరకూ ఆ సంఘటన మర్చిపోలేదు..."

"ఆఁ, జ్ఞాపకం వచ్చింది. ఆ హత్య కేసులో, అప్పుడు ముఖ్యసాక్షివి నువ్వే కదూ?"

అతని కళ్ళు మెరిశాయి. "ఔను సార్!" అన్నాడు.

"అది జరిగి ఇంత కాలమైనా నన్ను గుర్తు పెట్టుకున్నారంటే నీ జ్ఞాపక శక్తి మెచ్చుకోదగ్గదే. నా ఇంటి అడ్రస్ నీకెలా తెలిసింది?" అడిగాను ఆశ్చర్యంగా.

"గంట క్రితం, హార్బర్ రోడ్ గుండా మీరు జీపులో వస్తుంటే చూశాను. టాక్సీలో వెంబడించి వచ్చాను!"

"ఏదైనా సహాయం కావాలా?"

"సహాయం కోసం రాలేదు సార్!"

"మరి?"

అతను కాసేపు తటపటాయించి—"ఎలా చెప్పాలో అర్థం కావడంలేదు. చెబితే మీరు నన్ను పిచ్చివాడికింద జమ కట్టవచ్చు." అన్నాడు.

"ఏడాది క్రితం చూసిన వ్యక్తిని గుర్తుపట్టి, టాక్సీలో వెంబడించి వచ్చిన వ్యక్తి పిచ్చివాడెలా అవుతాడు? రా లోనికి, ఏం చెప్ప దలచుకున్నావో నిస్సంకోచంగా చెప్పు" అన్నాను తలుపు కడ్డం తొలుగుతూ.

అళగప్పన్ లోనికి వచ్చి కూర్చున్నాడు.

"ఈ విషయం పోలీసులకి చెప్పాలనే, హార్బర్ నించి బైలుదేరాను. రోడ్డుమీద కాకతాళీయంగా మీరు కనిపించారు. నాకు మీ పట్లవున్న గౌరవం కొద్దీ ఈ సంగతి మీకు తెల్పడమే ఉచితంగా తోచింది.

ఇక అసలు విషయానికి వస్తున్నాను. మేము వాణిజ్య నౌకలమీద దేశ దేశాలు తిరుగుతుంటామనీ, ఒక్కో దేశంలో వారాల తరబడి మజిలీలు చేస్తుంటామనీ మీకు తెలిసిందే కదా?

ఆరు నెలల క్రితం 'మారుతీ' అనే పేరుగల మా

వాణిజ్య ఓడ ఆఫ్రికా దేశమైన ఉగాండాలో లంగరు వేసింది. నేను కాస్త మందు పుచ్చుకుందామని ఓ బార్‌లో కెళ్ళాను. అక్కడ తప్ప తాగివున్న ఓ ఆఫ్రికన్‌తో నాకు పరిచయం కలిగింది. మాటలమధ్య అతను చెప్పిన ఒక విషయం నా మనసులో నాటుకుపోయింది.

ఆ చుట్టు పక్కలవున్న కొండల్లో యురానియం నిధులు నిక్షిప్తమై వున్నాయిట. ఆ విషయం అతనికి తప్ప మరో ప్రాణికి తెలీదుట. కాస్త ఖర్చు భరించి, శ్రమించి దాని ఉనికి కనుక్కొని, ప్రపంచపు ఐశ్వర్యవంతుల జాబితాలో మనమూ చేరిపోదాం, అన్నాడు.

తాగుబోతు మాటలు తాగుబోతే నమ్ముతాడు మరి. నేను వాడి మాటలు నమ్మాను.

యురానియం ప్రపంచంలోని అతి విలువైన ధాతువు. ఆటంబాంబుల తయారీకి ఎంతో కీలకమైన ధాతువు. అది ప్రపంచంలో చాలా అరుదుగా లభిస్తుంది. యురానియం వున్న ప్రదేశాన్ని కనుక్కోడానికి 'గైగర్ కౌంటర్' అనే చిన్న యంత్రాన్ని ఉపయోగిస్తారు.

ఈ విషయాలన్నీ నేను ఒక సైన్స్ జర్నల్‌లో చదివాను గనక ఆ ఆఫ్రికన్ మాటాత్తుగా ఈ సంగతి ఎత్తేసరికి, ఎలాగైనా ఆ నిక్షేపాన్ని కైవసం చేసుకుని, కోటీశ్వరుణ్ని కావాలన్న కాంక్ష నాలో పాతుకుపోయింది.

మార్కెట్లో 'గైగర్ కౌంటర్' ధర కనుక్కుంటే మూడు వేలని తెలిసింది. నా దగ్గర ఐదు వేలున్నాయి. మూడు వేలు పెట్టి ఆ యంత్రం కొన్నాను. దాంతో బాటు, దాన్ని ఉపయోగించే వివరాలు గల పుస్తకం కూడా యిచ్చారు.

యురేనియం ఎక్కడైతే దాగి వుంటుందో, ఆ ప్రదేశం చుట్టు పక్కల గనక ఆ యంత్రాన్ని తీసికెళ్తే తక్షణం దాంట్లో 'టక టక' చప్పుడు ప్రారంభమౌతుందట. అంతేకాదు, ఆ ధాతువు ఏ దిశలో, ఎంతదూరం వుందో కూడా నీడిల్స్ ఇండికేట్ చేస్తాయిట.

యంత్రాన్ని జేబులో భద్రపరచుకుని, తిన్నగా హార్బర్లో వున్న మా ఓడ చేరుకున్నాను. మర్నాడే మేము భారతదేశానికి ప్రయాణం కావలసి వుంది. భారతదేశం చేరగానే ఆరు నెలలు సెలవు పెట్టి, మళ్ళీ ఉగాండా వచ్చి నా పథకం అమలు జరపాలని నిశ్చయించాను.

అదే రాత్రి ఓ విచిత్రం జరిగింది!

మా ఓడ కేప్టెన్ నన్ను పిలిచి, లగేజ్ కేబిన్‌లోంచి కొంత సామాను మరో కేబిన్‌లోకి చేర్చమని పురమాయించాడు. అతని ఆజ్ఞానుసారం నేను లగేజ్ కేబిన్ లోకి వెళ్ళాను.

'గైగర్ కౌంటర్' ఇంకా నా జేబులోనే ఉంది. నేను లగేజ్ కేబిన్‌లో అడుగు పెట్టగానే అది 'టక టక' చప్పుడు చెయ్యడం ప్రారంభించింది.

ఆశ్చర్యంతో నా బుర్ర దిమ్మెక్కిందంటే నమ్మండి! అంతవరకూ నిశ్శబ్దంగా వున్న ఆ యంత్రం, కేవలం యురేనియం ఉన్న ప్రదేశాన్ని సమీపిస్తూనే చప్పుడు చెయ్యవలసిన ఆ యంత్రం – ఈ కేబిన్‌లో అడుగు పెట్టగానే దేనికి సంకేతం ఇస్తోంది?

కొంపదీసి ఈ కేబిన్‌లో బాంబు లేదుకదా? ఈ ఆలోచన రాగానే, చటుక్కున యంత్రాన్ని బైటికి

తీశాను. శబ్దం ఏకబిగిన వినిపిస్తూనే వుంది. అంతే కాదు. నీడిల్స్ కూడా కదులుతున్నాయి.

దూరాన్ని చూపే ముల్లు పది గజాలు చూపిస్తూంది. దిశను చూపే ముల్లు కేబిన్ కుడిమూల ఉన్న వెడల్పాటి పెద్ద చెక్కపెట్టెని చూపిస్తూంది. దడ దడలాడే గుండెతో ఆ పెట్టె దగ్గరికి నడిచాను. దాన్ని సమీపిస్తున్న కొద్దీ యంత్రం చేసే శబ్దం తీవ్రం కాసాగింది.

ఆ పెట్టె మీద అంటించివున్న లేబిల్ చదివి నిర్ఘాంతపోయాను.

ఆ పెట్టెలో ఆటోమేటిక్ ప్రింటింగ్ మెషిన్ వుంది. అది జపాన్‌నించి భారతదేశానికి వెళుతోంది. మరి 'గైగర్ కౌంటర్' అందులో యురానియం వుందని దేనికి చూపిస్తూందో ఎటూ అర్థంకాలేదు.

ఈ విషయం మా ఓడ అధికార్లకి చెబితే ఎక్కడ నన్ను ఎగతాళి చేస్తారోనని కిమ్మనకుండా ఊరుకున్నాను. కేబిన్‌లోంచి బైటికిరాగానే గైగర్ కౌంటర్‌లోంచి శబ్దం రావడం ఆగిపోయింది. దాంతో, అది తప్పుడు సమాచారం తెల్పలేదని రూఢీ అయింది.

భారతదేశం చేరగానే, అధికార్లకి ఈ సంగతి తెల్పాలని అప్పటికి ఊరుకున్నాను. నేను పుస్తకాల పురుగుని. డిటెక్టివ్ నవలలూ గట్రా విపరీతంగా చదువుతుంటాను. వాటిలో ఒక దేశపు గూఢచారులు మరో దేశాన్ని నాశనం చెయ్యడానికి ఎప్పుడూ కొత్త కొత్త మార్గాలు అన్వేషిస్తూంటారనీ, ఎత్తులకి పైఎత్తులు వేస్తుంటారనీ రాసి వుంటుంది.

ప్రెస్ మెషిన్ పేర ఎవ్వరో ఆ పెట్టెలో బాంబు

ఉంచి మన దేశానికి పంపివుంటారని నా గట్టి నమ్మకం! అందుకే, మీ దగ్గరికి వచ్చాను సార్!"

"చాలా మంచిపని చేశావు అళగప్పన్! ఆ ప్రెస్ మిషిన్ ఇక్కడ ఎవరి పేర పంపబడిందో తెలుసా?"

అళగప్పన్ చేత్తో నుదురు కొట్టుకుని—"ముఖ్య విషయమే మర్చాను సార్!" అన్నాడు.

"డోంట్ వర్రీ! ఆ విషయం నేను కనుక్కుంటాను గానీ, ఆ గైగర్ కౌంటర్ ఇంకా నీదగ్గరే వుందా?"

"సారీ సార్! చెప్పడం మర్చాను. ఆ సంఘటన జరిగిన తరవాత, నా పెట్టెలో దాన్ని భద్రంగా దాచి పడుకున్నాను. ఉదయం లేచిచూస్తే పెట్టెలోంచి యంత్రం మాయమైంది!ఎవ్వరో దాన్ని దొంగిలించారు."

"దొంగిలించారా?"

"ఔను సార్! ఎంత వెతికినా మళ్ళీ దొరకలేదది. దాంతో నా అనుమానం మరీ బలపడింది."

సాలోచనగా తలూపాను. "ఆల్ రైట్! ఆ ప్రెస్ మెషిన్ ఓడలోంచి దించారా?"

"లేదు సార్! రేపు దించుతారుట."

రిస్టువాచీ చూసుకున్నాను. ఒంటిగంట.

"ఇప్పుడు చాలా పొద్దుపోయింది. తెల్లారగానే హార్బర్ వచ్చి సంగతేమిటో కనుక్కుంటాను. అలాగే, ఓ గైగర్ కౌంటర్ కూడా నా వెంట తెస్తాను. నీవు ఓడలోనే వుంటావుగా?"

అళగప్పన్ తలూపి, నాదగ్గర సెలవు తీసుకుని వెళ్ళిపోయాడు. అతన్ని గుమ్మంవరకూ సాగనంపి తలుపు మూశానో లేదో, టెలిఫోన్ మోగసాగింది.

రిసీవర్ అందుకుని-"సారథి స్పీకింగ్!" అన్నాడు.

"సారథీ! వెంటనే బైలుదేరి హెడ్‌క్వార్టర్స్‌కి రా. ముఖ్య విషయం!" అవతలనించి మా డైరెక్టర్ ముఖర్జి గారి కంఠం వినిపించింది.

నా కనుబొమలు ముడిపడ్డాయి. "ఓ. కే. సర్! ఇప్పుడే వస్తున్నాను." అని రిసీవర్ దించాను.

ఎంతో ముఖ్యవిషయమైతే తప్ప ఆయనిలా అర్ధరాత్రి కబురు చెయ్యరు. ఆదరాబాదరా తయారై, జీప్ ఎక్కి బైలుదేరాను.

## 2

"ప్లీజ్, టేక్ యువర్ సీట్!" అన్నారు ముఖర్జీ.

ఆయనకెదురుగా కూర్చున్నాను.

బల్లమీద ఓ పసుపురంగు ఫైల్ ఉంది. ఆయన దాన్ని తెరిచి, ఓ కేబినెట్ సైజు ఫోటో తీసి నా ముందుకి తోశారు.

"విషయం ప్రారంభించేముందు ఈ ఫోటో ఒకసారి చూడు." అన్నారు. ముప్ఫై ఏళ్ళ వ్యక్తి ఫోటో అది. విశాలమైన పాలభాగం. నొక్కుల జుత్తు. కళ్ళకి అద్దాలు. మొహంలో డిగ్నిటీ కనిపించింది.

"ఎవ్వరితను?" అడిగాను.

"ప్రొఫెసర్ గుల్ హాసన్! ఇతను పాకిస్తానీయుడు. పదిహేను రోజులక్రితం పాకిస్తాన్ నించి పారిపోయి వచ్చి మన దేశంలో రాజకీయ శరణ్యం కోరాడు. ఆర్తులను ఆదుకోవడం ఆనాటినించీ వస్తున్న మన ఆచారం గనక, ప్రభుత్వం వెంటనే ఇతనికి రాజకీయ శరణ్యం ఇచ్చింది.

పాకిస్తాన్‌లో ఇతను బేలాస్టిక్ మెజాయిల్ రీసెర్చ్ సెంటర్ డైరెక్టర్‌గా పనిచేసేవాడు. ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటీలో చదువుకున్నాడు.

విచిత్రం ఏమిటంటే, మనదేశం ఇతనికి శరణు ఇచ్చి పదిహేను రోజులైనా పాకిస్తాన్ ఇంతవరకూ ఎలాటి ఆక్షేపణా తెల్పలేదు.

మీ దేశంనించి ఎందుకు వచ్చేశారు? అని ఇతన్ని ప్రశ్నిస్తే సరైన జవాబు లివ్వకుండా, ఏవో పుల్ల విరుపు కారణాలు చెబుతున్నాడు. హోం మినిస్ట్రికి ఇతనిపై అనుమానం ఉంది. ఆ అనుమానాన్ని పైకి వ్యక్తం చెయ్యడంలేదు. చేస్తే మనం ఎక్కడ నవ్వులపాలవుతామో అని భయం.

ఆ దేశంలో ఇతను మంచి హోదాలో వున్నాడు. గౌరవప్రదమైన జీవితం గడుపుతున్నాడు. డబ్బా దస్కానికి కొదవలేదు. అంత మంచి పొజిషన్ వదులుకుని హాఠాత్తుగా మన దేశం వచ్చేసి, ఇక్కడ స్థిరపడా లనుకున్నాడంటే ఎవ్వరికైనా అనుమానం వేస్తుంది మరి!

అందుకే, రహస్యంగా ఇతనిపై నిఘా ఉంచాలని నిశ్చయించాం. ఆ డ్యూటీ నీకే అప్పగిస్తున్నాను. నిఘా ఎంత రహస్యంగా ఉంచాలంటే, మనకు తప్ప మరో ప్రాణికి తెలియకూడదు. తెలిస్తే, విదేశాల్లో మనం అప్రతిష్ట పాలవుతాం!''

చురుగ్గా పనిచేస్తున్న నా బుర్రలో తళుక్కుమంది ఓ మెరుపు.

''సర్! ఇంతక్రితం ఇతని పేరు ఎక్కడో విన్న

ట్టుంది'' అన్నాను.

''పేపర్లో ఎప్పుడో చదివి వుంటావ్!''

''నో సర్! పేపర్లో రోజూ లక్షా తొంభైమంది పేర్లు వస్తుంటాయి, వాటిలో ఏ కొద్దిమందో మన మస్తిష్కాల్లో ముద్ర వేసుకుంటారు. ఉదాహరణకి, చంద్ర లోకంపై కాలు మోపిన తొలి మానవుడెవరు? అని ప్రశ్నిస్తే తడుముకోకుండా, నీల్ ఆర్మ్‌స్ట్రాంగ్ అంటాం. అదే, అతనివెంట వెళ్ళిన మిగతా ఇద్దరి పేర్లేమిటని అడిగితే గుర్తురాక బుర్ర గోక్కుంటాం.

అలాగే, ఇతని పేరుతో పాటు ఏదో ముఖ్యమైన సంఘటన చదివినట్టు నా అనుమానం. అడగటం మర్చాను. పాకిస్తాన్ నించి ఇతను ఒక్కడే వచ్చాడా? భార్యా పిల్లలుకూడా వచ్చారా?''

''భార్యా లేదూ, పిల్లలూ లేరు. ఇతనింకా అవివాహితుడు!''

''అదేమిటి? మంచి పొజిషన్‌లో వుండీ, మంచి రాబడి వుండీ ఇతనింకా పెళ్ళి చేసుకోలేదంటే...అఁ...ప్రొఫెసర్ గుల్‌హాసన్! జ్ఞాపకం వచ్చింది సార్! ఒలంపిక్ ఆటల పోటీల సందర్భంలో ఇతని పేరు విన్నట్టుంది. ఆ పోటీల్లో పాకిస్తాన్ చెందిన ప్రొఫెసర్ గుల్‌హాసన్ అనే వ్యక్తి 'స్కీయింగ్' గేమ్‌లో బంగారు పతకం గెలుచుకున్నట్టు చదివాను. అతనే ఇతనయుంటాడు.''

''విన్నంత మాత్రాన, దానికీ దీనికీ ఏమిటి సంబంధం?''

''ఏదో సంబంధం వున్నట్టు నా అంతరాత్మ చెబుతోంది. ఇంకా స్పష్టంగా గుర్తు రావడం లేదు. నేనొక ప్రశ్న వేస్తాను. బదులివ్వండి. ఒక వ్యక్తి ఏ కారణాల

వల్ల తన మాతృదేశం వదిలి, పరాయి దేశం వెళ్ళి పోడానికి ప్రయత్నం చేస్తాడంటారు?"

"దానికి కారణాలు రెండే! ఒకటి, ఆదేశంలో ఆ వ్యక్తికి ఏదో లోటు, లేదా ప్రాణభీతి వుండి వుంటుంది. తన దేశం పెట్టే బాధలు భరించలేక మరోదేశం వెళ్ళి బ్రతకాలనుకుంటాడు. రష్యన్ ప్రజలు తరుచూ ఇలా చేస్తుంటారు. రెండవ కారణం గూఢచారి చర్యల కోసం!"

నవ్వి—"ముఖ్యమైన మూడో విషయాన్ని విస్మరించారు మీరు!" అన్నాను.

"అదేమిటి?"

"ఆడది!"

"స్త్రీ కోసం దేశాన్ని వదులుకుంటారా?"

"ఎందుకు వదులుకోరు? ఇలా సంఘటనలు చరిత్రలో కోకొల్లలు. ఆడదానికోసం మగాళ్ళు ఏమేం చెయ్యలేదు? ప్రిన్స్ ఆఫ్ వేల్స్ తను కోరుకున్న స్త్రీ కోసం బ్రిటిష్ సింహాసనాన్నే వదులుకుని దేశబహిష్కృతుడు కాలేదా? ఆడదానికోసం హత్యలూ, ఆత్మహత్యలూ జరగడం లేదా?

ఇతను కూడా ఎవ్వరినో ప్రేమించి వుంటాడు. ఆ యువతి మన దేశంలోనే వుండి వుంటుంది. లేదా, ఏ కారణాలవల్లో పాకిస్తాన్ నించి వచ్చి మనదేశ పౌరసత్వం తీసుకుని వుంటుంది. ఆమెని పొందడానికే తనూ వచ్చి వుంటాడు గుల్ హసన్!"

"అదే నిజమైతే, మరి ఆ విషయం చెప్పడేం?"

"చెబితే అందరూ నవ్వుతారేమో నని మొహమాట

పడుతున్నాడేమో! లేదా, అతను ప్రేమించిన యువతి, మన దేశంలో ఎక్కడుందో అతనికే తెలియదేమో?"

"నీ తర్కం బాగానేవుంది. ఏది ఏమైనా నువ్వు మాత్రం అతనిపై గట్టి నిఘావుంచి, అతను గూఢచారి కాడని ఋజువు చెయ్యాలి!"

"ఆల్ రైట్! అతనిప్పు డెక్కడుంటున్నాడు?"

"ప్రభుత్వ గెస్ట్ హౌస్‌లో! పాక్ ప్రభుత్వం తనపై కక్ష తీర్చుకోడానికి ఎవ్వరి చేతనైనా తనని చంపించ వచ్చనీ, తనకి రక్షణ కావాలనీ కోరాడు. ఇద్దరు సెక్యూరిటీ ఆఫీసర్లు ఎప్పుడూ అతనివెంట వుంటున్నారు. అదంతా నటన కావచ్చు, ఖచ్చితంగా చెప్పలేను!" అన్నారు ముఖర్జీ.

"నేనతన్ని ప్రెస్ రిపోర్టర్ రూపంలో కలుసుకుని మాట్లాడి, అతన్ని క్షుణ్ణంగా స్టడీ జెయ్యాలనుకుంటున్నాను."

"అతను వచ్చినప్పట్నుంచీ మన పత్రికా విలేఖర్లు మా మీద ఒత్తిడి చేస్తున్నారు, ఒక్కసారి ఇంటర్వ్యూ చెయ్యడానికి అనుమతించమని. వారి ఒత్తిడి భరించలేక, రేపు సాయంత్రం ఐదు గంటలకు గెస్ట్‌హౌస్‌లో ప్రెస్ మీటింగ్ ఏర్పాటు చేశాం. అందులో గుల్ హసన్ పత్రికా విలేఖర్లని కలుసుకుంటాడు!"

"సరే, నేనూ అక్కడే అతన్ని కలుసుకుంటాను. గుడ్ నైట్!" అంటూ లేచాను.

# 3

ఉదయం అదరాబాదరా కాలకృత్యాలు తీర్చుకుని, జీప్‌లో సిటీ లైబ్రరీ చేరుకున్నాను. పాత న్యూస్

పేపర్సన్నీ తీయించి, ఓపిగ్గా పరిశీలించసాగాను. నాకు కావలసిన దిన పత్రిక దొరకనే దొరికింది.

నాలుగేళ్ళ క్రితం మెక్సికోలో జరిగిన ఒలంపిక్ పోటీల వివరాలున్నాయందులో. ఓ హెడ్ లైన్ మీద దృష్టి నిలిపాను.

"పాక్ రెండు బంగారు పతకాల గెలుపు."

మెక్సికో, నవంబర్ 19 :—ఇక్కడ జరుగుతున్న ఒలంపిక్ పోటీల్లో పాకిస్తాన్ కు చెందిన ప్రొఫెసర్ గుల్ హాసన్ స్కీయింగ్ పోటీలో బంగారు పతకం గెలుచుకున్నారు. అదే దేశానికి చెందిన మిస్ షబ్నమ్ అనే యువతి, స్త్రీల నూరు మీటర్ల పరుగు పందెంలో బంగారు పతకం గెలుపొందింది. ఒకే దేశానికి చెందిన ఈ విజేతలు ప్రేమాయణంలో పడ్డారని పరిశీలకుల ఊహాగానం!

ఆ వార్త కిందే ఓ ఫోటో ప్రచురించేరు. ఫోటోలో ప్రొఫెసర్ గుల్ హాసన్, ఓ అందమైన యువతీ పరస్పరం కరచాలనం చేస్తూ నవ్వుతున్నారు.

సాలోచనగా తలూపాను. నా అనుమానం నిజమే అయింది! తిన్నగా మైగ్రేషన్ ఆఫీస్ కెళ్ళి కనుక్కోవాలి. అక్కడ ఇతర దేశాలనించి మన దేశానికి వచ్చి పౌరసత్వం తీసుకుని స్థిరపడే వ్యక్తుల వివరాలు నమోదై వుంటాయి.

షబ్నమ్ అనే యువతి పాకిస్తాన్ నించి వచ్చి పౌరసత్వం తీసుకుందేమో అక్కడ తెలుసుకోవాలి.

ఆ పేపర్ తో సహా, హుటాహుటిన మైగ్రేషన్ ఆఫీస్ చేరుకున్నాను.

నా అంచనా కరెక్టే!

ఏడాది క్రితం, షబ్నమ్ అనే పాతికేళ్ళ యువతి మన దేశం వచ్చి, ఇక్కడి పౌరసత్వం స్వీకరించింది. రిజిస్టర్‌లో ఆమె తాలూకు పాస్‌పోర్ట్ సైజు ఫోటో కూడా వుంది. ఆ ఫోటోలోవున్న యువతీ, పేపర్లో ప్రచురించబడ్డ యువతీ ఒక్కరే!

ఆమె ప్రస్తుతం బొంబాయిలో వున్నట్టు రాసివుంది. ఆ చిరునామా నోట్ చేసుకుని, తక్షణం బొంబాయి ఎఫ్. బి. ఐ. బ్రాంచికి ట్రంకాల్ చేసి, డైరెక్టర్‌తో మాట్లాడాను. ఆ యువతి ఇప్పుడు బొంబాయిలోవుందో లేదో వెంటనే కనుక్కొని నాకు తెల్పమని. రేపువుదయం లోగా వివరాలు తెలీచేస్తానని చెప్పాడతను.

ఒక సమస్య విడిపోయింది. ఇహ, ప్రొఫెసర్ గుల్‌హాసన్ నిజంగా ఆ అమ్మాయి కోసమే వచ్చాడా, లేక గూఢచారి చర్యలు జరపడానికి వచ్చాడా? అన్న సందేహాలని దృఢపర్చుకోవాలి ఎలా?

తీవ్రంగా యోచించాను. ఓ ఉపాయం తట్టింది!

ప్రతి దేశంలోనూ డబ్బుకోసం గడ్డితినే మనుషులుంటారు. వారికి తమ దేశమూ, పరాయి దేశమూ అనే అపేక్షలూ మమకారాలు వుండవు. వారు డబ్బుకోసం మాతృదేశ రహస్యాలని సైతం శత్రుదేశానికి అమ్ముకుంటారు.

అటువంటి ప్రొఫెషనల్ కేడీ రూపంలో ఆ ప్రొఫెసర్ని కలుసుకోవాలి. పరిచయం పెంపొందించుకోవాలి. ఆ విధంగా అతని నిజనైజాన్ని వాసనపట్టే అవకాశం కలుగుతుంది.

# 4

సాయంత్రం సరిగ్గా ఐదుగంటలకి, గెస్ట్‌హౌస్ ముందు జీప్ ఆపి దిగాను.

అప్పటికే పత్రికా విలేఖర్లతో గెస్ట్‌హౌస్ హాలు కిట కిట లాడుతోంది. వారి ప్రశ్నలకి ప్రొఫెసర్ గుల్‌హాసన్ చిరునవ్వుతో సమాధానాలిస్తున్నాడు. అతని వెంట ఇద్దరు సెక్యూరిటీ అధికార్లుకూడా వున్నారు.

ఆగి ఆగి కెమెరా ఫ్లాష్ బల్బులు వెలుగుతున్నాయి.

ఒక్కొక్కర్ని తప్పుకుంటూ గుల్‌హాసన్ని సమీపించాను. అతనికాస్త వెసులుబాటు దొరగ్గానే అదును చూసి—"ప్రొఫెసర్! షబ్నమ్ ఎక్కడుందో నాకు తెలుసు!" అన్నాను రహస్యంగా.

ఈ వాక్యం వినగానే అతను తేలు కుట్టినట్టు ఉలిక్కి పడి నావైపు తిరిగాడు.

"మళ్ళీ కలుసుకుందాం! వస్తాను" అంటూ అక్కడ ఆగకుండా ఇవతలికి వచ్చాను.

వస్తూ, ప్రొఫెసర్ నావైపు గుడ్లు తేలేసి చూస్తుండటం గమనించాను.

నా వాక్యం విని, అతని మొహంలో వచ్చిన మార్పు చూశాక, నిజంగా అతను షబ్నమ్ కోసమే ఇక్కడికి వచ్చి వుంటాడని వ్యక్తమౌతోంది.

జీప్‌లో కూర్చోగానే సడన్‌గా జ్ఞాపకం వచ్చాడు అళగప్పన్.

ఈ రోజు ఉదయం అతన్ని కలుసుకుంటానని చెప్పాను. అనుకోకుండా ఈ కొత్తపని తగలడంతో ఆ సంగతే మర్చాను. నేను రాకపోడంతో అతను నిరుత్సాహ పడుంటాడు.

జీప్ స్టార్ట్ చేసి, హార్బర్ వైపు పరిగెత్తించాను.

హార్బర్లో ఓ చోట లంగరు వేసివుంది 'మారుతీ' ఓడ. అప్పటికే చీకటిపడింది. హార్బర్లో లైట్లు వెలుగుతున్నాయి. తిన్నగా ఓడలోకెళ్ళి అశిగప్పన్ ఎక్కడుంటాడని అడిగాను ఓ కర్మచారిని.

"లోనికెళ్తే కుడివైపు స్టీవార్డ్స్ కేబిన్స్ కనిపిస్తాయి కేబిన్ నెంబర్ ఐదులో ఉంటాడు అశిగప్పన్!" అన్నాడతను.

ఆ వివరాలనిబట్టి అశిగప్పన్ కేబిన్ కనుక్కోడం కష్టంకాలేదు.

కేబిన్ తలుపు మూసివుంది. మునివేళ్ళతో మెల్లగా తట్టాను.

జవాబు లేదు!

లోపల వున్నాడో లేదో అనుకుంటూ కాస్త గట్టిగా తట్టబోయాను. చెయ్యి పడగానే తలుపు కిర్రుమంటూ తెరుచుకుంది.

ఆశ్చర్యంతో లోన అడుగుపెట్టాను.

చీకటి!

"అశిగప్పన్!" పిలిచాను.

నిశ్శబ్దం!

జేబులోంచి లైటర్ తీసి వెలిగించాను. ఆ వెలుగులో, పైన కనిపించిన దృశ్యం చూసి వేరొకరైతే గావు కేక పెట్టేవారే!

నిన్న రాత్రి సజీవంగా నన్ను కలుసుకుని, ఎంతో ముఖ్యమైన వివరాలు అందించిన అశిగప్పన్, ఇప్పుడు కేబిన్ మధ్య తాడుకి నిర్జీవంగా వేళాడుతున్నాడు.

ఉచ్చులో బిగుసుకుని కంఠం ఉబ్బి ఉంది. కళ్ళూ, నాలికా వెళ్ళుకు వచ్చాయి.

ఎవ్వరో అతన్ని ఉరితీశారు!

ఉదయం వచ్చి అతన్ని కలుస్తానని చెప్పి రానందుకు నన్ను నేను తిట్టుకున్నాను. ఆ దృశ్యం ఇక చూడ లేక, లైటర్ ఆర్పి ఇవతలికి వచ్చాను. తలుపు యధా ప్రకారం మూసి, గబ గబ హార్బర్ ఆఫీస్ చేరు కున్నాను.

అక్కడి అధికార్లకి నా ఐడెంటిఫికేషన్ కార్డు చూపి అళగప్పన్ చెప్పిన ప్రింటింగ్ మెషన్ గురించి అడి గాను.

అది ఈరోజే డెలివరీ అయిందిట! జపాన్ నించి దాన్ని ఎవ్వరైతే తెప్పించారో వాళ్ళు వచ్చి, రసీదులు చూపెట్టి తీసికెళ్ళారుట.

సాగరంలాంటి ఈ మహానగరంలో ఆ మెషిన్ ఎక్కడికెళ్ళిందని ఎలా కనుక్కోడం? అళగప్పన్ హత్యతో, అందులో తప్పక ఏదో దాగివుందని స్పష్టమౌ తోంది.

క్షణం వృధా చెయ్యకుండా, జీప్‌లో హెడ్ క్వార్టర్ చేరుకుని, అళగప్పన్ నన్ను కలుసుకోడం దగ్గ్గరించీ, ఇంతవరకూ జరిగిందంతా డైరెక్టర్ ముఖర్జీ గారికి నివేదించాను.

అంతా విన్న ఆయన కనుబొమలు ముడివడ్డాయి— చాలా సీరియస్ విషయమే!'' అన్నారు గంభీరంగా.

''నేను ప్రొఫెసర్ వ్యవహారంలో మునిగి తేలు తున్నాను. ఒకపనిలో తలదూర్చి దాన్ని పూర్తి చెయ్యా

కుండా మరో పని చేపట్టడం నా తత్వానికి విరుద్ధం. ఆ ప్రింటింగ్ మెషిన్ని హార్బర్‌నించి ఎవ్వరు తీసి కెళ్ళారో కనుక్కోడానికి మరెవ్వరైనా నియమించండి'' అన్నాను.

ముఖర్జీ తలూపి ''ఈ క్రొత్త కేసు చేపట్టిన తరుణంలో, నీకో కొత్త ఆయుధం ఇవ్వబోతున్నాను'' అంటూ బల్ల సొరుగు లాగి, ఓ ఫౌంటెన్ పెన్ తీశాడు.

''ఇదా ఆయుధం?''

''ఇది మన డిఫెన్స్ రిసెర్చ్ డిపార్టుమెంట్ వారు తయారుచేసిన కొత్త ఆయుధం! ప్రథమంగా మన విభాగానికి సప్లై చెయ్యబడింది. ఇది చూడటానికీ, రాయడానికీ మామూలు పెన్! కాని, ఇందులో శక్తివంతమైన రెండు డైనమైట్ స్టిక్స్ వున్నాయి.

ప్రమాదం ముంచుకు వచ్చినప్పుడు, ఆత్మరక్షణ కోసం దీన్ని ఉపయోగించవచ్చు. డైనమైట్ పేల్చాలనుకుంటే దీని క్యాప్ తీసి పెన్ వెనక పెట్టి, గట్టిగా వత్తి వదలాలి. రెండునిమిషాల తర్వాత స్టిక్స్ పేలతాయి. గండం గట్టెక్కుతుంది!'' అన్నారు ముఖర్జీ.

పెన్ అందుకుని కాసేపు పరిశీలించాను. ''ఇటువంటి ఉత్తమ ఆయుధాన్ని సృష్టించినవారిని స్తుతించాల్సిందే! ప్రాణ సంకట పరిస్థితిలో దీనితో ప్రమాదాన్ని సులువుగా తప్పించుకోవచ్చు'' అంటూ లేచాను.

## 5

ఆయనదగ్గిర సెలవు తీసికొని, తిన్నగా గెస్ట్ హౌస్‌కు బయలుదేరాను. ప్రొఫెసర్ గుల్ హసన్ రక్షణ కోసం నియమించబడ్డ ఇద్దరు సెక్యూరిటీ అధికార్లు వరండాలో

కూర్చుని మాట్లాడుకుంటున్నారు. నన్ను గుర్తుపట్టి లేచి నిలుచున్నారు.

"ప్రొఫెసర్ ఎక్కడ?" అడిగాను వాళ్ళని.

"లోపల గదిలో ఉన్నాడు. అతన్ని కలుసుకోడానికి వచ్చారా?"

"ఔను. మీరు నాతో సహకరించాలి. నేను సి. బి. ఐ. అధికారినని అతని కేమాత్రం తెలియకూడదు. ఇది చాలా సీక్రెట్ మేటర్!" అన్నాను తగ్గు స్వరంలో.

"ఓ. కే. సర్!"

"థాంక్స్!" అంటూ లోనికి నడిచాను.

ప్రొఫెసర్ గది తలుపు మూసివుంది. మునివేళ్ళతో మెల్లిగా తట్టాను.

"ఎవ్వరు?" లోపలనించి వినిపించింది.

నేను పలకలేదు. మళ్ళీ తట్టాను.

రెండు నిమిషాల తరవాత తలుపు తెరుచుకుంది.

నన్ను చూడగానే ప్రొఫెసర్ ఉలిక్కిపడ్డాడు.

చిన్నగా నవ్వాను.

ఆశ్చర్యంనించి తేరుకుని లోనికి రమ్మన్నట్టు దారి ఇచ్చాడు.

గదిలో అడుగుపెట్టాను.

"సబ్జెక్ట్ ఎలా తెలుసు మీకు?" అడిగాడు ప్రొఫెసర్ కంఠం తగ్గించి.

"ఇతర్ల రహస్యాలు కనుక్కొని, అమ్మి డబ్బు గడించడం నా వృత్తి. నాకు ఒక దేశం గానీ, ఒక నీతిగానీ లేదు. డబ్బే నా నీతి. డబ్బే నా ధర్మం!" అన్నాను నవ్వుతూ.

ప్రొఫెసర్ క్షణంపాటు కన్నార్పకుండా నన్ను

చా నుండిపోయాడు.

"షబ్నమ్ భారతదేశంలో ఎక్కడుందో మీకు తెలియదా?" అడిగాను.

"తెలియదు. ఆమెని వెతకడానికే ఇక్కడికి వచ్చాను. దొరికితే వివాహం చేసుకుని ఇక్కడే స్థిరపడతాను!"

"ఆమెని వెతకడానికి మీరు తంటాలు పడటం దేనికి? భారత ప్రభుత్వానికి మీ విషయమంతా వివరించి సహాయం కోరితే, అధికార్లు వెదికిపెడతారుగా?"

ప్రొఫెసర్ నిట్టూర్చాడు. "నేను సహాయం కోరలేను. కోరితే, షబ్నమ్ ప్రాణాలకే ముప్పు ఏర్పడవచ్చు. నేను ఆమెకోసమే ఇక్కడికి వచ్చినట్టు మరెవ్వరికీ తెలియకూడదు."

పాకిస్తాన్‌లో నేను కీలకమైన హోదాలో వుండేవాణ్ని, మిజాయిల్ రిసెర్చ్ సెంటర్ డైరెక్టర్‌గా! ఆ దేశపు అటమిక్ ప్రాజెక్ట్ రహస్యాలన్నీ నాకు తెలుసు. ఆ దేశం వదిలి నాకు నేనుగా ఇక్కడికి వచ్చాను. అలాంటప్పుడు పాకిస్తాన్ నాపైనగానీ, భారతదేశం మీదగానీ నిందలు మోపలేదు.

అలాగని నావంటి వ్యక్తిని వదులుకోనూ లేదు. నా ద్వారా భారతదేశానికి తమ అటమిక్ రహస్యాలు ఎక్కడ వెల్లడౌతాయోనని భయం! నేను కేవలం షబ్నమ్ కోసమే ఇక్కడికి వచ్చానన్న విషయం బయటపడితే, పాకిస్తాన్ తన గూఢచారుల్ని పంపి, షబ్నమ్‌ను తుదముట్టించవచ్చు.

ఎవ్వరికోసమైతే నేనిక్కడికి వచ్చానో, ఆ వ్యక్తే ఈ లోకంలో లేనప్పుడు నా కిక్కడేం పని? తిరిగి

పాకిస్తాన్ వెళ్ళిపోతాను. అవిధంగా నన్ను రప్పించుకోడానికి పాకిస్తాన్ పథకం వెయ్యవచ్చు.

అందుకే నేను షబ్నమ్ సంగతి వెల్లడించడం లేదు. సాయంత్రం ప్రెస్ మీటింగ్‌లో మీరు ఆమె పేరు ఎత్తేసరికి నా గుండె ఆగిపోయినంత పనయింది. ఆమె ఎక్కడుందో మీకు తెలుసా? తెలిస్తే చెప్పండి. ఎంత కావాలన్నా ఇస్తాను.'' అన్నాడు ఆతృతగా.

''షబ్నమ్ చిరునామా కనుక్కున్నాను. కాని, ఆమె ఇప్పటికీ అక్కడే ఉందో లేదో స్పష్టంగా తెలీదు. ఆ విషయం ధృవపర్చుకుని మళ్ళీ వస్తాను. అప్పుడే, నా కెంత కావాలో బేరం పెడతాను.''

''మంచిది. మీకోసం ఆతృతగా ఎదురుచూస్తుంటాను,'' అన్నాడు గుల్ హసన్.

## 6

మర్నాడు ఇంట్లోంచి, బొంబాయి ఎఫ్. బి. ఐ. బ్రాంచికి ట్రంకాల్ చేశాను. లైన్ దొరగ్గానే— ''షబ్నమ్ గురించి కనుక్కున్నారా?'' అడిగాను డైరెక్టర్ని.

ఆయన నవ్వాడు. ''మిస్టర్ సారథీ! చంకలో పిల్లనెత్తుకుని ఊరంతా వెదికినట్టుంది మీ వ్యవహారం!''

''ఏమిటీ?'' అన్నాను అర్థంకాక.

''మీరిచ్చిన చిరునామా ఆధారంతో షబ్నమ్ కోసం ఆరాతీశాం. ఆమె ఇక్కడ కొన్ని రోజులే వుండి, తరవాత పూనా వెళ్ళిపోయిందని తెలిసింది. వెంటనే పూనాలోని మా బ్రాంచికి తెలీచేసాం, ఆమె గురించి కూపీ తియ్యమని.

సాయంత్రంలోగా వాళ్ళు రిపోర్ట్ పంపారు, ఆమె రెండురోజుల క్రితం ఢిల్లీ వెళ్ళిందని. తక్షణం మా ఢిల్లీ హెడ్ క్వార్టర్ కి మెసేజ్ పంపాము. ఆమె వివరాలు ఆరా తీసి మాకు రిపోర్టియ్యమని. వారు వెంటనే ఓ లేడీ ఏజెంట్ ను ఈ పనికి నియమించారుట. ఆమె పేరు ఉదయవేణి! మీరక్కడే వున్నారు గనక, ఉదయవేణిని కలుసుకుని వివరాలు తెలుసుకోండి'' అన్నాడు డైరెక్టర్.

ఆయనకి థాంక్స్ చెప్పి రిసీవర్ దించాను.

స్థానిక ఎఫ్.బి.ఐ. హెడ్ క్వార్టర్ కి రింగ్ చేసి రిసీవర్ అందుకున్నాను.

''ఎస్!'' అన్నాడు ఆపరేటర్.

నాగురించి చెప్పి—''మీ ఏజెంట్ ఉదయవేణితో మాట్లాడాలి.'' అన్నాను.

''వెయిట్ ప్లీజ్!'' అన్నాడు ఆపరేటర్.

పది నిమిషాల తరవాత లైన్ లోకి వచ్చింది ఉదయవేణి.

ఆమెకి నన్ను పరిచయం చేసుకొని, నా ఇంటి చిరునామా చెప్పి, తక్షణం బైలుదేరి రమ్మన్నాను.

గంట తరవాత కాలింగ్ బెల్ మోగింది.

వెళ్ళి తలుపు తెరిచాను.

''నమస్తే! నేను ఉదయవేణిని!'' అంది ఆమె.

ప్రతి నమస్కారం చేసి, లోనికి ఆహ్వానించాను.

సోఫాల్లో కూర్చున్నాక షబ్నమ్ విషయం ఎత్తాను.

''బొంబే బ్రాంచినించి మెసేజ్ రాగానే ఆమె గురించి వాకబ్ చెయ్యడానికి నన్ను నియమించారు. ఏర్

పోర్ట్‌లో కనుక్కుంటే అన్ని వివరాలూ తెలిశాయి. ఆమె పూనానించి ఇక్కడికి ప్లేన్‌లో వచ్చింది. ప్లేన్ దిగగానే ఓ టాక్సీ ఎక్కి వెళ్ళింది. కొద్ది ప్రయాసతో ఆ టాక్సీని కనుక్కోగలిగాను. ఏర్‌పోర్ట్‌నించి ఆమెని తిన్నగా 'వనితా నివాస్' లాడ్జింగ్ ముందు దింపానని చెప్పాడు డ్రైవర్.

ఆమె టాక్సీ దిగి, సామానుతో లాడ్జింగ్‌లో కెళ్ళిందిట. అది నగరంలో ఉన్న ఒకే ఒక లేడీస్ లాడ్జింగ్.

అందులో ఆడవాళ్ళకి తప్ప మగాళ్ళకి ప్రవేశం లేదు. నగరంలో ఒంటరిగా వుండి ఉద్యోగాలు చేసుకుంటున్న ఆడవాళ్ళూ, ఇంకెక్కడినించో పనిమీద ఒంటరిగా వచ్చినవాళ్ళూ ఉంటారక్కడ. వాళ్ళని కలుసుకోడానికి ఎవ్వరైనా మగాళ్ళు వస్తే లోనికి వెళ్ళనివ్వరు. రిసెప్షన్‌లో కూర్చుని మాట్లాడవలసిందే.

ఆ లాడ్జింగ్ కెళ్ళి వాకబ్ చేశాను. షబ్నమ్ పేరుగల యువతి ఎవ్వరూ అక్కడ లేరని తెలిసింది! అంతక్రితం కూడా ఆ పేరుగల వ్యక్తి అక్కడ దిగలేదుట.''

''బహుశా, షబ్నమ్ మారుపేరుతో గది తీసుకుందేమో?''

''నాకూ ఆ అనుమానం వచ్చింది. అంతమాత్రాన ఎలా కనుక్కోడం? ఆమె పేరుతప్ప నాకామె ముఖ పరిచయం లేదుకదా?''

గబ గబ లోనికెళ్ళి, నిన్న లైబ్రరీనించి తెచ్చిన న్యూస్ పేపర్ పట్టుకొచ్చాను. అందులో ప్రచురించబడ్డ ఫోటో ఉదయవేణికి చూపెట్టి—''ఈ అమ్మాయే షబ్నమ్!'' అన్నాను.

"గుడ్! ఇప్పుడీమెని లాడ్జింగ్‌లో కనుక్కోడం కష్టం కాదు. పదండి," అంది.

ఇద్దరం జీప్ ఎక్కి, లాడ్జింగ్ చేరుకున్నాం.

ఉదయవేణి న్యూస్‌పేపర్ అందుకుని దిగింది. ఇంజన్ ఆఫ్‌చేసి ఆమె వెనకేలోనికి నడిచాను. కౌంటర్లో ఓ మధ్య వయసావిడ కూర్చునుంది.

నేను రిసెప్షన్‌లోవున్న సోఫాలో చతికిలబడి చూడసాగాను. ఉదయవేణి ఆమెకు పేపర్ చూపిస్తూ మాట్లాడుతోంది. ఆమె తలూపి, రిజిస్టర్ చూసి ఏదో చెప్పింది. ఉదయవేణి గబ గబ నా దగ్గరికి వచ్చి—

"మీరు చెప్పింది నిజమే! పున్నమ్ కవిత అనే పేరుతో ఇక్కడ వుంటోంది. సెకండ్ ఫ్లోర్‌లో ఆమె రూం నెంబర్ పదహారుట, ముందు నే వెళ్ళి చూసివస్తాను. మీ రిక్కడే కూర్చోండి!" అంది.

తలూపాను.

ఉదయవేణి చక చక మెట్లవైపు నడిచింది.

సిగరెట్ అంటించి, టీపాయ్ మీద పడున్న ఫిలిం ఫేర్ అందుకున్నాను.

గంట గడిచినా ఉదయవేణి తిరిగి రాలేదు!

పత్రిక టీపాయ్ మీద పడేసి, లాడ్జింగ్ లోపలికి వచ్చే పోయే స్త్రీలని చూస్తూ, ఓపిగ్గా కూర్చున్నాను.

సడన్‌గా నా దృష్టి, అప్పుడే బైటనించి లాడ్జింగ్ లోకి వచ్చిన ఓ స్త్రీ మీద నిలిచింది. ఆమె తల నించీ పాదాల వరకూ, ముస్లిం స్త్రీలు వేసుకునే బురఖాలో వుంది, ఆమె ఆకారం చూసి కాసేపు చకితున్నయ్యాను!

సాధారణంగా స్త్రీలు అంత పొడుగుండరు, ఆమె

అటూ ఇటూ చూడకుండా పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ మెట్లవైపు వెళ్ళింది. నేనే కాదు, నాతోబాటు కౌంటర్లో కూర్చున్నావిడ కూడా ఆమెని గుడ్లప్పగించి చూస్తుండి పోయింది!

మరో అరగంట గడిచింది. ఐనా, ఉదయవేణి ఐపు లేదు!

ఇప్పుడే వస్తానని వెళ్ళిన మనిషి ఎంతకీ రాదేం? ఏం జేస్తోందక్కడ? షబ్నమ్ గదిలో లేకుంటే, ఉదయవేణి ఈపాటికి తిరిగి రావలసింది. అంటే, షబ్నమ్ గదిలోనే వుందన్నమాట. కొంపదీసి ఇద్దరూ తీరిగ్గా కబుర్లాడుకోడం లేదుకదా?

ఇంతలో ఆ బురఖా స్త్రీ మెట్లుదిగి, పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ తిరిగి బైటికెళ్ళిపోయింది. ఆ నడక చూస్తుంటే నాకేదో అనుమానం వేసింది. సడన్‌గా బుర్రలో మెరిసింది మెరుపు!

ఒక్క ఉదుటున లేచి బైటికి పరుగెత్తాను. అప్పటికే ఆలస్యమై పోయింది. ఆ స్త్రీ బైట ఆగి ఉన్న కారెక్కి తలుపు మూస్తోంది. ఆ రెప్పపాటు వ్యవధిలో ఆ చెయ్యి చూడగలిగాను.

అనుమానమే నిజమైంది.

అది కోమలి చెయ్యి కాదు!

మొరటుగా, రోమాలతోవున్న మగాడి చెయ్యి!!

నేనా షాక్‌లోంచి తేరుకోకముందే, కారు స్టార్టయి బాణంలా దూసుకుపోయింది. దాన్ని వెంబడించి వృథా ప్రయాస పడటం కంటే, లోపల ఉదయవేణి, షబ్నమ్ ఏమయ్యారో కనుక్కోవడం ముఖ్యం.

లోనికెళ్ళి, మెట్లవేపు పరుగుదీశాను, కౌంటర్లో వున్నావిడ అరుస్తున్నా వినిపించుకోకుండా. క్షణాల మీద మెట్లెక్కి సెకండ్ ఫ్లోర్ చేరుకున్నాను. నడవాకిరు పక్కలా గదులు కట్టివున్నాయి. ఒక్కొక్క గది చూసుకుంటూ రూం నెంబర్ 16 ముందు ఆగాను.

తలుపు మూసివుంది. గడియాగానీ, తాళంగానీ వేసి లేదు. తోశాను కిర్రుమంటూ తెరుచుకుంది. సంకోచించకుండా లోన అడుగు పెట్టాను.

గది మధ్య సోఫా, ఆ సోఫాలో అటు తిరిగి కూర్చునుంది ఉదయవేణి!

ఆమె తప్ప ఇంకెవ్వరూ లేరు.

"ఉదయవేణీ!" పిల్చాను.

జవాబు లేదు. గదిలో సూదిపడితే వినిపించే నిశ్శబ్దం!

"ఉదయవేణీ!" పిల్చాను మళ్ళీ.

ఉలుకూ పలుకూ లేకుండా కూర్చునుంది. ఏమైందీమెకి అనుకుంటూ, ఆమె ముందుకెళ్ళి, కొయ్యబారిపోయాను!

ఉదయవేణి రెండు చేతులూ ఒళ్ళో పెట్టుకు కూర్చునుంది, కళ్ళు గది కప్పుని చూస్తున్నాయి. నుదుట బొట్టు వుండివలసిన చోట గుండ్రని రంధ్రం! ఆ రంధ్రంలోంచి ఉబికి, చారలు చారలుగా చెంపలమీద కారిన రక్తం!! చటుక్కున ఆమె చెయ్యి అందుకుని చూశాను.

నా గుండె ఝల్లుమంది. అది చెయ్యికాదు. ఐస్ ముద్ద!

ఉదయవేణి మరణించింది.

హంతకుడు ఎంత తెలివిగా హత్య చేశాడు? లాడ్జింగ్ లోపలికి మగవాళ్ళని రానివ్వరు గనుక, ముస్లిం స్త్రీలా బురఖా వేసుకువచ్చి హత్యజేసి, నింపాదిగా వెళ్ళి పోయాడు.

దీన్నిబట్టి పాక్ గూఢచారులు రంగంలో దిగారని స్పష్టమౌతోంది.

ప్రొఫెసర్ గుల్‌హసన్ తమ దేశం వదలడానికి మూల కారణమైన షబ్నమ్‌ను, భారత దేశమంతా గాలించి పాకిస్తాన్ తీసుకు రమ్మనో, లేదా ఇక్కడే సఫా చెయ్యమనో వారికి ఆదేశాలు అంది వుంటాయి. అప్పుడు విధిలేక గుల్‌హసన్ తిరిగి తమ దేశం వచ్చేస్తాడని వారి ఆశ!

అంటే, మేము షబ్నమ్‌ను కలుసుకోక ముందే ఆమెని తుద ముట్టించాలని ఎవ్వరో నన్నూ, ఉదయవేణినీ వెంబడిస్తూ ఇక్కడికి వచ్చారన్నమాట.

ఐతే, షబ్నమ్‌బదులు ఉదయవేణి ఎలా చంపబడింది? షబ్నమ్ ఏమైంది? ఎలా మాయమైంది? నేను తలుపు దగ్గరే కూర్చున్నానే?

ఆలోచిస్తూ కాలయాపన చెయ్యడం నిష్ప్రయోజనం. వెంటనే ముఖర్జీగార్ని కలుసుకుని తక్షణం తగు చర్యలు తీసుకోవాలి.

తలుపు దగ్గరగా వేసి, గబ గబ లాడ్జింగ్ లోంచి బైటకి వచ్చాను. జీప్ ఎక్కి స్టార్ట్ చెయ్యబోతుండగా వెనక ఎవ్వరో కూర్చునున్నట్టు లీలగా కనిపించి గిరుక్కున వెనుదిరిగి చూశాను.

షబ్నమ్!

దిగ్భ్రాంతితో నా కళ్ళు పెద్ద వయ్యాయి.

"సారథిగారు మీరే కదూ?" అడిగింది.

"ఔను. మీరు గదిలోంచి బైటికెలా వచ్చారు?" అడిగాను ఆశ్చర్యంగా.

"గంట క్రితం ఉదయవేణి అనే ఎఫ్.బి.ఐ. ఏజెంట్ వచ్చి నన్ను కలుసుకుంది.ఆమె నాకు అన్ని విషయాలూ వివరిస్తుండగా, గదిలో ఫోన్ మోగింది. నేను రిసీవర్ ఎత్తగానే అవతలినించి ఓ పురుష కంఠం, 'షబ్నమ్ గారేనా?' అని అడిగింది.

నేను గతుక్కుమన్నాను. మారు పేరుతో లాడ్జింగ్ లో వుంటున్న నా అసలు పేరు అతనికెలా తెలిసింది? 'సారీ! ఇక్కడ ఆ పేరుగల వారెవ్వరూ లేరు?' అని రిసీవర్ పెట్టేసి, ఉదయవేణికి చెప్పాను ఆ సంగతి.

దాంతో ఆమె ఖంగారుపడి, నన్ను వెంటనే వెనక తలుపుగుండా బైటికెళ్ళి మిమ్మల్ని కలుసుకోమనీ తను గదిలోనే వుంటాననీ, ఒకవేళ ఎవ్వరైనా వచ్చి నా కోసం వాకబ్ చేస్తే తనని చూసి కన్ఫ్యూజ్ అవుతారనీ, నేనిక్కడ లేనని ధృఢపర్చుకుంటారనీ చెప్పింది.

ఆమెని గదిలో వదిలి, నేను లాడ్జింగ్ వెనక మార్గం గుండా బైటికివచ్చి మీ కోసం ఎదురు చూస్తున్నాను" అంది షబ్నమ్.

సాలోచనగా తలూపాను. హంతకుడు షబ్నమ్‌ను చంపబోయి, పొరపాటున ఉదయవేణిని చంపాడన్న మాట. షబ్నమ్ చావు వెంట్రుకవాసిలో తప్పి పోయింది!

ఉదయవేణి హత్య విషయం ఆమెకి చెప్పకుండా, జీప్ స్టార్ట్ జేసి ముందుకు పోనిచ్చాను.

# 7

పావు గంట తర్వాత నా ఇంటిముందు జీప్ ఆపాను. తాళం తీసి ఇద్దరం లోనికెళ్ళాం. తలుపుమూసి కూర్చోమన్నట్టు సోఫా చూపాను.

షబ్నమ్ కూర్చుంది. అప్పుడు చూశాను. ఆమె అందాన్ని. గుల్‌హసన్ ఆమెకోసం దేశాన్ని వదిలివచ్చాడంటే, అందులో అతిశయోక్తి లేదని ఇప్పుడు తెలిసింది. అతనే కాదు, అటువంటి అపురూప సౌందర్యవతి కోసం ఏ మగాడైనా ఏమైనా వదులుకో గలడు!

“ఇప్పుడు చెప్పండి. మీరు పూనానించి ఢిల్లీ ఎందుకొచ్చారు? మారు పేరుతో ఆ లాడ్జింగ్‌లో ఎందుకు దిగారు?” అడిగాను.

షబ్నమ్ నిట్టూర్చి, చెప్ప సాగింది—“ప్రొఫెసర్ గుల్‌హసన్ పాకిస్తాన్‌నించి హఠాత్తుగా భారతదేశం వచ్చాడని పేపర్లో చదవగానే, అతనికోసం హుటాహుటిన బైలుదేరాను. నాకు తెలుసు. అతను వచ్చింది నా కోసమేనని!

పాకిస్తాన్‌లో వున్నప్పుడు మే మిద్దరం ప్రేమించుకున్నాం, పెళ్ళి చేసుకుందామని బాసలు చేసుకున్నాం. ఇంతలో బొంబాయిలో వుంటున్న మా పెదనాన్న ఒకరు తన యావదాస్తీ నాకు చెందేలా వీలునామా రాసి మరణించాడని తెలిసింది.

స్వాతంత్రానికి పూర్వం మా వంశమంతా బొంబాయిలో వుండేది. స్వాతంత్రం వచ్చాక, భారతదేశం రెండుగా చీలిపోవడంతో మా నాన్నగారు పాకిస్తాన్ వెళ్ళి స్థిరపడ్డారు.

అనుకోకుండా నాకీ ఆస్తి కలిసి రావడంతో పెద్ద సమస్య ఎదురైంది. నేను భారత పౌరసత్వం స్వీకరించనిదే ఆస్తి దక్కించుకో లేను. ఆస్తికోసం ఇక్కడికి వస్తే, అటు గుల్‌హాసన్ని దక్కించుకో లేను.

చాలా రోజులదాకా ఎటూ నిర్ణయించుకోలేక, తర్జన, భర్జన అయ్యాను. ముందు ఆస్తి దక్కించుకుని, తరవాత పెళ్ళిగురించి ఆలోచిద్దామనుకుని భారతదేశం వచ్చి, ఇక్కడి పౌరసత్వం స్వీకరించాను..." షబ్నమ్ ఇంకా ఏదో చెబుతూనే వుంది.

హఠాత్తుగా ఎవ్వరో తలుపు తట్టడంతో ఆగిపోయింది.

నా కనుబొమలు ముడివడ్డాయి. "మీరా పక్క గదిలోకి వెళ్ళండి!" అన్నాను షబ్నమ్‌తో.

నా మొహంలో సీరియస్‌నెస్ చూసి ఆమె బెదిరిపోయినట్టుంది. గబగబ పక్క గదిలోకి పరిగెత్తింది. ఆ గదికవతల గడియపెట్టి, తలుపువైపు నడిచాను. నడుస్తూ జేబులోంచి పిస్తోలుతీసి రెడీగా పట్టుకున్నాను.

గడియ లాగి, చటుక్కున తలుపు తెరిచి ఎడంవైపు నక్కాను. ఆ జాగ్రత్తే నా ప్రాణాలు కాపాడింది. నేను తలుపు తెరవడం గుమ్మంలోంచి 'డిష్!' మన్న శబ్దం కావడం, గుండు గదిలోకి దూసుకెళ్ళడం రెప్పపాటులో జరిగిపోయాయి. అది సైలెన్సర్ బిగించిన పిస్తోలు!

రెక్కచాటునించి అతని చెయ్యీ, పిస్తోలూ కొద్దిగా కనిపిస్తున్నాయి. లాడ్జింగ్ దగ్గర కార్లో కనిపించిన మొరటు చెయ్యి అదే! మెరుపులా ఒక్క వేటు వేశాను

ఆ చేతిమీద. పిస్తోలు క్రిందపడి ఖంగుమంది. తలుపు చాటునించి రివ్వున ఇవతలికి వచ్చి, బూటుకాలితో ఈడ్చి తన్నాను అతని తొడల మధ్య.

కెవ్వుమంటూ క్రిందకూలాడు. మడమతో కణతమీద మరోటి ఇచ్చాను. మూలుగుతూ మూర్ఛపోయాడు. అతన్ని లోనికి ఈడ్చి తలుపు మూశాను. బోర్లాపడున్న అతన్ని కాలితో వెల్లకిలా తిప్పి నిర్వీర్యం చేశాను.

వాడొక పాత నేరస్థుడు! అడపాదడపా నేరాలు చెయ్యడం జైలుకెళ్ళిరావడం వాడి నిత్యకృత్యం! బల్ల మీది నీళ్ళజగ్గు అందుకుని వాడిమీద గుమ్మరించాను. మూలుగుతూ కదిలాడు. కుర్చీ లాక్కొని వాడి పక్కన కూర్చున్నాను. కాసేపటికి కళ్ళు తెరిచాడు.

బూటు మడమ వాడి కుత్తికమీద ఆనించి— "చెప్పు, చచ్చి కైలాసం వెళతావా? బ్రతికి బలుసాకు తింటావా?" అన్నాను.

వాడి కళ్ళు భయంతో వెడల్పయ్యాయి. "ప్లీజ్ ...నో!" అన్నాడు వణుకుతూ.

"ఐతే బుద్ధిగా నా ప్రశ్నలకి బదులివ్వు! వనితా లాడ్జింగ్‌లో బురఖా వేసుకువచ్చి ఆ అమ్మాయిని హత్య చేసింది నువ్వేకదూ?"

"ఔను! అక్కడఆ మెనీ, యిక్కడ మిమ్మల్నీ చంపమని ఆదేశించారు."

"ఎవ్వరు?"

"గోకుల్ నాథ్!"

"వాడెవ్వడు?"

"ఈమధ్యే కలకత్తానించి వచ్చిన పెద్ద రౌడీ! నా లాటివాళ్ళని చేరదీసి పనులు జరిపిస్తాడు."

"వాడు ఉండేదెక్కడ?"

"గగన్ మహల్ బిల్డింగ్‌లో ఫ్లాట్ నెం. 7 లో వుంటాడు."

"మొదటిసారి వాణ్ని ఎప్పుడు, ఎక్కడ కలుసుకున్నావ్?"

"నేను కలుసుకోలేదు. అతనే నన్ను కలుసుకున్నాడు. ఒక రోజు రాత్రి ఓ సారా కొట్టులో కాస్త మందుకొట్టి బైటికొచ్చాను. అంతలో, ఓ బ్లాక్ అంబాసిడర్ కారు వచ్చి నా పక్కన ఆగింది. డ్రైవింగ్ సీట్లో గోకుల్ నాథ్, అతని పక్కన లాంగ్ కోట్, ఫెల్ట్ హాట్‌లో వున్న మరోవ్యక్తి కూర్చునున్నారు. గోకుల్‌నాథ్ నన్ను దగ్గరికి పిలిచి పరిచయం చేసుకున్నాడు.

నాలాంటి వాళ్ళకోసమే వారు గాలిస్తున్నారుట. రోజుకు రెండు వందలిస్తారట. ఎవ్వరైనా హత్య జెయ్యాల్సి వస్తే హత్యకి యాభై వేలిస్తామన్నారు. నేను వెంటనే ఒప్పుకున్నాను."

"గోకుల్‌నాథ్ వెంటవున్న వ్యక్తి ఎవ్వరు?"

"తెలీదు సార్!"

"ఎలా వుంటాడతను?"

"నేనతన్ని చూళ్ళేకపోయాను సార్! మొహం కనిపించకుండా కోట్ కాలర్ ఎత్తి పెట్టుకున్నాడు. కాని, అతన్ని మళ్ళీ చూస్తే మాత్రం గుర్తుపట్టగలను."

"ఎలా?"

"సిగరెట్ కాస్తున్నప్పుడు చూశాను. అతని కుడి చేతికి బొటనవేలు లేదు!"

ఒక్కసారి షాక్ తగిలినట్టయింది నాకు.

"నిజంగా బొటనవేలు లేదా?" అడిగాను ఆతృతగా.

"ఔను సార్!"

నా గుండె గతి వేగం అందుకుంది. బుర్ర చురుగ్గా పనిచెయ్యసాగింది.

ఆ వ్యక్తి ఎవ్వరో నాకు తెలుసు.

ఛెంగేజ్ ఖాన్:

పాకిస్తాన్ ఇంటలిజెన్స్ శాఖలో అత్యంత ప్రమాదకరమైన గూఢచారి!! శత్రుదేశంలో ఏదైనా జటిలమైన పథకం అమలు జరపదలచినప్పుడు అతన్ని పంపుతుంది ఆ దేశం. అటువంటి క్రూరమైన వ్యక్తి మళ్ళీ వచ్చాడన్నమాట మన దేశానికి!

మూడేళ్ళ క్రితం ఇక్కడ అరాచకం సృష్టించడానికి పంపబడ్డాడతను. అప్పుడు జరిగింది నా భేటీ అతనితో. నేను వేసిన ఎత్తులకు పై ఎత్తులువేసి, పట్టుబడకుండా తప్పించుకు పారిపోయాడు.

ఇప్పుడు గుల్‌హాసన్‌నూ, షబ్నమ్‌నూ చంపడానికి వచ్చాడా? అదేమంత పెద్దపని కాదే? ఆ మాత్రం పని మామూలు రౌడీకూడా చెయ్యగలడు. ఛెంగేజ్ ఖాన్ వంటి గుండెలు తీసిన గూఢచారిని ఇటువంటి చిన్న పనులకు వుపయోగించుకోదు పాకిస్తాన్! మరి?

తీవ్రంగా ఆలోచిస్తున్న నా బుర్రలో తళుక్కుమంది మెరుపు.

ప్రింటింగ్ మిషన్!

అందులో యురానియంతో చేసిన వస్తువేదో వున్నట్టు చెప్పాడు అళగప్పన్. యురానియంతో కేవలం అటం

బాంబు తయారవుతుంది. అళగప్పన్ గైగర్ కౌంటర్ అతని పెట్టెలోంచి మాయం కావడం, తరవాత అతని హత్య జరగడం. ప్రింటింగ్ మెషీన్ డెలివరీ అవడం, ఢిల్లీలో ఛంగేజ్ ఖాన్ వునికి...ఇవన్నీ దేశానికేదో విపత్తు వాటిల్ల బోతోందని సూచిస్తున్నాయి.

తక్షణం హెడ్ క్వార్టర్స్ కెళ్ళి ముఖర్జీ గార్ని కలుసుకోవాలి. మెడలోంచి టై ఊడదీస్తూ కుర్చీలోంచి లేచాను. కింద పడున్న వాడి రెండు చేతులూ వెనక్కి విరిచి కట్టి, టెలిఫోన్ అందుకున్నాను. స్థానిక పోలీస్ స్టేషన్ కి రింగ్ చేసి తక్షణం బైలుదేరి రమ్మని చెప్పాను.

పావు గంటలోపల జీప్ వచ్చి ఆగింది బైట, ఆ నేరస్థుణ్ణి వారి వెంటపంపేసి, షబ్నమ్ వున్న గది తలుపు తెరిచాను. ఆమె బట్టలన్నీ చమటతో తడిసివున్నాయి.

"బైట ఏం జరుగుతోందోనని, లోపల హడిలి చస్తున్నాను" అంది భయంగా.

"ఏమీ జరగలేదు. నేను తిరిగి వచ్చేవరకూ మీరిక్కడే నిశ్చింతగా వుండండి ఎట్టి పరిస్థితిలోనూ తలుపు తెరవకూడదు" అన్నాను.

షబ్నమ్ తలూపింది.

జీప్ ఎక్కి బైలుదేరాను.

# 8

"మన వాళ్ళు అతి కష్టంమీద ఆ ప్రింటిగ్ మెషీన్ డెలివరీ అయి ఎక్కడి కెళ్ళిందో కనుక్కోగలిగారు. నగరంలో ఓ ప్రముఖ కమీషన్ సంస్థద్వారా అది జపాన్ నించి తెప్పించబడిందిట, మనవాళ్ళు ఇప్పుడే ఆ సంస్థ కార్యాలయాని కెళ్ళారు ఆరా తియ్యడానికి," అన్నాడు ముఖర్జీ.

ఆయన చెప్పిందంతా విన్నాక, అంతవరకూ జరిగిన సంఘటనలన్నీ పూసగుచ్చినట్టు వివరించా నాయనకి. ఛెంగేజ్ ఖాన్ పేరు వినగానే ఆయనకూడా ఉలిక్కిపడ్డాడు.

"మైగాడ్! ఆ రాక్షసుడు మళ్ళీ వచ్చాడా మన దేశానికి? ఐతే, ఏదో ప్రళయం సృష్టించి తీరతాడు... ఆఁ! అసలు సంగతి చెప్పడం మర్చాను.

సరిహద్దుల్లోవున్న మన ఏజెంట్ ఒక రీమధ్యే కాక తాళీయంగా పాకిస్తాన్ నించి ప్రసారమైన ఓ వైర్లెస్ మెసేజ్ వినగలిగాడుట, వెంటనే దాన్ని మం హెడ్ క్వార్టర్‌కి తెలిజేశాడు!"

"ఏమిటది?"

"ఆపరేషన్ పింటోను తక్షణం అమలు జరపండి! అని వినిపించిందట వైర్లెస్‌లో!"

"ఆ మెసేజ్‌తో మన దేశానికే సంబంధం వుందని అతనికెలా తెలుసు?"

"అతనికేమీ తెలియదు. దేనికైనా మంచిదని, జాగ్రత్తకోసం మనకు తెల్పాడు."

నా బుర్ర చురుగ్గా పని చెయ్యసాగింది. కొంపదీసి ఛెంగేజ్ ఖాన్ దాన్ని అమలు జరపడానికే మన దేశం రాలేదు కదా?

"వెంటనే పాత రికార్డ్స్ వెతికించండి, అందులో ఛెంగేజ్ ఖాన్ ఫోటో వుంటుంది. తక్షణం నాకది కావాలి?" అన్నాను.

ముఖర్జీ వెంటనే రికార్డ్ ఆఫీసర్ని పిలిపించి ఆదేశాలిచ్చారు. పావుగంటలోగా ఛెంగేజ్ ఖాన్ ఫోటో బయటికి తీశారు.

దాన్ని అందుకుని—"మళ్ళీ వస్తాను" అంటూ లేచాను.

"ఎక్కడికి?" అడిగారు ముఖర్జీ.

"గెస్టుహౌస్ కెళ్ళి ప్రొఫెసర్ గుల్‌హాసన్ని కలుసుకోవాలి. అతన్ని నా యింటికి తీసికెళ్తాను. షబ్నమ్ ఒంటరిగా అక్కడేవుంది. ఇద్దర్నీ ఒకేచోట వుంచటం మంచిది" అంటూ గబగబ బైటికి నడిచాను.

గెస్టుహౌస్‌లో గుల్‌హాసన్‌కు ఛంగేజ్ ఖాన్ ఫోటో చూపెట్టి—"ఇతనెవ్వరో తెలుసా?" అడిగాను.

ఫోటో చూడగానే గుల్‌హాసన్ ఉలిక్కిపడ్డాడు, "తెలియకేం, ఛంగేజ్ ఖాన్! పాక్ ఇంటెలిజెన్స్ శాఖలో పేరున్న గూఢచారి!"

"ఎప్పుడైనా ఇతన్ని కలుసుకున్నారా?"

"ఔను! ఒకటి రెండుసార్లు పార్టీల్లో కలుసుకున్నట్టు జ్ఞాపకం, కొంపదీసి వీడు భారతదేశం రాలేదుకదా?"

తలూపి—"వచ్చాడు," అన్నాను.

"ఐతే, ఆపరేషన్ పింటోను అమలు జరపడానికే వచ్చి వుంటాడు" గుల్‌హాసన్ నోటినించి వెలువడ్డ ఆ వాక్యంతో నా గుండెల్లో గుర్రాలు దౌడుదీశాయి.

"మీకా ప్లాన్ గురించి ఏమైనా తెలుసా? దయచేసి చెప్పండి, నేను మీ ప్రేయసి షబ్నమ్ జాడ తెలుసుకున్నాను. ఇప్పుడామె నా ఇంట్లో సురక్షితంగావుంది!" అన్నాను ఆతృతగా.

షబ్నమ్ పేరు వినగానే అతని కళ్ళు తళ తళ మన్నాయి.

"ఆ ప్లాన్ గురించి నాకంత వివరంగా తెలియదు.

చూచాయగా కొన్ని వివరాలు తెలుసు. ఆ ప్లాన్ ప్రకారం వాళ్ళిక్కడ ఏదో భవనాన్ని బాంబుతో నేల మట్టం చేయబోతున్నారు. అది చాలా ప్రమాదకరమైన బాంబు! అది పేలిందంటే చుట్టుపక్కల రెండువందల గజాల వరకూ వున్న వస్తువులన్నీ కరిగి నీరైపోతాయి!"

బాంబు—భవనం—ఛెంగేజ్ ఖాన్ — ఆపరేషన్ పింటో—నా మస్తిష్కంలో తుఫాను చెలరేగింది. ఆ బాంబు నిస్సందేహంగా ప్రెస్ మిషన్‌లోనే వుంది, వాళ్ళు ఏ భవనాన్ని నేలమట్టం చెయ్యాదలచుకున్నారో ఎలా కనుక్కోవడం...?

నా ఆలోచనకు అంతరాయం కలిగిస్తూ గదిలో ఫోన్ మోగింది. గబగబ వెళ్ళి రిసీవర్ అందుకుని—"సారధి స్పీకింగ్" అన్నాను.

"ఆ ప్రింటింగ్ మెషిన్ ఎక్కడికెళ్ళిందో మన వాళ్ళు కనుక్కున్నారు. నెహ్రూ నగర్‌లో ఈ ఏడే కట్టించిన పదంతస్తుల పెద్ద భవనం అది. ప్రభుత్వం అందులో డిఫెన్స్ రీసెర్చ్ డిపార్టుమెంట్స్ స్థాపించింది. మన మిలిటరీ ప్లానింగ్ అంతా అక్కడే జరుగుతుంది.

ఆ ప్రింటింగ్ మెషిన్ని ప్రభుత్వమే జపాన్‌నించి తెప్పించిందట ఆ డిపార్టుమెంట్ కోసం! ఈరోజు దాన్ని భవనంలో పెట్టేశారు" అన్నారు ముఖర్జీ అవతలినించి.

"సమయానికి ఎంతో విలువైన విషయం కనుక్కున్నారు. నేను ప్రొఫెసర్ గుల్ హాసన్ ద్వారా ఆపరేషన్ పింటో గురించి తెలుసుకున్నాను సార్! ఛెంగేజ్ ఖాన్ అద్భుతమైన పథకం అల్లాడు. ప్రభుత్వం జపాన్ నించి తెప్పించిన ఆ మెషిన్‌లో బాంబు వుంచి, ఆ డిఫెన్స్ భవనాన్నీ, అందులోవున్న వస్తువులన్నిటినీ

నామరూపాలు లేకుండా చెయ్యదల్చాడు.

మీరు తక్షణం బలగంతో వెళ్ళి ఆ భవనాన్నీ, దాని చుట్టుపక్కలున్న ఇతర భవనాలనీ ఖాళీ చేయించండి. అనుభవజ్ఞుల చేత ప్రెస్ మెషిన్ వెతికించి, ఆ బాంబును ఫ్యూజ్ లెస్ చేయించండి సార్!" అన్నాను.

"ఓ.కె! నేనిప్పుడే రంగంలో దిగుతాను" అవతల క్లిక్ మంది.

రిసీవర్ దించి సిగరెట్ అంటించాను. ఇంట్లో నామీద హత్యా ప్రయత్నం చెయ్యబోయిన ఆ రౌడీ, గోకుల్ నాథ్ అనే వ్యక్తి పేరూ, అతని ఎడ్రసూ చెప్పాడు. వాణ్ని చితకదన్నితే ఛంగేజ్ ఖాన్ ఉనికి తెలియవచ్చు.

"ప్రొఫెసర్! కమాన్. మిమ్మల్ని షబ్నమ్ దగ్గర దిగబెడతాను." అంటూ బైటికి నడిచాను.

జీప్ ఎక్కి, పదినిమిషాల్లో నా ఇంటిముందు దిగాం.

కాలింగ్ బెల్ వత్తాను. షబ్నమ్ ముందు తలుపు సందులో కన్ను పెట్టి, మమ్మల్ని చూసి తలుపు తెరిచింది. ఆమెని చూడగానే గదిలోకి ఉరికాడు గుల్ హాసన్. ఇద్దరూ నా ఉనికినే మరచి, ఒకర్నొకరు హత్తుకుపోయారు.

"మీ మేలు ఎన్నటికీ మర్చిపోలేను!" అన్నాడు గుల్ హాసన్ కృతజ్ఞతగా.

"విరహ వేదనతో ఇన్నాళ్ళ తరవాత కలుసుకున్న మీరు, ఏకాంతాన్ని కోరుకోడం సహజం! అందుకే నే వెళుతున్నాను. మీ ఇద్దరికీ ఇక్కడ ఏం అపాయం లేదు" అంటూ తలుపు మూసి జీప్ ఎక్కాను.

# 9

పావుగంటలో గగన్‌మహల్ బిల్డింగ్ చేరుకున్నాను. ఆరంతస్థుల బిల్డింగ్ అది. అనేక కుటుంబాలవారు నివసిస్తారందులో.

జీప్ దిగి గబగబ బిల్డింగ్‌లో ప్రవేశించాను. ఫ్లాట్ నెంబర్స్ చెక్ చేసుకుంటూ పైకెళ్ళాను. అప్పటికే చీకటిపడింది. బిల్డింగ్‌లో లైట్లు వెలుగుతున్నాయి. రెండు నిమిషాల తరవాత సెకండ్ ఫ్లోర్‌లో వున్న ఫ్లాట్ నెంబర్ 7 ముందు ఆగాను. తలుపు మూసివుంది. జాగ్రత్తకోసం పిస్తోలు తీసి పట్టుకున్నాను. తలుపుకి బతల తాళం లేదు గనక, లోపల ఎవ్వరో వున్నారు.

మునివేళ్ళతో మెల్లిగా తట్టాను.

“ఎవ్వరు?” మగ కంఠం వినిపించింది.

“టెలిగ్రాం సార్!” అన్నాను గోడకి ఒదుగుతూ.

తలుపు కొద్దిగా తెరుచుకుంది.

ఆ రెప్పపాటు వ్యవధిలో అతని చేతిలోనూ పిస్తోలుండటం చూశాను. అంతే!

మా ఇద్దరి పిస్తోళ్ళూ ఒకేసారి పేలాయి.

తేడా అల్లా నేను కిందకూలలేదు. నా గుండు సరిగ్గా అతని ఛాతీలో దిగింది. అమాంతం వెనక్కి పడిపోయాడు. మెరుపులా గదిలో దూరి తలుపు మూశాను.

అతను మధ్య వయస్కుడు. కిందపడి తన్నుకుంటున్నాడు. ఆ గది పక్కనే మరో గది వుంది. ఇంకెవ్వరైనా వున్నారేమో అన్న అనుమానంతో ఆ గదిలోకి తొంగి చూశాను. ఎవ్వరూ లేరుగానీ, గోకుల్‌నాథ్‌తో

బాటు ఆ ఇంట్లో ఇంకెవ్వరో వుంటున్నారని లోపలున్న రెండు మంచాలూ సాక్ష్యం ఇస్తున్నాయి.

కిందపడి తన్నుకుంటున్న గోకుల్‌నాథ్‌ని సమీపించాను. అతని కళ్ళు మూతలు పడుతున్నాయి. గట్టిగా ఎగశ్వాస పీలుస్తున్నాడు. గాయంలోంచి రక్తం ఉబికి వస్తోంది. మోకాళ్ళమీద కూర్చుని, అతని పల్స్ చూశాను. వీక్‌గా కొట్టుకుంటోంది. ఇక అట్టే సేపు బ్రతకడు. నా గుండె దడ దడ కొట్టుకోసాగింది. ఛెంగేజ్‌ఖాన్ ఎక్కడున్నాడో కనుక్కోడానికి వాడొక్కడే ఆధారం ఇప్పుడు.

"గోకుల్! గోకుల్!" పిల్చాను కదుపుతూ.

అతను కళ్ళు తెరవలేదు.

ఖంగారుగా చుట్టూ చూశాను. టీపాయ్‌మీద నీళ్ళ జగ్గు కనిపించింది. దాన్ని అందుకుని, అతని మొహం మీద గుమ్మరించాను. అతి కష్టంమీద కళ్ళు తెరిచాడు.

"గోకుల్‌నాథ్ నువ్వేకదూ?" అడిగాను.

నాలికతో పెదాలు తడుపుకుంటూ చిన్నగా తలూపాడు.

"నువ్వు బ్రతుకుతావ్! నా ప్రశ్నలకి దాచకుండా జవాబిచ్చావంటే నిన్ను హాస్పిటల్ తీసికెళ్ళి బ్రతికించగలను" అన్నాను.

అతను రెప్పవెయ్యకుండా నన్నే చూస్తున్నాడు. ఇప్పుడతనికి శ్వాస తీసుకోడం కూడా కష్టమైపోతోంది.

"గోకుల్! త్వరగా చెప్పేయ్! ఛెంగేజ్‌ఖాన్ నీతో బాటు ఇక్కడే వుండేవాడు కదూ?"

అతను పలకలేదు. కన్నార్పకుండా అలాగే చూస్తున్నాడు.

"గోపాల్. నీవు చస్తున్నావ్! భారతీయుడివి. కనీసం ఈ చివరి క్షణాల్లోనైనా నీ మాతృదేశానికి సేవ చేసి వెళ్ళు. ఛెంగేజ్ ఖాన్ గురించి చెప్పావంటే నీ దేశానికి వాటిల్లబోయే పెద్ద ప్రమాదాన్ని తప్పించిన వాడివౌతావు. చెప్పు. అతనిక్కడే వుండేవాడు కదూ?"

నా మాటలు పనిచేశాయి. నిర్జీవమౌతున్న అతని కళ్ళల్లో ఏదో అజ్ఞాత మెరుపు మెరిసింది. చిన్నగా తలూపాడు.

"అతనిప్పుడెక్కడున్నాడు?"

"ఇప్పు...ఇప్పుడే...మీ...ఇంటికెళ్ళాడు!"

ఆశ్చర్యంతో నా కళ్ళు పెద్దవయ్యాయి. "ఎందుకు?"

"గుల్...హసన్ని...చంప..." అతని వాక్యం ఇంకా పూర్తికాలేదు.

తల పక్కకి వాలిపోయింది.

నిట్టూర్చాను. గుల్ హసన్, షబ్నమ్ నా ఇంట్లోనే వున్నారని ఛెంగేజ్ ఖాన్ తెలుసుకున్నాడంటే, వాడెంత అసాధ్యుడో అర్థమౌతుంది.

గోపాల్ శవాన్ని అక్కడే వదిలి, బైటికి పరుగు తీశాను.

## 10

నా ఇంటికి చాలా దూరంలో జీప్ ఆపి దిగాను. ఛెంగేజ్ ఖాన్ ఇంకా ఇంట్లో వుండివుంటే, జీప్ శబ్దం విని ఎవ్వరో వచ్చారని గ్రహిస్తాడు. పరిగెత్తుతున్నట్టు నడవసాగాను. వీధిలో లైట్లు వెలుగుతున్నాయి. జన సంచారం అట్టే లేదు.

ఈపాటికి వాడు గుల్ హాసన్నీ, షబ్నమ్నీ చంపి ఉంటాడా? ఏమో, వాడు పాషాణుడు. మనుషుల్ని చంపడమంటే వాడికి చాలా సరదా! జారిపోతున్న గుండెల్ని కూడదీసుకుంటూ ఇంటిని సమీపించాను.

గేటు తెరిస్తే చప్పుడవుతుంది. సవ్వడి కానివ్వకుండా పిట్టగోడ ఎక్కి కాంపౌండ్ లో దూకాను.

ఇంట్లో లైటు వెలుగుతోంది. తలుపు మూసివుంది. పిల్లిలా తలుపు దగ్గరికెళ్ళి, సందు మధ్య కన్ను పెట్టి చూశాను.

గది మధ్య తలుపుకడ్డంగా అటు తిరిగి నిల్చునున్నాడు ఛంగేజ్ ఖాన్! ఆ నిల్చున్న తీరు చూస్తుంటే, చేతిలో పిస్తోలుకూడా వున్నట్టుంది. వాడు అడ్డు వుండటంవల్ల షబ్నమ్ గానీ, గుల్ హాసన్ గానీ కనిపించడంలేదు.

చెవులు రిక్కించాను, ఛంగేజ్ ఖాన్ కర్కశంగా ఏదో అంటున్నాడు లోపల.

ఇక జాగుచేస్తే వాడి పిస్తోలు ఆ ప్రేమికుల శరీరాలని జల్లెడ చెయ్యవచ్చు. క్షణం వృథా చెయ్యకుండా ఇంటి పక్కకెళ్ళి నీటిగొట్టం అందుకున్నాను. కన్ను మూసి తెరిచేలోగా గొట్టం ఎగబాకి, ఇంటిపైకి చేరుకున్నాను.

క్రింది గదిలోంచి ఛంగేజ్ ఖాన్ కంఠం ఇంకా విని పిస్తూనే వుంది! పిస్తోలు తీసి అనుగులో అడుగు వేసుకుంటూ మెట్లవైపు నడిచాను. ట్రిగ్గర్ మీద నా వేలు రెడీగా వుంది.

"గుడీవెనింగ్ మిస్టర్ ఖాన్!" అంటూ ఆ గదిలో అడుగు పెట్టాను.

ఛెంగేజ్ ఖాన్ అదిరిపడి ఇటు తిరుగుతూ ట్రిగ్గర్ వత్తాడు. బుల్లెట్ మిస్సయింది.

వాడిగురించి నాకు ముందే తెలుసు గనక, మాట్లాడిన మరుక్షణం మెరుపులా పక్కకి గెంతుతూ రెండుసార్లు పిస్తోలు పేల్చాను. అందులో ఒక గుండు తిన్నగా వెళ్ళి వాడి కణతలో తిష్ట వేసింది. పూర్తిగా ఇటు తిరక్కముందే గజం ఎత్తు ఎగిరి నేలకూలాడు!

బుర్రమీంచి కొండంత భారం దించినట్లు తేలిగ్గా నిట్టూర్చాను. కిందపడ్డ ఛెంగేజ్ ఖాన్‌లో చలనం లేదు. కణతలో గుండు దిగిన వాడెవ్వడూ ఇంతవరకూ బ్రతక లేదుమరి! ఈనాటితో నా అగర్భ శత్రువు అంత మయ్యాడు.

అప్పుడు పడింది నా దృష్టి, కింద కట్టిపడున్న గుల్ హాసన్ మీద.

"ప్రొఫెసర్!" అంటూ అతనివైపు అడుగు వేశాను.

అంతే!

"డిష్!"మన్న శబ్దం రావడం, నా చేతిలోని పిస్తోలు ఎగిరి కిందపడటం క్షణంలో జరిగిపోయాయి.

దిగ్భ్రాంతితో శబ్దం వచ్చినవైపు చూశాను.

షబ్నమ్!

ఆమె చేతిలో సైలెన్సర్ బిగించిన పిస్తోలు!!

"నువ్వా?" అన్నాను నోరు తెరుస్తూ.

"ఔను మిస్టర్ సారథ్! ముందు చేతులెత్తి ఆ గోడ వైపు జరుగు. పిచ్చివేషాలు వేశావంటే కుక్కని కాల్చి నట్టు కాల్చి పారేస్తాను జాగ్రత్త!" అంటోంది షబ్నమ్ పడగ్గది గుమ్మంలో నిల్చుని.

ఆమె గురి ఎటువంటిదో ఇదివరకే తెలిసిపోయింది. చేతులెత్తి బుద్ధిగా ఆమె చెప్పినట్లు చేశాను. అది కలో నిజమో ఎటూ అర్థంకావడం లేదు నాకు.

"మా దేశపు గూఢచారుల్లో అత్యంత ప్రతిభావంతుడైన ఛెంగేజ్‌ను చంపి చంకలు గుద్దుకుంటున్నావ్ కదూ? ఇప్పుడు నిన్నూ, ఈ దేశద్రోహినీ కాల్చి చంపి ఛెంగేజ్ ఆత్మకు శాంతి కలిగిస్తాను!"

నాకు నవ్వాగలేదు. "మిస్ షబ్నమ్! చావంటే నాకు భయంలేదు. ఈ వృత్తి చేపట్టినప్పుడే నా ప్రాణాలని ప్రభుత్వానికమ్మేశాను. నన్ను చంపి మీరు గెలిచారని మురిసిపోక!

మీ ఆపరేషన్ పింటో ఫేలయింది. బాంబుతో మీరు నాశనం చెయ్యాలనుకున్న డిఫెన్స్ భవనాన్ని మా సిబ్బంది చుట్టుముట్టేశారు. ఈపాటికి భవనం ఖాళీచేసి వుంటారు. అంతేకాదు, మీరు ప్రింటింగ్ మెషిన్‌లో దాచిపంపిన బాంబునుకూడా ఫ్యూజ్ లెస్ చేసి వుంటారు" అన్నాను.

కోపంతో షబ్నమ్ మొహం జేవురించింది.

దెబ్బతిన్న కోడెతాచులా బుసలు గొడుతూ చూడసాగింది.

"ఇన్నాళ్ళూ మా గూఢచారుల్లో ఛెంగేజ్ ఖాన్ ఒక్కడే ప్రమాదకరమైన వాడనుకున్నాను! అతన్ని మించిన జిత్తులమారి నక్కవు నువ్వని ఇప్పుడే తెలిసింది. ఆ స్కిాసం భారత దేశానికి వచ్చినట్టు వచ్చి ఇక్కడ గూఢచర్యం ప్రారంభించావ్.

గుల్ హసన్ దురదృష్టవశాత్తూ నీవంటి కోడెనాగును

ప్రేమించాడు. గుడ్డిగా నీకోసం దేశాన్నీ, సర్వాన్నీ వదులుకుని వచ్చేశాడు. దాంతో, అతనిద్వారా తమ రహస్యాలు భారతదేశం రాబట్టుకుంటుందేమోనని మీ దేశం భయపడింది.

అతను నోరు విప్పకముందే శాశ్వతంగా ఆ నోరు మూసెయ్యమని నిన్ను ఆదేశించింది. అందుకే నీవు పూనా నించి ఢిల్లీ వచ్చావ్. కాకతాళీయంగా ఆపరేషన్ పింటోను అమలుజరపటానికి ఛెంగేజ్ కూడా ఇక్కడికి రావడంతో మీరిద్దరూ చేతులు కలిపి, ప్రొఫెసర్ని చంప డానికి పథకం వేశారు.

వనితా లాడ్జింగ్‌లో ఉదయవేణి నిన్ను కలుసుకో డానికి రాగానే, ఆ కిరాయి హంతకుణ్ని నువ్వే ఫోన్ చేసి పిలిపించావ్. తరవాత నంగనాచిలా నాతో నాటక మాడావ్. నేను గుల్‌హసన్ని ఇక్కడ వదిలి వెళ్ళగానే ఛెంగేజ్‌ఖాన్‌కు ఫోన్ చేసి పిలిపించావ్!

ఎన్ని ఎత్తులు వేసినా, ఎన్ని చాకచక్యాలు ప్రదర్శిం చినా దుష్టశక్తులకెప్పుడూ ఓటమి తప్పదని గుర్తుం చుకో!" అన్నాను ఆవేశంగా.

షబ్నమ్ పలకలేదు. కాసేపు తీవ్రంగా ఆలోచించి, ఏమనుకుందో ఏమో, తలెత్తింది.

"ఆల్‌రైట్! మా ఆపరేషన్ పింటో ఫేలయింది. ఒప్పుకుంటాను. అందుకు నేను చింతించడం లేదు. మీ ఇద్దరి మరణాలూ ఆ లోటును పూడుస్తాయి."

"ప్రొఫెసర్ గుల్‌హాసన్ విషయం ఇప్పుడు ఇంటర్ నేషనల్ స్కాండల్‌గా మారింది. మమ్మల్ని చంపితే, ప్రపంచమంతా మీ దేశాన్ని దుమ్మెత్తిపోస్తుంది. ఆ

విధంగా నీ దేశాన్ని నువ్వే నవ్వులపాలు చేసినదాని వౌతావు!''

చిన్నగా నవ్వింది షబ్నమ్. ''నేనంత తెలివితక్కువ దాన్ని కాను మిస్టర్ సారధీ! ఆ సమస్యకి పరిష్కారం నావద్ద రెడీగా ఉంది!''

''ఏమిటది?''

షబ్నమ్ జవాబివ్వకుండా, పిస్తోలుతో మమ్మల్ని కవర్ చేస్తూ గోడవారగా ఉన్న టేబిల్ వైపు నడిచింది. టేబిల్ మీది లెటర్ పేడ్, కలం అందుకుని మావైపు తిరిగింది.

''మీరిద్దరూ నేను చెప్పినట్టు చెరో ఉత్తరం రాసి సంతకం పెట్టాలి. ప్రొఫెసర్! నీవు ఏం రాయాలో తెలుసా? పాకిస్తాన్ నించి నిన్ను ఈ సారధి బలవంతంగా ఎత్తుకువచ్చాడనీ, నీ అంతట నీవు రాలేదనీ, ఇక్కడికి వచ్చాక వీళ్ళు నిన్ను బెదిరించి పత్రికా విలేఖర్ల ముందు తప్పుడు కారణాలు చెప్పించారనీ, తరవాత పాక్ ఆటమిక్ రహస్యాలు చెప్పమని చిత్రహింసలు పెట్టారనీ రాసి సంతకం చెయ్యి!

మిస్టర్ సారధీ! నీ ఉత్తరంలో ప్రొఫెసర్ని నీవే మా దేశంనించి ఎత్తుకు వచ్చినట్టూ, అతనిచేత రహస్యాలు కక్కించడానికి చిత్రహింసలు పెట్టినట్టూ, వాఙ్మూలం ఉండాలి.

ఆ రెండు ఉత్తరాలూ ప్రపంచ పత్రికల్లో ప్రచురింపపడతాయి. అప్పుడు నవ్వులపాలయ్యేది నా దేశమా? మీ దేశమా?'' అంది తల ఎగరేస్తూ.

''మేము ఉత్తరాలు రాసినా, రాయకపోయినా ఎలాగూ మమ్మల్ని చంపేస్తావ్! అటువంటప్పుడు ఉత్త

రాలు రాయకపోవడమే ఉత్తమంకదా?'' అన్నాను వ్యంగ్యంగా.

''నువ్విలా అంటావని నాకు ముందే తెలుసు. దానికీ నాదగ్గిర మందుంది. మనిషి శరీరంలోని ఏ భాగంలో గుళ్ళు దిగితే, నరకయాతనపడి మరణిస్తాడో నాకు బాగా తెలుసు. బుదిగా నేను చెప్పినట్టు చెయ్యకుంటే, నా పిస్తోలు గుళ్ళు మీ శరీరాల్లోని ఆ భాగాల్లో ఆ నరకం మీరు భరించలేరు. అటువంటి నికృష్ట మరణాన్ని ఎవ్వరూ కోరుకోరు!'' అంటూ కింది కట్టి పడున్న గుల్‌హాసన్ని సమీపించింది షబ్నమ్.

పిస్తోలుతో నన్ను కవర్ చేసి, అతని చేతికట్టు విప్పింది. నేను రాతిబొమ్మలా చూస్తూ నిల్చున్నాను, చేష్టలుడిగి.

కలాన్నీ, కాగితాన్నీ అతనికి అందించి _ ''నీచుడా! దేశద్రోహీ! నేను చెప్పినట్టు రాయి'' అంది కటువుగా.

గుల్‌హాసన్ నావైపు చూశాడు నిస్సహాయంగా.

''రాయండి ప్రొఫెసర్! మన పరిస్థితి తారుమారయింది. మనం ఓడిపోయాం. ఈ చివరిదశలో, యాతనలేని మరణం పొందాలంటే ఇంతకిమించి మరోదారి లేదు మనకు!'' అన్నాను.

గుల్‌హాసన్ విధిలేక, షబ్నమ్ చెప్పినవిధంగా రాసి, సంతకం పెట్టాడు. ఆ కాగితాన్నీ, కలాన్నీ అందుకుని తిరిగి దూరం జరిగింది షబ్నమ్. మరో కాగితాన్ని, కలాన్ని రోలర్‌లా చుట్టి, నావైపు విసిరి _ ''ఊఁ! ఇక నీవంతు కానివ్!'' అంది.

వాటిని అందుకోడానికి వంగినట్టు వంగి, కాగితంలోంచి ఆమె విసిరిన కలాన్ని కింద జారవిడిచి, దానిపై బూటు

అదిమాను. నా షర్టుకు ముఖర్జీగారిచ్చిన ఫౌంటెన్ పెన్ ఉంది. ఓ చేత్తో దాన్ని తీసి లేచాను. ఈ చర్యలన్నీ క్షణాలమీద జరిగిపోయాయి.

ఫౌంటెన్ పెన్ క్యాప్ తీసి, పెన్ వెనక గట్టిగా వత్తి వదిలి, కాగితంమీద గబగబ ఏదో గిరికి, షబ్నమ్ వైపు విసిరాను.

ఆమె వాటిని అందుకోడానికి వంగింది. అంతే!
"ఢాం!" అన్న పేలుడుతో గది మారుమోగింది.
నల్లని పొగ! ఆ పొగలోంచి గావుకేక!!

చంద్రబింబంలా వుండే షబ్నమ్ ముఖారవిందం, ఇప్పుడు నల్లగా మాడి భీకరంగా తయారయింది. వంగిన మనిషి లేవబోతూ, లేవలేక అలాగే బోర్లా పడిపోయింది.

ఆ ఫౌంటెన్ పెన్ బాంబు, గజం చుట్టుపక్కలోనే పనిచేస్తుంది గనక మాకెలాంటి హానీ జరగలేదు. గుల్ హసన్ ఇంకా ఆ దిగ్భ్రాంతినించి తేరుకోలేదు.

అంతలో గణగణ మోగింది టెలిఫోన్.
రిసీవర్ అందుకుని_ "సారధి హియర్!" అన్నాను.

"మైడియర్ సారధీ! మన నిపుణులు, ఆ ప్రెస్ మిషన్ లోంచి బాంబును తీసేశారు. ఇక్కడ ఎవ్వరికీ ఎటువంటీ హానీ జరగలేదు!" అన్నారు ముఖర్జీ అవతలినించి.

ఇక్కడ జరిగిన విషయాలు ముఖర్జీగారికి చెప్పి, రిసీవర్ దించి తేలిగ్గా నిట్టూర్చాను!

—: ఐపోయింది :—

# జన్మరహస్యం?

వసుంధర

"రాజూ ఒక పది రూపాయలు సర్దగలవా?" అన్నాడు మూర్తి.

"దేనికి?" అన్నాడు రాజు.

"ఓ రెండుద్యోగాల కప్లికేషన్సు పడేయాలి!"

రాజు నవ్వి "ఎందుకురా రాని ఉద్యోగాలకు డబ్బు తగలేస్తావ్-నువ్వుకూడా నాకులా ఒక కిళ్ళీబడ్డీ తెరవరాదూ" అన్నాడు.

"నిజమేరా-బడ్డీ తెరిస్తే గుమాస్తాకంటె ఎక్కువే సంపాదించొచ్చు. కానీ అందుకు మానాన్న ఒప్పుకోడ్డా" అన్నాడు మూర్తి.

రాజు ముఖంలో రంగులు మారాయి. "అవున్రా ప్రతి

తండ్రికి తన కొడుకు చదువుకుని ఉద్యోగం చేయాల నుంటుంది. డబ్బు లేకపోతే అప్పయినా చేస్తాడు కానీ కొడుకును కిళ్ళీ బడ్డీ తెరవనివ్వడు. నాకైతే తండ్రి లేడు. అసలు నా తండ్రెవరో తెలియదు. అందుకే ఇలాంటి వ్యాపారం ప్రారంభించడానికి నన్నెవరూ అభ్యంతరం పెట్టలేదు..." అన్నాడు.

"నీ అభిప్రాయం నాకు తెలియదుకానీ నీ వ్యాపారాన్ని తక్కువ చేయాల్సిన అవసరం లేదురా. ఒకళ్ళ మీద ఆధారపడకుండా నీకై నువ్వు డబ్బు సంపాదిస్తున్నావు. గ్యాడ్యుయేటునయ్యిండీ ఏణ్ణర్ధంనించీ ఉద్యోగం లేక అడపాతడపా నీ దగ్గర అప్పుకూడా వస్తున్నాను, ఎన్నిసార్లో నాన్నను ఒప్పిద్దామని ప్రయత్నించి ఫెయిలయ్యాను. నన్ను కని పెంచిన పెద్దవారి మనసుకు కష్టం కలిగించడం నాకిష్టంలేదు..."అన్నాడు మూర్తి.

"తలిదండ్రులు పిల్లలపాలిటి వరం. వాళ్ళను కలిగుండడమే ఒక అదృష్టం. అభిమానంతోపాటు అనుభవం కూడా వున్న పెద్దలు వాళ్ళు. వాళ్ళు చెప్పినట్లు నడుచుకోవడం నీ విధి..." అంటూ రాజు మూర్తికి పదిరూపాయల నోటు అందించాడు.

మూర్తి థాంక్స్ చెప్పి వెళ్ళిపోయాడు.

రాజాకు తలిదండ్రులెవరో తెలియదు. అతనికి కాస్త లోకం తెలిసినప్పట్నించీ తెలిసిన మనిషి సత్తెమ్మ. ఆమె రాజుకు తల్లిని కానసీ–రాజు తనకు దొరికిన బిడ్డ అనీ అందరికీ చెబుతుండేది. ఏభై ఏళ్ళ సత్తెమ్మకు మూడు నాలుగేళ్ళ బిడ్డ వుంటాడని ఎవరూ అనుకోలేదు.

సత్తెమ్మ విధవరాలు. ఆమెకు పాతికేళ్ళప్పుడు మొగుడు పోయాట్ట. అప్పట్నించీ ఆమె నాలుగిళ్ళ పని చేసుకుని బ్రతుకు వెళ్ళబుచ్చేది. సత్తెమ్మకో కొడుకు వుండేవాడు. ఏడెనిమిదేళ్ళు పెరిగాక మశూచి సోకి చనిపోయాడు. కొడుకు మరణం సత్తెమ్మను బాగా క్రుంగదీసింది. దుఃఖంతోనే ఆమె బ్రతుకును వెళ్ళదీస్తూంది.

ఆ తర్వాత ఏభయ్యోపడికి దగ్గర్లో వుండగా ఆమె పట్నం వెళ్ళి కొన్ని నెలలుండి వచ్చింది. వచ్చేటప్పుడు ఒక చంటి పిల్లాడిని తీసుకుని వచ్చింది. సమాజంలో ఆమెకున్న స్థానం బహుచిన్నది కాబట్టి_ఆ విషయం గురించి ఎవరూ పట్టించుకోలేదు. సత్తెమ్మమాత్రం రాజు తనకు దొరికిన బిడ్డ అని నలుగురికీ చెప్పింది. ఆ కుర్రాడికి రాజు అని తనే పేరు పెట్టింది. రాజుకు ఏడేళ్ళు వచ్చే సరికే_మూర్తి నాన్నగారింట్లో పనికి ప్రవేశపెట్టింది.

రాజు చాలా చురుగ్గా ఉండేవాడు. చలాకీగా పని చేసేవాడు. మూర్తికీ అతనికీ చాలా మంచి స్నేహం కుదిరింది. వీలున్నప్పుడల్లా ఇద్దరూ ఆడుకుంటూండేవారు.

మూర్తి సాహచర్యంలో రాజు అక్షరజ్ఞానమూ - లెక్కలు చేయడమూ నేర్చుకున్నాడు. పదేళ్ళ వయసప్పుడు అతనే నలుగురిచుట్టూ తిరిగి పేపర్ బోయ్ ఉద్యోగం సంపాదించి మూర్తి ఇంట్లోపనికి స్వస్తిచెప్పేశాడు.

పేపర్ బోయ్ ఉద్యోగం ఒకటి రెండేళ్ళు చేసేక అతను కొన్నాళ్ళు సినిమాహాల్లో గేటుకీపరుగానూ, మరి కొన్నాళ్ళు హోటల్లో సర్వరుగానూ పనిచేశాడు. ముసలిదవుతున్నా సత్తెమ్మ దృఢంగానే వుండేది. ఇద్దరికీ

తిండికి సరిపడ ఆమె సంపాదించేది. తన సంపాదనలో సగానికి పైగా జాగ్రత్తగా నిలచేస్తూండేవాడు రాజు.

హోటల్లో పనికి చేరేక రాజుకు తనూ వ్యాపారం చేయాలనిపించింది. అతను సత్తెమ్మను ప్రోత్సహించి ఇంట్లో రకరకాల తినుబండారాలు తయారుచేయించి చిన్న అంగడి ప్రారంభించాడు. అది జోరుగానే సాగి పోయింది.

వ్యాపారం ఏణర్ధంపాటు సాగేక సత్తెమ్మ తనువు చాలించింది. కొడుకు చేయవలసినవన్నీ రాజు ఆమెకు చేశాడు.

అయితే రాజుకిప్పుడు తన అంగడి కొనసాగించడానికో మనిషి కావలసొచ్చింది. అతనికి వంటరాదు. వంటపట్ల ఆసక్తి లేదు. ఇటు వ్యాపారానికీ, అటు ఇంట్లో వంట చేయడానికీ కూడా ఒక ఆడమనిషి ఉంటే బాగుండునని అతనికి తోచింది. అప్పుడే అతనికి సీత దొరికింది.

సీత వయస్సు ఇరవైలోపే కానీ రాజుకంటె ఆమె కనీసం కొద్దినెలలైనా పెద్దది. మనిషి పెద్ద అందగత్తె కాకపోయినా వయసు ఆమెను అందగత్తెను చేసింది. మూడేళ్ళ క్రితం మొగుడామెను వదిలి వెళ్ళిపోయాడు. కారణం తెలియదు. సీత ప్రవర్తన సరైనదికాదనీ అందుకే మొగుడామెను వదిలేశాడనీ చాలామంది చెప్పుకున్నారు.

మొగుడు వదిలిపెట్టేక సీత వంటపనిచేసి బ్రతకాలను కుంది. అయితే ఏ ఇంట్లో ఆమె పనికి కుదిరినా ఆ ఇంటి ఇల్లాలుకి ఆమెమీద చాలా అనుమానంగా ఉండేది. ఆఖ రికి అరవై ఏళ్ళ ముసలాడి పెళ్ళాంకూడా సీత తన మొగుణ్ణి వశపర్చుకుంటుందని భయపడేది.

సీతలో ఆ ఆకర్షణ వుంది. నిజంగానే ఆమె వయసు పిటపిటలాడిపోతోంది. అందువల్ల ఏ ఇంట్లోనూ ఆమె ఎక్కువకాలం పనిచేయలేక పోయేది. ఇటువంటి సమయంలో రాజు ఆమెకు దొరికాడు.

రాజుకూడా చాలా త్వరగా సీతమోజులో పడిపోయి ఆమెను పెళ్ళిచేసుకుంటా నన్నాడు. సీత నవ్వి - "నాకంటే చిన్నాడివి. నీతో నాకు పెళ్ళేంటి?" అంది. చిన్నయినా నాకు నువ్వే కావాలని రాజు అంటే—

"ఇప్పుడిప్పుడే వయసులోకి వచ్చావు. అందుకే నీకలా గనిపిస్తూంది. నీకు జోడైనపిల్ల దొరికేదాకా నేను నీతోనే ఉంటానులే..." అంది సీత.

రాజు సంసార సుఖాలన్నీ అనుభవిస్తున్నాడు. వంట విషయంలోకూడా సీత పాకశాస్త్ర ప్రావీణ్యం అతన్ని మైమరపించడం సంగతి అటుంచి, అతని వ్యాపారం జోరుగా నడిచిపోతోంది.

కొద్ది నెలలు వ్యాపారం నడిచేక "ఇద్దరూ ఒకచోటే ఎందుకూ—మిఠాయి అంగడి నేను చూసుకుంటాను కానీ నువ్వు ఏ కిళ్ళీబడ్డీ అయినా తెరవరాదూ ఇద్దరూ రెండు చేతులా సంపాదించవచ్చు..." అంది సీత.

నిజమే ననిపించింది రాజుకి. సీత మాటలను అమల్లో పెట్టాడు.

## 2

"నీ పేరేమిటి పిల్లా?"

సీత ఆ మనిషిని పరీక్షగా చూసింది. చూడ్డానికి కాడీలా వున్నాడు.

"సీత" అని "ఏంకావాలో చెప్పు" అంది సీత.

"ఏం కావాలన్నా దొరుకుతాయా ఇక్కడ" అన్నాడు రాడీ.

"ఎదురుగా కనిపిస్తున్నాయి కదా అవే దొరుకు తాయి" అంది సీత చిరాగ్గా.

"ఎదురుగా నువ్వే కనిపిస్తున్నావు నాకు-రేటు చెప్పు" అన్నాడు రాడీ.

సీత గుడ్లురిమి చూసి "నా పేరు సీత" అంది.

రాడీ నవ్వి "నా పేరు రావణాసురుడు" అన్నాడు.

"సీతను తీసుకెళ్ళి రావణాసురుడు చచ్చాడు" అంది సీత.

"ఆ రోజులు వేరు. ఈ రోజుల్లో సీతను తీసుకువెడితే రావణాసురుడేం చేస్తాడో తెలుసుకోవాలనుంటే నాతో రా" అన్నాడు రాడీ.

"సీతను కదిలించడం అంత సులభం కాదు. కనీసం ఒక బంగారు లేడి కావాలి. దాన్ని రాముడికివ్వాలి..." అంది సీత.

"రేటు చాలా ఎక్కువన్నమాట" అన్నాడు రాడీ.

"ఈ రేటు సీతకు కాదు. నీ చావుకు. డబ్బిచ్చి చావు కొనుక్కోదల్చుకుంటే రాత్రికి ఇంటికి రా. రాముణ్ణి చూపిస్తాను" అంది సీత.

"డబ్బు తీసుకునే వస్తానే పిల్లా - నీకోసం చచ్చిపోయినా ఫరవాలేదనిపిస్తోంది నాకు. నీ చేతుల నాజూకుతనం రాత్రికి చూస్తాను కానీ - ఆ చేతులు చేసిన పకోడీలో పావలాకియ్యి" అంటూ పావలా ఆమె ముందు విసిరాడు. పకోడీలు పొట్లంకట్టి ఇచ్చి ఆలోచనలో పడింది సీత. ఆ రాడీ వెళ్ళిపోయాడు.

సెకండ్ షో సినిమాలారంభమయ్యేక సీత గుళాణం మూసేసింది. రాజుకూడా వచ్చి ఆమెను కలుసుకున్నాడు. ఇద్దరూ ఇంటికి బయల్దేరారు.

"సాయంత్రం నాలుగ్గంటలకో రౌడీ వెధవ నా దగ్గర కొచ్చాడు" అంటూ వివరంగా చెప్పింది సీత.

అంతా విని రాజు "ఇప్పుడు నన్నేం చేయమంటావ్— ఇంటికి రానా వద్దా" అన్నాడు.

సీత ముఖంలో బాధకనిపించింది. "ఏంతమాటన్నావ్ రాజూ" అందామె. రాజు మాట్లాడలేదు. "ఇంత కాలంగా నీతో ఉంటున్నాను. నా నడవడిలో ఏదైనా లోపం కనపడిందా?" అంది సీత మళ్ళీ.

"అదేం కాదు. నీకెలాంటి జీవితమిష్టమో నాకు తెలియదు. నిన్ను ఆంక్షపెట్టి శాసించే అధికారం నాకు లేదు" అన్నాడు రాజు.

"రాజూ — నువ్వనుకొనేలాంటి జీవితం నేను గడపదల్చుకుంటే నేను నీ పంచన చేరేదాన్నే కాదు. నా దురదృష్టంకొద్దీ నాకు నీడనిచ్చిన వారందరికీ నామీద అనుమానమే. నా మొగుడుకూడా నామీద అనుమానపడి నన్ను వదిలి వెళ్ళిపోయాడు. మొగుడు వదిలేశాక నేను మరే మగవాణ్ణీ నా ఒంటిమీద చేయివెయ్యనివ్వలేదు. చాలా పవిత్రంగా జీవితం గడిపాను. అందుకే ఎక్కడా స్థిరపడలేకపోయాను. ఆఖరికి నీ దగ్గరకు వచ్చాను.

"నువ్వు నాకు నచ్చావు. నాకు ఆశ్రయమిచ్చిన మంచివాడివి నువ్వు. జీవితంలో పెళ్ళిజోలికి పోదల్చుకోలేదు నేను. నువ్వు నాకంటె చిన్నవాడివి. నేను ఒకసారి పెళ్ళైనదాన్ని. నాలాంటిది నీకు తగదనే ఉద్దేశ్యంలో —

నువ్వు ఒప్పుకున్నా నీతో పెళ్ళికి నే నంగీకరించలేదు. నీ పట్ల కృతజ్ఞతతో నీకు లొంగిపోయాను. కానీ నీ మెడకు నేను గుదిబండను కాకూడదని నా కోరిక. మెడలో తాళి కట్టకపోయినా నువ్వే నా మొగుడివి. నామీద తప్పుడు అభిప్రాయాలన్నీ వదిలిపెట్టి – ఇతర మగవాళ్ళ బారినుంచి నన్ను రక్షించు. నన్ను పవిత్రంగా జీవించనీ'' అంది సీత.

రాజు ఆశ్చర్యంగా సీతవంక చూశాడు. అతని మనసును పశ్చాత్తాపం దహించివేసింది. ''నన్ను క్షమించు సీతా'' అన్నాడతను. ఇద్దరూ ఇల్లు చేరిన అయిదు నిముషాలకు ఎవరో తలుపు తట్టారు. సీత వెళ్ళి తలుపు తీసింది.

''ఇంట్లో రాముడుంటే నేనిచ్చిన డబ్బు తీసుకుని బయటకు పొమ్మనమను. నీ మామూలు రేటు చెప్పు. అంతకు రెట్టింపిస్తాను'' అంటూ లోపలకడుగుపెట్టాడు రౌడీ.

''ఎవర్రా నువ్వు?'' అంటూ రాజు ముందుకు వచ్చాడు. అతని కళ్ళలోంచి నిప్పులు కురుస్తున్నాయి.

రౌడీ విసుగ్గా, చిరాగ్గా, నిర్లక్ష్యంగా ముఖాన్ని పక్కకు తిప్పి రాజువంక చూశాడు. చూసిన రెండు క్షణాల్లోనే అతని కళ్ళలో ఇతర భావాలు మాయమై ఆశ్చర్యం చోటుచేసుకుంది.

''ఎవరున్నువ్వు?'' అన్నాడు రౌడీ.

''నీపాలిటి యముణ్ణి'' అన్నాడు రాజు మరో అడుగు ముందుకు వేసి.

''ఆగు – నేను నీ సీత జోలికి రాను. నువ్వెవరో చెప్పు. నాకు చాలా అవసరం...'' అన్నాడు. రౌడీ.

రాజింకో అడుగు ముందుకు వేసి ''చెప్పానుగా యము ణ్ణని...'' అన్నాడు.

రౌడీ ఒక అడుగు వెనక్కి వేసి - "నన్ను క్షమించు. సీత నీ భార్యని నాకు తెలియదు. అందుకే చొరవచేశాను. నిన్ను నేను ఇలా కలుసుకుంటానని అనుకోలేదు. అసలు నిన్ను కలుసుకోగలననే నాకు తెలియదు" అన్నాడు.

ఆ రౌడీకంటె రాజు దృఢంగా వున్నాడు. అందుకే అతను భయపడి ఏదో దొంగ నాటకమాడుతున్నాడని రాజుకు తోచింది.

"నీ నాటకాలు చాలించు. జీవితం గుర్తుండే గుణపాఠం నీకీరోజు చెబుతాను" అంటూ రాజు పిడికిలి బిగించి ఆ రౌడీని గట్టిగా గుద్దాడు. రౌడీ కిందపడిపోయి - "క్షణాల మీద నిన్ను నేను పడగొట్టగలను. ఫైటింగ్స్‌లో నాకు చాలా సులువుబరువులు తెలుసును. అయినా నేను నిన్నేమీ చేయను. నువ్వు నా యజమాని కొడుకువు కాబట్టి" అన్నాడు.

రాజుకు ఎత్తబోయిన చేయిఆగిపోయింది. వేయబోయిన అడుగు ముందుకు పడలేదు "ఏమిటన్నావ్?" అన్నాడాశ్చర్యంలోంచి తేరుకుని.

రౌడీ తడబడ్డట్లు కనపడ్డాడు. రాజు ఆశ్చర్యంలోంచి తేరుకునేలోగానే అతను చటుక్కున లేచి గుడిసెలోంచి బయటకు పరుగెత్తాడు.

## 3

"వాడు చెప్పింది నిజమేనంటావా?" అన్నాడు రాజు.

"ఏమో - నాకెలా తెలుస్తుంది. వాడి యజమానెవరో ఆ కథా కమామీషూ ఏమిటో నాకు తెలియదు" అంది సీత.

"నా అనుమానం తప్పించుకు పారిపోవడానికి వాడు

వేసిన ఎత్తు అని.''

సీత నవ్వి ''ఆడదానికోసం ఇంత తెగించి వచ్చిన వాడు అంత సులువుగా పారిపోడు. వాడు నిన్నో చూపు చూసి మరీ వెళ్ళివుండేవాడు. కానీ నీ ముఖం చూడగానే ఎవరో తెలుసున్న వాళ్ళని చూసిన భావం-అదో రకమైన ఆశ్చర్యం వాడిముఖంలో నాకు కనిపించాయి. అది నటన కాదని ఖచ్చితంగా చెప్పగలను.'' అంది.

రాజుకూడా ఆలోచించి ''నిజమే నేమోలే లేకపోతే నా తండ్రి గురించి నాకు తెలియదని వాడికెలా తెలుస్తుంది? అందులోనూ వాడికీ మనకూ ఏవిధమైన పూర్వ పరిచయమూ లేదు. ఇంతకీ వాడి యజమాని ఎవరో తెలుసుకోవాలి?'' అన్నాడు.

''వాడు మళ్ళీ దొరికినప్పుడు పట్టుకుందాం'' అంది సీత.

కానీ రెండు మూడు వారాలు గడిచినా వాళ్ళకా రాడీ జాడ తెలియలేదు. రాజుకుమాత్రం తన తండ్రి గురించిన ఆచూకీ దొరికినట్లే దొరికి మాయమైందని చాలా బాధగా ఉంది.

ఈ విషయమై విచారించడానికి అతనొక పర్యాయం గూండాలుండే ప్రాంతానికి వెళ్ళి వచ్చాడు. తనింటికి వచ్చిన రాడీ దొరుకుతాడేమోనని అతని ఆశ. అయితే అక్కడ అతని వాలకమూ, ప్రశ్నించే తీరూ చూసి పోలీసుల మనిషని అనుమానించి ఓ ఇద్దరుగూండాలతన్ని తన్నడానికి సిద్ధపడ్డారు.

తనను గురించి నమ్మించడానికి రాజు చాలా శ్రమపడవలసి వచ్చింది. అందువల్ల అతనికి తన్నులు తప్పాయి

గానీ-అవసరమైన సమాచారమేదీ లభించలేదు. అది ప్రమాదకరమైన స్థలమని గ్రహించి, రాజు మళ్ళీ అక్కడకు వెళ్ళే ప్రయత్నం చేయలేదు.

మరో వారం గడిచేసరికి రాజా విషయాన్ని మరిచి పోవడానికి చేసిన ప్రయత్నంలో కృతకృత్యుడయ్యాడు.

"నా తండ్రి ఎవరైతేనేం నేను రాజుని. నా రాజ్యం విశాలమైనది. దానికి నిన్ను రాణిగా చేసుకుని హాయిగా రాజ్యమేలతాను. అనవసరపు టాలోచనలతో మనసును వేధించదల్చుకోలేదు..." అన్నాడొక రాత్రి అతను సీతతో. సీత మనసును చల్లబరిచేలా, ఒళ్ళు వేడెక్కేలా నవ్వింది. రాజు చేయి సీతమీద పడ్డ క్షణంలో ఎవరో గుడిసె తలుపు తట్టారు. చటుక్కున లేచాడు రాజు. వెళ్ళి తలుపు తీశాడు.

లోపలకొచ్చిన వ్యక్తి వెంటనే తలుపు మూశాడు. ఆ వ్యక్తిని చూసిన రాజు ఆశ్చర్యపోయాడు. తను కొద్ది వారాలుగా వెతుకుతున్నది అతనికోసమే. సీతను డబ్బుతో కొనాలనుకున్న రౌడీ అతనే! అతని చేతిలో రివాల్వరుంది.

"నేను తప్పు ఉద్దేశ్యంతో ఇక్కడికి రాలేదు. కొన్ని గంటలసేపు నాకిక్కడ ఆశ్రయం కావాలి..." అన్నాడు రౌడీ.

"దేనికి?"

"పోలీసులు నన్ను తరుముతున్నారు. ఎలాగో వాళ్ళ కళ్ళల్లో కారం చల్లి, నీ ఇంట్లో అడుగు పెట్టాను. నన్ను వాళ్ళ బారినుంచి రక్షిస్తే మీకే ఉపకారమైనా చేయ గలను" అన్నాడు రౌడీ.

రాజు క్షణం ఆలోచించాడు. ఇతనివల్ల తన తండ్రిని గురించి తెలుసుకునే అవకాశముంది. తెలిసినా తెలియక పోయినా ఒక ముఖ్య విషయంలో తనను పీడిస్తున్న సందేహాలు తొలగిపోతాయి. ఇలా అభిప్రాయపడి అతను సరేనన్నాడు.

"ఏ క్షణంలోనైనా పోలీసులు రావచ్చు. నన్ను వాళ్ళు సులభంగా గుర్తించగలరు. నేనీ మంచంక్రింద దాగుంటాను. ఎవరొచ్చి అడిగినా మీ ఇంట్లోకెవ్వరూ రాలేదని చెప్పండి" అన్నాడు రాడీ ఇద్దర్నీ ఉద్దేశించి.

రాడీ మంచం క్రిందకు దూరేడో లేదో-ఎవరోతలుపు తట్టారు. రాజు వెళ్ళి తలుపు తీశాడు. పోలీసులు!

"ఈ ఇంట్లోకెవరైనా వచ్చారా?" అనడిగేడు ఒక పోలీసు. లేదన్నాడు రాజు. పోలీసులు మాత్రం అతని సమాధానంమీద ఆధారపడలేదు. వాళ్ళు గుడిసెలో నలుమూలలా వెతికారు. రాజు చాలా కంగారుగా జరుగు తున్నది గమనిస్తున్నాడు. దొరక్క దొరక్క తనకు దొరికిన ముఖ్యాధారాన్ని పోలీసులు తీసుకుపోతారేమో నని అతను భయపడుతున్నాడు.

అది చిన్న గుడిసె. మనిషిని దాచడానికి అనువైన చోటక్కడ అట్టే లేదు. అయినా పోలీసులు తమ అను మాన నివృత్తికోసం శ్రద్ధగా వెతుకుతున్నారు. వాళ్ళలో ఒకడు మంచాన్ని కదిపి కాస్త పైకెత్తి "ఇదిగో-ఇక్కడో మనిషున్నాడు..." అంటూ కేకపెట్టాడు. అంతా రాడీను చుట్టుముట్టారు.

ఒక పోలీసు కోపంగా రాజుని చూసి "దొంగను దాచడం పెద్ద నేరం. మీ ఇద్దరికీ ఏదో పెద్ద లాలూ

చీరే వుండి వుండాలి. నువ్వుకూడా స్టేషనుకి పద”
అన్నాడు.

రాజు సమాధానాన్నికానీ సీత వేడుకోలుకానీ వాళ్లు వినలేదు. మరి తప్పదని తెలిసిక రాజు కంగారుపడవద్దని సీతకు ధైర్యం చెప్పి, తనూ పోలీసులతో బయల్దేరాడు.

## 4

అంతా శ్రద్ధగా విన్నాడు ఇన్‌స్పెక్టర్ వేణు. “నీ మాటలు నమ్మదగ్గవిగానే వున్నాయి. ప్రస్తుతానికి నువ్వు వెళ్ళవచ్చు. కానీ పోలీసులు ఎప్పుడు రమ్మంటే అప్పుడు రావాలి. నీగురించిన సమాచారం కూడా ఆ దొంగ వెధవనుంచి రాబట్టడానికి ప్రయత్నిస్తాను. తెలిసిన సమాచారం తప్పకుండా నీకందచేస్తాను.”

“చాలా థాంక్స్ సర్” అని అక్కణ్నించి బయట పడ్డాడు రాజు. రాజు వెళ్ళిపోగానే వేణు లాకప్‌లో వున్న రాడీ దగ్గరకు వెళ్ళాడు.

“ఏమైనా చెప్పేడా?” అనడిగేడు.

“ఏమీ చెప్పలేదండి. దొంగసొత్తెక్కడ దాచాడో తెలియనూలేదు. తనసలు దొంగతనమే చేయలేదంటున్నా డండి.”

వేణు ముఖం ముందు గంభీరంగా మారింది. తర్వాత కర్కశంగా మారింది. “ఏరా—వేణు దెబ్బలు రుచి చూడాలనుందా? దొంగతనానికి కాకపోతే ముత్యాలారావుగారింటి గదిలో అర్ధరాత్రి ఒంటిగంట ప్రాంతాల ఏంచేస్తున్నావు? వాళ్ళింట్లో వుండవలసిన రెండు లక్షల విలువచేసే నగలేమయ్యాయి?”

“బుద్ధి గడ్డితిని దొంగతనం చేద్దామనే వెళ్ళానండి.

కానీ నా దురదృష్టంకొద్దీ చేతికింకా ఏమీ చిక్కకుండానే ఇంటివాళ్ళకు మెలకువ వచ్చేసిందండి. దాంతో నేను పారిపోయానండి. పోలీసులు వెంటబడ్డారు."

"మిస్టర్ త్రీ జీరో ఎయిట్-వీణ్ని స్పెషల్ రూముకు నడిపించు. వీడిచేత నిజం కక్కిస్తాను" అన్నాడు వేణు.

రౌడీ భయం భయంగా చూసి "వద్దండి. అన్నీ చెప్పేస్తాను" అన్నాడు. దెబ్బలకు సంబంధించిన పాత జ్ఞాపకాలేవో వచ్చినట్లు అతని ముఖాన్ని చూస్తూంటే చెప్పవచ్చు. ఎప్పటికో అప్పుడు ఎలాగూ నిజాన్ని ఒప్పుకోవాలి. అన్ని దెబ్బలూ తిని శరీరాన్ని హూనం చేసుకోవడమెందుకని అతనికి తోచినట్లుంది.

"చెప్పు." అన్నాడు కటువుగా వేణు.

రౌడీ తను నగ లెక్కడ దాచినదీ చెప్పాడు. వేణు వెంటనే అందులో నిజానిజాలు తెలుసుకోడానికి ఒక కానిస్టేబుల్ని పంపాడు.

"నగల సంగతి సరే-నీ కెవరో యజమాని ఉన్నాడటగా వాడి పేరు చెప్పు" అన్నాడు వేణు.

"నాకు యజమానేంటండి. నాకు నేనే యజమాన్ని."

"త్రీనాట్ ఎయిట్-స్పెషల్ రూమ్..." అన్నాడు వేణు.

"నన్ను నమ్మండి బాబూ నిజంగానే నాకేమీ తెలియదు." అన్నాడు రౌడీ.

"నీ యజమాని కొడుకని చెప్పి రాజుని వదిలిపెట్టావు. యజమానిపట్ల నీకు చాలా భక్తి విశ్వాసాలున్నట్లున్నాయి."

"అదంతా నాటకం బాబూ. తప్పించుకు పారిపో డానికి నేను పన్నిన ఉపాయం."

"అప్పుడాడింది నాటకమో, ఇప్పుడాడుతున్నది నాటకమో-స్పెషల్ రూమ్‌లో స్పెషల్ ట్రీట్‌మెంటు బయటపెడుతుంది-త్రీ నాట్ ఎయిట్..."

రాడీ కళ్ళలో నీళ్ళు నిండాయి. ముఖం నిండా బాధ చోటుచేసుకుంది.

"అన్నీ చెప్పేస్తాను. కానీ నా ప్రాణాలింక నావి కాదు. సింహానికి వ్యతిరేకంగా పనిచేసిన ఏ ఒక్కణ్ణీ పోలీసులు కూడ రక్షించలేక పోయారు" అన్నాడు రాడీ.

"నువ్వు సింహం అనుచరుడివా?" అన్నాడు వేణు. ఆశ్చర్యం అతనికళ్ళలో స్పష్టంగా కనిపిస్తోంది.

"అవును. సింహానికి అతిదగ్గరగా మసలినవాణ్ణి. ఆయన ముఖం చూసిన అతితక్కువ మందిలో ఒకడిని" అన్నాడు రాడీ.

"ఇంకా చెప్పు." అన్నాడు వేణు.

"ఏదో చిన్నచిన్న జేబు దొంగతనాలతో కాలం గడుపుతూండేవాణ్ని. ఒకసారి ఓ పెద్దమనిషి జేబులో చేయిపెట్టగానే నన్ను పట్టుకున్నాడు. నేను వణికి పోగా భయపడవద్దనీ తనతో రమ్మనమనీ అన్నాడు. ఇంటికి తీసుకువెళ్ళి నన్ను పరీక్షగా చూశాడు. చొక్కా విప్పేయమన్నాడు. పరీక్షగా ముందూ వెనకా చూసి నిట్టూర్చి నువ్వు నా కొడుకువి కాదు అన్నాడు. నా కాశ్చర్యం వేసి వివరాలడిగాను.

చిన్నతనంలో ఆయన కొడుకు తప్పిపోయాట్ట. ఆ

కొడుకుకోసం ఆయన వేయికళ్ళతో వెతుకుతున్నాట్ట. నన్ను చూస్తే ఆయనకు తన కొడుకేమోననిపించిందట. నన్నాయన కొంతకాలం తనవద్ద ఉంచుకున్నాడు. ఆయనదగ్గర చాలా చనువుగా వుండేవాణ్ని.

కొంతకాలం అలా గడిచేక ఒక రోజు ఆయన తను ట్రాన్స్‌ఫర్ మీద మరో ఊరు వెడుతున్నానని చెప్పాడు. ఎప్పుడైనా నాకు తన పోలికలున్న కుర్రాడు కనబడితే చెప్పవలసిందని ఆయన కోరాడు. అలాగేనని చెప్పాను.

అప్పుడు చెప్పాడు-తన పేరు నరసింహమనీ, పోలీసు లకు తను 'సింహం' అనీ!

నేను వణికిపోయాను. ఈ మధ్య చూసిన రాజు చాలావరకూ ఆయన పోలికల్లోనే వున్నాడు. కానీ ఆయ నను మళ్ళీ ఎలా కలుసుకోవాలో తెలియక ఊరు కున్నాను. ప్రతిఏటా ఒకసారి తనే నన్ను కలుసుకుంటా నని ఆయన నాకు చెప్పారు."

"రాజుకు సింహం పోలికలున్నాయా?" అన్నాడు ఆశ్చర్యంగా వేణు.

"అవునండి." అన్నాడు రాడీ.

# 5

"మిస్టర్ రాజూ-నీ జన్మ రహస్యం తెలుసుకోగలి గాను. కానీ నీ తండ్రిని నీకు చూపలేను. ఎందుకంటే ఆయన ఈ లోకంలో లేరు." అన్నాడు ఇన్‌స్పెక్టర్ వేణు.

వేణు మాటల్లో అర్థం చేసుకోవడానికి రాజుకు కాస్త వ్యవధి కావల్సొచ్చింది. అంతా అర్థమయ్యేక "ఎవరు సార్ నా తండ్రి? కనీసం ఆయన ఫోటోను చూసే

అదృష్టం నాకుందా?'' అన్నాడు రాజు.

''ఆయన దేశభక్తుడు. ప్రజా కంటకుడు 'సింహం'ను అంతం చేయడానికి ఆయన తన శాయశక్తులా ప్రయత్నించాడు. చివరకు సింహం చేతిలోనే మరణించాడు. సింహాన్ని తను స్వయంగా పట్టుకోవాలన్న జీవితాశయం తీరకుండానే ఆయన తనువు చాలించాడు.

నిన్ను కని కన్నుమూసింది నీ తల్లి. నువ్వు నెలల పిల్లాడివిగా ఉండగా నీ ఒంటికి వున్న బంగారం కోసం నిన్ను దొంగలెత్తుకుపోయారుట. ఎప్పటికైనా నువ్వు దొరుకుతావని ఆయన ఆశించాడు. నీ ఇంటికి వచ్చిన రౌడీ ఆయనవద్ద కొంతకాలం పనిచేశాడు. అతన్నెంతో అభిమానంగా చూశాడు నీ తండ్రి. కానీ అతడి బుద్ధులు మంచివికావని తెలిసేక పనిలోంచి తీసేశాడు.

అయినా అవసరపడ్డప్పుడల్లా రౌడీకి డబ్బులిచ్చి సాయంచేస్తూండేవాడు. తన బుద్ధులు మానుకోలేకపోయినా రౌడీకి మీ నాన్నగారంటే చాలా గౌరవం వుండి.'' అంటూ ముందే తయారుచేసి ఉంచుకున్న కథ చెప్పాడు వేణు.

''ఇంతకీ నేనాయన కొడుకునన్న గ్యారంటీ ఏమిటి సార్?'' అన్నాడు రాజు.

''నీ ముఖంలో మీ నాన్న పోలికలు స్పష్టంగా వున్నాయి'' అన్నాడు వేణు. అతను జేబులోంచి ఒక ఫొటో తీశాడు. ఆ ఫొటో రాజుదే కానీ స్పెషల్ ట్రీట్మెంటువల్ల చాలా పాతదిలా కనబడుతోంది.

''ఇది నీ తండ్రి వయసులో వున్నప్పటి ఫొటో'' అంటూ అది రాజుకు అందించాడు.

రాజు ఆ ఫోటో చూసి తెల్లబోయాడు. మనిషికీ మనిషికీ అంత దారుణంగా పోలికలుండవచ్చునని అతననుకోలేదు. అది తన తండ్రిదని చెప్పినా నమ్మలేనట్లుందా ఫోటో.

"ఈ ఫోటో ఎక్కడ దొరికింది?"

"నీ తండ్రిది కళ్యాణపురం. కానీ ఆయన ఆ ఊళ్ళో వారికాట్టే తెలియదు. అక్కడాట్టే వుండేవాడు కాదు. ఆ ఊళ్ళో పెద్ద బంగళా వుంది. మీ తండ్రి ఆస్తి వ్యవహారాలు చూస్తున్న జగన్నాథం అనే పెద్దమనిషి ఆ ఇంట్లో వుంటున్నాడు. జగన్నాథం ఏకాకి. నీ తండ్రి అంటే ఆయనకు అంతులేని గౌరవాభిమానాలున్నాయి. గత ఇరవైఏళ్లుగా ఆయన అక్కడే వుంటూ నమ్మకంగా మీ ఆస్తి వ్యవహారాలు చూస్తున్నారు. నీ తండ్రిపోయి రెండు సంవత్సరాలైంది. అప్పట్నించీ ఆయనను విరక్తి భావం ఆవహించింది. ఇప్పుడు నువ్వా ఇంట్లో అడుగు పెడితే ఆయన జీవితంలో కొత్త వెలుగు వస్తుంది."

రాజు ముఖంలో అదోరకమైన ఉత్సాహం కనిపించింది–"ఈ కబురు మా సీతకు చెప్పాలి. చాలా సంతోషిస్తుంది."

"మిస్టర్ రాజూ - ఒక్క నిమిషం. ప్రస్తుతం ఈ వివరాలేవీ నీ భార్యకు చెప్పవద్దు. ఆమెకు అన్నివిధాలా రక్షణ మేము ఏర్పాటుచేస్తాం. తన శత్రువుకొడుకు బ్రతికున్నాడని తెలియగానే సింహం తన పంజా నీమీదకు విసరడానికి ప్రయత్నిస్తాడు. అప్పుడే ఆ పంజాను అలాగే నా చేతో పట్టుకోవాలని నా ఆశ. నీ జన్మ రహస్యం తెలియజేయడంలో నాకున్న స్వార్థమిది" అన్నాడు వేణు.

ముఖ్యమైన పనిమీద కొన్ని నెలలపాటు ఏదో పొరుగు ప్రదేశానికి వెడుతున్నానని సీతకు చెప్పడానికి రాజు తన ఇంటికి బయల్దేరి వెళ్ళాడు.

# 6

"జగన్నాథంగారూ - మీరు పోలీసుల మనిషి అన్న విషయం పొరపాటునకూడా రాజుకు తెలియనివ్వకూడదు" అన్నాడు వేణు.

"తెలియనివ్వను. కానీ ఇంతవరకూ మీకు సింహం ఆచూకీ ఏమాత్రమూ ఇవ్వలేకపోయినందుకు మాత్రం విచారంగా వుంది. రాజు పోలికలతో వుండేలా నలభై అయిదేళ్ళ వ్యక్తి తైలవర్ణచిత్రం సిద్ధంచేయించాను..." అన్నాడు జగన్నాథం.

వేణు స్వరంతగ్గించి ముంగుకు వంగి - "ఇతను ... ఈ రాజు...సింహంకొడుకు. అందుకు అవసరమైన ఆధారాలు మా దగ్గరున్నాయి, చాలాచలాకీ అయిన కుర్రవాడు. తండ్రిని పట్టుకునేందుకు కొడుకుని నియోగించాం. ఇది పోలీసుల టాప్‌సీక్రెట్. ఈ రహస్యాన్ని మీరుకూడా ఇలాగే కాపాడుకోవాలి. అప్పుడప్పుడు రాజు చిత్తశుద్ధిని, కర్తవ్యదీక్షను పరీక్షిస్తూండండి" అన్నాడు.

జగన్నాథం నవ్వి "అవన్నీ మీరు నాకువేరే చెప్ప నవసరం లేదు. ఇరవై సంవత్సరాలుగా నెరవేరని నా జీవితాశయం ఈ విధంగానే నెరవేరితే అంతకంటె నా క్కావలసిన దేముంది?" అన్నాడు.

వేణు జగన్నాథంవంక జాలిగా చూశాడు. ఇరవ య్యేళ్ళ క్రితం ఆయన భార్య, కొడుకు సింహం అమానుషానికి బలైపోయారు. కళ్యాణపురం సింహం

వుండే ప్రదేశమని తెలిసి పగతో ఆయన తన నివాసాన్ని కృడకు మార్చాడు. ఆయన ఉంటున్న బంగళా, చూస్తున్న ఆస్తి అంతా ప్రభుత్వానిది. ఈ రహాశ్యాన్ని జగన్నాథం చాలా జాగ్రత్తగా కాపాడుకుంటూ వస్తున్నాడు.

ఈ ఇరవై సంవత్సరాలలోనూ సింహం కళ్యాణపురం రాకపోలేదు. ఎప్పుడు వచ్చాడో, ఎవరింటికి వచ్చాడో, ఎలా వచ్చాడో తెలియదు. కానీ అతను వచ్చి వెళ్ళిన చిహ్నంగా ఆ ఊరి మధ్యలో వున్న మర్రిచెట్టు ప్రాంతంలో సింహంబొమ్మ వున్న తోలుముక్క దొరుకుతుంది.

ఎవరెంత ప్రయత్నించినా సింహం గురించి ఏమీ తెలుసుకోలేకపోయారు. ఆ గ్రామస్థులకు సింహంవల్ల చాలా ఉపకారాలు జరిగాయనీ, జరుగుతున్నాయనీ అందరకూ సింహం అంటే అభిమానమున్నదనీ ఆ కారణంగా తెలిసినప్పటికీ ఎవరూ అతని ఆచోకీ ఇవ్వడంలేదనీ ఒక వదంతికూడా వుంది.

జగన్నాథంగారు ఊరిలో చాలామందిని కదిపి చూశాడు. అందరూ సహృదయులు. వాళ్ళలో ఏ ఒక్కరిలోనూ సింహంఛాయలుకూడా కనపడలేదు.

"మీ జీవితాశయం తప్పక నెరవేరగలదని ఆశిస్తున్నాను" అంటూ వేణు లేచాడు. అప్పటికి రాజు స్నానం ముగించుకుని వచ్చాడు. వేణు ఇద్దరివద్దా సెలవు తీసుకుని వెళ్ళిపోయాడు.

వేణు వెళ్ళిపోయాక రాజు జగన్నాథం వంక చూసి— "సింహం గురించిన అసలు వివరాలు మీదగ్గర్నుంచి

తెలుసుకోవాలని వుంది" అన్నాడు.

జగన్నాథంగారు తన అనుభవాల పుటలలోంచి సింహం గురించిన ఉదంతాలు ఏరి సమకూర్చి రాజుకు వివరించారు.

మొదట్లో సింహం సామాన్యుడు. గౌరవంగా బ్రతుకుతున్నాడు, అనుకోని పరిస్థితుల్లో ఒక లక్షాధికారి కూతురు అతన్ని ప్రేమించింది. ఇద్దరూ చాటుగా కలుసుకుంటూండేవారు. ఆ అమ్మాయి గర్భవతయింది.

తండ్రికి తెలిసి మండిపడ్డాడు. ఇల్లు కదలకుండా కూతుర్ని కట్టడిచేశాడు. అబార్షన్ ప్రాణ ప్రమాదానికి దారితీయవచ్చని డాక్టర్లన్నారు. ఆమె పురుడు పోసుకుని కొడుకుని కంది.ఆ రాత్రే ఆ కుర్రాణ్ణి మాయంచేయడం జరిగింది. వాడేమయ్యాడో తెలియదు. తండ్రి మరో పెళ్ళి ప్రయత్నాలు చేస్తున్నాడని తెలిసి సింహం ప్రియురాలు ఆత్మహత్య చేసుకుంది.

అప్పుడే సింహంలో మార్పు వచ్చింది. అతను వెళ్ళి తన ప్రియురాలి తండ్రిని ఎదుర్కొన్నాడు. ఆయన పేదరికాన్ని న్యూనతచేస్తూ అవమేళనగా మాట్లాడి అంతస్తుల ప్రసక్తి తీసుకువచ్చాడు. అప్పుడే సింహం మొదటిహత్య చేశాడు.

ఆనాటినుంచీ ప్రజాకంటకుడిగా వర్ణించబడ్డాడు. అయితే అతనెన్నడూ సామాన్య ప్రజలజోలికి వెళ్ళలేదు. వీలైనంతలో వాళ్ళ కుపకారమేగానీ అపకారం చేయలేదు. ధనవంతులమీద అతని పగ.

అది సామాన్యమైన పగకాదు. ఎవరింటికి దొంగతనానికి వెళ్ళినా అతను తన కథను పూర్తిగా వివరించి "నా

కొడుకు ఏమయ్యాడో తెలిసేవరకూ, వాడు నన్ను కలిసే వరకూ నేను మిమ్మల్నిలా వేటాడుతూనే వుంటాను. వాడి ఆచోకీ తెలియడమన్నది జరగకపోతే నా హింసా కాండకూడా ఆగదు. ఒక రాజు చేసిన తప్పుకు పరశు రాముడు రాజుల్ని వెతికివెతికి వేటాడేడు. నేను ధనవం తుల పాలిటి పరశురాముడిని. నరుడి అవతారంలోని సింహాన్ని'' అని చెప్పేవాడట.

అందువల్ల చాలామంది సింహం కొడుకుగురించి వివరాలు సంపాదించడానికి ప్రయత్నించేవారు. కానీ ఎవ్వరూ విజయం సాధించలేకపోయారు.

కథ వింటున్న రాజు పళ్ళు పటపటలాడాయి. ''చట్టాన్ని చేతిలోకి తీసుకునే అధికారం సింహానికెవరు ఇచ్చారు? ఇటువంటి వాడిని బ్రతకనివ్వకూడదు. సింహం నా కళ్ళ బడితే చీల్చి చెండాడేస్తాను'' అన్నాడతను.

జగన్నాథం నవ్వి, ''అప్పుడు నువ్వుకూడా చట్టాన్ని చేతిలోకి తీసుకున్నట్లవుతుంది. అంతేనాయనా ఆవేశంలో ప్రతివాడూ అంతే చేయాలనుకుంటాడు. నీతులెప్పుడూ ఎదుటివారికోసమే...'' అన్నాడు.

''నా బాధ మీకర్థంకాదు జగన్నాథంగారూ_నాకూ జీవితంమీద ఎన్నో ఆశలున్నాయి. గొప్పవాడిగా, ధన వంతుడిగా సంఘంలో మంచి హోదాతో, గుర్తింపుతో బ్రతకాలన్నది నా ఆశయం.

అందుకే చిన్నతనంనుంచీ నా జన్మరహస్యం తెలుసు కోవాలని చాలా తాపత్రయపడ్డాను. నా తండ్రి ఎవరో తెలిస్తే బాగుండుననుకున్నాను. తలిదండ్రులెవరో తెలి యని వాడికి చరిత్ర లేనట్లే లెక్క. చరిత్రహీనుడికి

ఎంత డబ్బున్నా సమాజం చిన్నచూపు చూస్తోంది.

నా తెలివితేటలమీద నాకు అనంతమైన విశ్వాస ముంది. ప్రతివంటే నాగురించి నా తండ్రి ఎంతో గర్వ పడి వుండేలా మసలేవాడిని. నా అన్ని ఆశలూ నాశన మైపోవడానికి కారణభూతుడు సింహం. ఇప్పుడు వాడి నెలాగైనాసరే పట్టుకోవడమే నా జీవిత ధ్యేయం'' అన్నాడు రాజు.

''సింహం సామాన్యుడుకాదు. నాకు వాడిమీద వ్యక్తిగతమైన పగ వుంది. నా ప్రాణానికి ప్రాణమైన భార్యనూ, కొడుకునూ వాడు అంతం చేశాడు. వాడి మకాం ఈ ఊళ్ళోనే ఉండివుండాలి. లేదా ఈ ఊరు వాడికి కనీసం స్థావరమేనా అయివుండాలి. వాడికోసం ఇరవై సంవత్సరాలుగా నేను వెదుకుతున్నాను. . కానీ అంతుచిక్కడం లేదు. అలాగే ఎంతో సమర్థులైన పోలీసు ఆఫీసర్లు వాడికోసం ఎన్నో రకాల వలలు వేశారు, వాళ్ళెవ్వరూ చేయలేని పని నువ్వు చేయగలవని నేననుకోవడంలేదు.'' అన్నాడు జగన్నాథం.

''మీ సంగతి నేను చెప్పలేను కానీ పోలీసులకూ నాకూ తేడా వుంది. వాళ్ళకు సింహం మీద వ్యక్తిగత మైన పగంటూ లేదు. సింహాన్ని పట్టుకోవడం వాళ్ళ కర్తవ్యం. కర్తవ్య నిర్వహణకూ, కసికీ చాలా తేడా వుంది. ఆ విషయాన్ని కాలమే నిర్ణయిస్తుంది'' అన్నాడు రాజు.

## 7

''తిమ్మన్నా నువ్వు రాజు జన్మరహస్యం తెలుసుకు రావాలి.'' అన్నాడు జగన్నాథం.

"వేణు బాబుగారేదో చెప్పినట్లున్నారుగా" అన్నాడు తిమ్మన్న.

"ఆ అదంతా కట్టుకథ. రాజు, సింహం కొడుకని వేణు రహస్యంగా చెప్పాడు. అదే నిజమైతే నా పగ చల్లారే రోజు వచ్చినట్లే లెక్క. రాజును ఎరగా చూపించి సింహాన్ని పట్టాలని వాళ్ళు చూస్తున్నారు. కానీ దొరక్క దొరక్క దొరికిన సింహం వంశాంకురాన్ని బ్రతకనిచ్చి నేను పగతో దహించుకుపోలేను. వీడే కనుక నిజంగా సింహం కొడుకయినట్లయితే వీడు నా చేతుల్లో చావ్వాలసిందే. కానీ నిజం తెలుసుకోకుండా అన్యాయంగా ఎవరి ప్రాణాలూ తీయడం నాకిష్టంలేదు. ఎలాగో అలాగ రహస్యంగా నువ్వు రాజు జన్మరహస్యం తెలుసుకురావాలి" అన్నాడు జగన్నాథం.

తిమ్మన్న తల ఊపి వెళ్ళిపోయాడు.

జగన్నాథం అక్కణ్ణించి కదిలి హాల్లోకి వెళ్ళాడు' హాల్లో టీపాయ్‌మీద ఆరోజే వచ్చిన పేపరు వుంది' ఆయన పేపరు తీసి మడత విప్పేసరికి అందులోంచి ఒక నీలం రంగు కవరు పడింది, ఆయన పెద్దగా చలించలేదు. నిర్లిప్తంగా అడ్రస్ చూశాడు. ఫ్రం సింహం టు జగన్నాథం_అని వుంది. ఆయన కవరుని చించేటంతలో అక్కడికి రాజు వచ్చేడు.

"తోటంతా పర్యవేక్షించడం అయిందా?" అన్నాడు జగన్నాథం.

రాజు తలఊపి జగన్నాథాన్ని సమీపించాడు.

"ఇదిగో_ఇది సింహం దగ్గర్నుంచి ఉత్తరం. తనీ ఊరు వస్తున్నప్పుడల్లా నాకు ఉత్తరం రాస్తూంటాడు.

అయితే అతనికోసం ప్రయత్నించడం వృథాప్రయాస అని తెలిసేక ఈ ఉత్తరాలను చదవడమే మానేశాను'' అంటూ కవరు రాజుకి అందించాడు జగన్నాథం.

రాజు చాలా ఆశ్చర్యంగా ఆ కవరునీ, చిరునామానీ చూశాడు. వణుకుతున్న చేతులతో ఆ కవరు చింపాడు. లోపల ఎర్ర కాగితం వుంది. దానిమీద—

''డియర్ జగన్నాథం—

ఈ రోజు రాత్రికి మీ ఊరు వస్తున్నాను. ఉదయం వెళ్ళిపోతాను. మామూలుగానే నీ ప్రయత్నాలు నువ్వు చేసుకో. ఫలితం నీకూ నాకూ కూడా తెలుసు.

—సింహం.''

అని వ్రాసివుంది.

''అయితే ఈరోజు సింహం పట్టుబడ్డాడనే అనుకోవాలి.'' అన్నాడు రాజు.

''ఒకటికాదు. రెండుకాదు. రోజులుకాదు. వారాలు కాదు. ఇరవై ఏళ్ళగా అది జరుగుతోంది నాయనా'' అన్నాడు జగన్నాథం నిర్లిప్తంగా నవ్వి.

''అయితే మీరే విధమైన ప్రయత్నాలూ చేయరా?'' అన్నాడు రాజు చిరాగ్గా.

''ఎందుకు చేయమూ-అన్ని ఏర్పాట్లూ చేస్తాం. కానీ షరా మామూలే.''

''మామూలు కాదు. ఈసారి నేనున్నాను. ప్రత్యేకత వుంది'' అన్నాడు రాజు.

జగన్నాథం చిన్నపిల్లాడిని చూసి నవ్వినట్లు నవ్వేడు. రాజు కానవ్వు నచ్చలేదు.

''ఈ రోజు ఊళ్ళోకి ఎవరు కొత్తగా వచ్చినా జాగ్ర

తగా గమనించాలి. అది మనకు చాలావరకూ సహాయకారి అవుతుంది'' అన్నాడు రాజు.

జగన్నాథం అతని మాటలు వినలేదు. ఇలాంటి ప్రయత్నాలనెన్నో చేసి ఢక్కా మొక్కలు తిన్నవాడిలా ఆయన - కొంచెం పక్కగా కదిలి ఫోన్ దగ్గరకు వెళ్ళాడు, పోలీసులాయనకోసం ప్రత్యేకంగా కలగ జేసిన సౌకర్యమిది. ఆ ఊళ్ళో ఇంకెవ్వరికీ ఫోన్ లేదు. ఏదో నెంబరు డయల్ చేసి ''ఇన్స్పెక్టర్ వేణుగారేనా?'' అనడిగాడు జగన్నాథం, అవతలనుంచి సమాధానం విని.

''సింహం వస్తున్నాడీరోజు. మీరుకూడా ఏం ప్రయత్నాలు చేయదల్చుకున్నా చేయండి. నా ప్రయత్నాలు నేను చేస్తున్నాను. రాజు చాలా ఆవేశంగా వున్నాడు. నాకు పెద్దగా ఆశ లేకపోయినా ఈ రోజు సింహాన్ని పట్టుకోగలనని అతననుకుంటున్నాడు.''

తర్వాత ఒకటి రెండు మామూలు మాటలు మాట్లాడి ఆయన ఫోన్ పెట్టేశాడు.

''ఊళ్ళో ఇంటింటికి వెళ్ళి హెచ్చరించి రావాలి. నువ్వూ వస్తావా?'' అన్నాడు జగన్నాథం.

''ఎందుకు?'' అన్నాడు రాజు.

''సింహం ఇంతవరకూ ఈ ఊళ్ళో ఎవరికీ హాని చేయ్యలేదు. అయితేయేం అతను దుర్మార్గుడు. ఏమాత్రం ఆచూకీ తెలిసినా పట్టివ్వడానికి ప్రయత్నించమని ఊరందర్నీ ఓసారి హెచ్చరించి వస్తూంటాను. సింహం దగ్గర్నించి ఈ లేఖ రావడం ఎంత మామూలో నేనిలా హెచ్చరించి రావడమూ అంత మామూలు.''

"పదండి. నేనూ వస్తాను..." అన్నాడు రాజు.

జగన్నాథం రాజును తీసుకొని ఇంటింటికీ వెళ్ళి తన మామూలు మాటలు చెప్పడం మాత్రమే కాదు, అతన్ని తన యజమాని కొడుకుగా అందరికీ పరిచయం చేశాడు. రాజుకు ఊళ్ళో చాలామందితో పరిచయం లభించింది. ఆ పల్లె ప్రజల ముఖాల్లో అమాయకత్వం, ఆప్యాయత కనబడుతున్నాయతనికి. వీళ్ళు_ఈ ప్రజలు_సింహం వల్ల ఉపకారం పొందుతూ_అతని ఆచూకీ తెలియకుండా చేస్తున్నారంటే రాజుకు నమ్మబుద్ధి కాలేదు.

# 8

రాజు, జగన్నాథం ఇల్లు చేరుకునేసరికి పన్నెండు గంటలయింది.వంటవాడు భోజనం చేసి సిద్ధంగా వుంచాడు. ఇద్దరి భోజనాలూ పూర్తయేసరికి _ ఎవరో జగన్నాథం గారి కోసం వచ్చినట్లు పని కుర్రవాడు చెప్పాడు.

వచ్చిన మనిషి సన్యాసిలా వున్నాడు. కాషాయ వస్త్రాలు ధరించాడు. మెడలో రుద్రాక్షమాల వుంది. జుట్టు జడలుకట్టి వుంది. సన్యాసిని చూస్తూనే జగన్నాథం రెండు చేతులూ జోడించి "నమస్కారంస్వామీ! చాలా కాలానికి దర్శనమిచ్చారు" అన్నాడు.

"అంతా కుశలమా?" అంటూ అడిగి రాజువంక ప్రశ్నార్థకంగా చూశాడు సన్యాసి.

జగన్నాథం సన్యాసికి రాజును పరిచయం చేశాడు. సన్యాసి రాజును దీవించి ప్రసన్నవదనంతో చూశాడు.

"వీరు చాలా గొప్పవారు. పేరు లేదు. చాలా చిన్నతనంలోనే సన్యసించేరు. స్వామీ అంటే పలుకుతారు. అప్పుడప్పుడీ గ్రామంవచ్చి మనల్ని పునీతుల్ని చేసి వెడు

తూంటారు'' అన్నాడు జగన్నాథం.

సన్యాసి సుఖాసీనుడయ్యాడు. జగన్నాథం ఆయన పాదాల చెంత కూర్చున్నాడు. ఇద్దరూ భక్తి వేదాంతాల గురించి సంభాషణ జరిపారు. రాజుకు వాళ్ళ సంభాషణ చాలా విసుగ్గా వుంది. అయినా అది చాలాసేపు కొనసాగింది. సన్యాసి వెళ్ళిపోయాక "ఎవరీ సన్యాసి - సింహం వస్తానన్న రోజునే వచ్చాడు'' అన్నాడు రాజా.

"ఆయన ననుమానదృక్కులతో వీక్షించకు. కళ్ళు పోతాయి. ఈ ఊళ్ళో ఆయనకు చాలా గౌరవముంది. మన అదృష్టంకొద్దీ ఈ ఊరు అప్పుడప్పుడు వేంచేస్తున్న మహానుభావుడాయన. ఎవరివద్దా భిక్ష స్వీకరించడు. కేవలం దర్శనమిచ్చి ఆశీర్వాదాలొసగి వేదాంత చర్చచేసి వెళ్ళిపోతాడు. సింహం రాకతో ఈయనరాక కలవడం కాకతాళీయం. సింహం రానప్పుడుకూడా ఈయన చాలా పర్యాయాలు వచ్చాడు'' అన్నాడు జగన్నాథం.

జగన్నాథం సమాధానం రాజుకు అంతగా రుచించ లేదు. అతనదోరకంగా ఆయనవంక చూసి "నేనొక పర్యాయం ఊరంతా చుట్టి రావాలనుకుంటున్నాను. ఎక్కడెక్కడ ఏయే రకాల కొత్తవ్యక్తులు వచ్చారో తెలుసుకుంటాను. ఊరంటే పెద్దదికాదు కదా'' అని సమాధానంకోసం ఎదురు మాడకుండా ఇంట్లోంచి బయట పడ్డాడు.

బయట ఎండ అట్టే ఎక్కువగాలేదు. రాజు ఊళ్ళో నడక మొదలుపెట్టి కనపడిన బిచ్చగాడినీ, ప్రతివాడినీ - ఏదో ప్రశ్న వేస్తూ వచ్చాడు. అలా తిరుగుతూ అతనొక ఇంటిముందు ఆగిపోయాడు. ఆ ఇంటి అరుగులమీద ఒక

ముసలి బిచ్చగాడు పడుకుని ఉన్నాడు.

రాజు వాడిని లేపాడు. కళ్ళునులుముకుంటూ లేచాడు వాడు.

"ఈ ఊరేనా నీది?" అనడిగాడు రాజు.

"కాదు బాబూ" అన్నాడు వాడు.

"ఎప్పుడొచ్చావ్ - ఎందుకొచ్చావ్?" మళ్ళీ అడిగాడు రాజు.

బిచ్చగాడికి ఉన్న ఊళ్ళో అట్టే దొరకడం లేదుట. అందుకని ఊరు మార్చిచూద్దామని ఈ రోజే ఇక్కడికి వచ్చేడట. వాడు పడుకున్న ఇంటగలవాళ్ళు వాడికి భోజనం పెట్టారుట. అరుగుమీద పడుకోమన్నారుట. మర్నాటికి పోదామనుకుంటున్నాడుట.

సింహం దగ్గర్నుంచి ఉత్తరం వచ్చి వుండకపోతే రాజుకాట్టే అనుమానం కలిగివుండేది కాదుగానీ ఈ బిచ్చగాడి విషయంలో అతనికిప్పుడు కాస్తసందేహం కలిగింది. వాడే సింహమంటే నమ్మేలా లేదు. వాడు చాలా అసహ్యంగా బలహీనంగా వున్నాడు. ఎన్నో ఘోరాలు చేస్తున్న సింహం తప్పక బలంగా వుండి వుంటాడు.

ఏదేమైనా వాడిన్నో కంట కనిపెట్టాలని రాజు నిశ్చయించుకున్నాడు. అతనా ఇంటిని గుర్తుపెట్టుకున్నాడు. ఆ తర్వాత మరి కాసేపు ఊళ్ళో తిరిగి ఇల్లుచేరాడు.

"ఏమైనా ఆచూకీ దొరికిందా" అనడిగాడు జగన్నాథం.

"దొరికినట్లే ఉంది." అన్నాడు రాజు. అంతకుమించి అతను జగన్నాథానికి వేరే వివరాలేమీ చెప్పలేదు.

జగన్నాథం రాజువంక ఆశ్చర్యంగా చూశాడు. కానీ ఇంకేమీ ప్రశ్నలు వేయలేదు.

రాత్రి భోజనాలయేక జగన్నాథం చెప్పాడు. "నీకు కుతూహలముంటే రావచ్చు. నేనూ మరి నలుగురూ ఈ రాత్రి ఊరిమధ్య మర్రిచెట్టుకద్ద కాపలా వుంటాము. సింహం అక్కడికి తప్పకుండా వస్తాడు. కానీ ఇంత వరకూ మేమతన్ని ఒక్కసారికూడా చూడలేక పోయాం."

"నేను రాను. ఊళ్ళో తిరుగుతాను" అన్నాడు రాజు.

# 9

రాజు దృష్టి అంతా ఆ ఇంటిమీదా అక్కడ పడు కున్న బిచ్చగాడిమీదా వుంది. ఆ ఇంటికెదురుగా ఒక దిబ్బ వుంది. ఆ దిబ్బమీద ఒక చింతచెట్టుంది. ఆ చింతచెట్టు వెనకాల కూర్చున్నాడు రాజు.

రాత్రి ఒంటిగంట దాటినా రాజుకు నిద్ర రావడం లేదు. భయం వేయడంలేదు. అతను ధైర్యంగా అక్కడే కూర్చుని సింహం గురించి ఆలోచిస్తున్నాడు. తన అంచనా తప్పవుతుందా? ఆ బిచ్చగాడికీ సింహానికీ ఏ సంబంధమూ లేదా? లేని పక్షంలో అతడీ రోజునే ఈ ఊరెందుకొచ్చాడు?

రాజు విన్నదాన్నిబట్టి అప్పుడప్పుడూ ఊరికి బిచ్చ గాళ్ళు ఇతర గ్రామాలనించి వచ్చి వెడుతుంటారు. వాళ్ళవల్ల ఊళ్ళో చెప్పుకోదగ్గ విశేషాలేమీ జరుగ లేదు. ఒకటి రెండ్రోజులు ఆడుక్కుని వాళ్ళు వెళ్ళిపో తూంటారు. ఈ బిచ్చగాడు కూడా అలాంటివాడే

అయుంటాడని రాజు అనుకోవడంలేదు. ఎందుకంటే ఎంత జిత్తులమారి కాకపోతే సింహం ఇరవయ్యేళ్ళపాటు పోలీసుల్ని ఆట ఆడించగలడు.

రాత్రి రెండున్నర గంటలైనప్పుడు ఎక్కణ్ణించో ఈలలాంటి శబ్దం వినబడింది. రాజు ఆశ్చర్యంగా ఆ శబ్దం విన్నాడు. అది కావాలని ఎవరో మనిషి వేసినదేనని రాజుకు తోచింది. అతను చుట్టూ పరికించాడు. ఎక్కడా అలికిడి లేదు కానీ అరుగుమీది బిచ్చగాడు లేచి కూర్చున్నాడు. జోలి చంకకు తగిలించుకుని కర్ర చేత్తో అందుకుని వాడు నడవడం ప్రారంభించాడు.

రాజుకూడా చెట్టు వెనకనుంచి కదిలాడు. బిచ్చగాడి కళ్ళపడకుండా వాడికి అనుమానం కలగని విధంగా అలికిడి కాకుండా రాజు వాడిననుసరించసాగాడు.

సుమారు అయిదు నిమిషాల్లో బిచ్చగాడు ఊరిమధ్య మర్రిచెట్టుదగ్గరకు వచ్చాడు. అక్కడ ఒక్కక్షణం ఆగి చుట్టూ పరికించాడు. తర్వాత మళ్ళీ కదిలాడు.

రాజు వేగం హెచ్చించాడు, అతను బిచ్చగాడాగిన స్థలాన్ని పరిశీలించాడు. అక్కడ ఒక తోలుముక్క కనబడింది. అతను దాన్ని పైకి తీసి చూశాడు. చీకట్లో కూడా దానిమీదున్న సింహం బొమ్మ మెరుస్తోంది.

రాజు మర్రిచెట్టువంక పరిశీలనగా చూశాడు. ఎవరూ కనబడలేదు. నాలుగడుగులు చెట్టువైపు వేసి చుట్టూ పరిశీలించాడు. అప్పుడు కనిపించారతనికి — చెట్టుమీద నిద్రపోతున్న నలుగురు మనుషులు.

రాజు వెళ్ళి వాళ్ళను తట్టి లేపాడు. కళ్ళు నులుముకుంటూ లేచారందరూ. వాళ్ళలో జగన్నాథంకూడా వున్నాడు.

"ఇలా నిద్రపోవడంవల్లనే ఇరవై ఏళ్ళుగా సింహం మిమ్మల్ని ఆటపట్టించగలుగుతున్నాడు. సింహం ఆచూకీ తెలుసుకునేందుకు నాకాధారం దొరికింది. అదుగో ఆ ముందు వెడుతున్న బిక్షగాణ్ణి పట్టుకుంటే అన్నీ తెలుస్తాయి" అన్నాడు రాజు.

వాళ్ళకు మత్తువదిలింది. జరిగినదేమిటో రాజు వివరించేక ఆ బిచ్చగాడినేమి చేయడ్డమా అని క్షణంపాటు ఆలోచించారు.

"ఆలోచించి ప్రయోజనంలేదు. ధైర్యంచేయాలి. వాడి దగ్గర ఏ ఆయుధాలూ లేవనే నమ్ముతున్నాను. ఒకవేళ వున్నా చేయగలిగినదేమీ లేదు. ఇలాంటి బంగారు అవకాశాన్ని చూస్తూ చూస్తూ జారవిడుచుకోలేను" అంటూ రాజు ఒక్క పరుగు తీశాడు.

జగన్నాథం కంగారుగా ఏదో చెప్పబోయాడు కాని అప్పటికే రాజు వెళ్ళిపోయాడు.

అలికిడికి బిచ్చగాడు వెనక్కి తిరిగాడు. వాడికి పరుగెత్తుకుంటూ వస్తున్న రాజు ఆ వెనకాల ఇంకో నలుగురు మనుషులు కనిపించారు. బిచ్చగాడు భయపడలేదు. కంగారుపడలేదు. "నాకోసమా?" అన్నాడు తాపీగా.

"అవును. నీకోసమే" అన్నాడు అప్పుడే వాడిని సమీపించిన రాజు.

"ఎందుకు? నేను మా ఊరు పోతున్నాను" అన్నాడు బిచ్చగాడు.

"పోయేముందు - ఈ ఊరెందుకొచ్చావో చెప్పాలి" అన్నాడు రాజు ఆయాసపడుతూ.

"అడుక్కుందు కొచ్చాను బాబూ..." అన్నాడు.

"అబద్ధాలు చెప్పకు..." అన్నాడు రాజు. అప్పటికి జగన్నాథంతో సహా నలుగురు మనుష్యులు ఆ బిచ్చగాణ్ణి చుట్టుముట్టారు.

"మాకు దయా దాక్షిణ్యాలులేవు. బిచ్చగాడివనీ, ముసలివాడివనీ కనికరించం. నిజం చెప్పకపోతే తాటవలి చేస్తాం..." అన్నాడు రాజు.

జగన్నాథం బిచ్చగాణ్ణి సమీపించి - వాడి ముఖాన్ని తడిమిచూశాడు. "ఇది మారువేషం కాదు. వీడు నిజంగా బిచ్చగాడేననుకుంటాను" అన్నాడు.

"నిజంచెప్పారు బాబయ్యా" అన్నాడు బిచ్చగాడు.

"మరి ఇదేమిటి?" అన్నాడు రాజు సింహం బొమ్మ ఉన్న తోలుముక్కను చూపించి.

దాన్ని చూస్తూనే బిచ్చగాడు తడబడ్డాడు..."నాకు తెలియదు..."

"నీకు తెలుసు. నీ చేతితో స్వయంగా దీన్ని మర్రిచెట్టు కెదురుగా నేలమీదకు జారవిడిచావు. నేనది కళ్ళారా చూశాను. బుకాయించకు..." అన్నాడు రాజు.

బుకాయించడంవల్ల ప్రమాదముందని బిచ్చగాడు గ్రహించడానికింకో అయిదునిముషాలు పట్టింది "నన్నేం చేయకండి బాబయ్యా - నిజం చెప్పేస్తాను" అన్నాడు వాడు.

అంతక్రితంరోజు ఒక పెద్దమనిషి ఆ బిచ్చగాడికీ తోలుముక్క ఇచ్చి ఫలానా టైములో ఫలానా గ్రామంలో ఫలానాచోట దాన్ని జారవిడవాలని చెప్పాడట. పది రూపాయలు అడ్వాన్సుగా ఇచ్చాడట. పని పూర్తయ్యేక ఇంకో పాతిక ఇస్తానన్నాడుట.

"పని పూర్తయ్యేక ఎంత సేపట్లో ఇస్తానన్నాడు?" అడిగాడు జగన్నాథం.

"అయిదారు గంటల్లో" అన్నాడు బిచ్చగాడు.

"సరే అయిదారు గంటలసేపు వీడికి కాపలాకాద్దాం. అన్నమాట నిలబెట్టుకోవడంలో సింహానికి ఎవరూ సాటి రారంటారు. ఎలా ఇస్తాడో చూద్దాం" అన్నాడు జగన్నాథం.

బిచ్చగాడిని జగన్నాథం ఇంటికి నడిపించారు. తెల్లవారడానికింకా చాలా వ్యవధి వున్న కారణంగా వంతుల వారీగా మెలకువ వుండి వాడికి కాపలాకాశారు.

తెల్లవారింది. ఎక్కడా సింహం జాడలు లేవు. జగన్నాథం కాసేపు యోచించి "సింహం అంత సులువుగా మనమధ్యకు వస్తాడనుకోను. వీడిని వదిలిపెట్టేయడం మంచిది" అని "ఒరేయ్ - నీ దగ్గరకు ఆ తోలు ముక్క ఇచ్చిన మనిషి మళ్ళీ వస్తే వాడి ఆచూకీ మాకు తెలియజెప్పాలి. అందుకు నీకు యాభై రూపాయలు బహుమతిగా అడ్వాన్సుగా ఇస్తున్నాను. ఆ తర్వాత నీకు ఇంకా వేరే బహుమతి ఉంటుంది" అంటూ వాడికి పాతిక రూపాయలిచ్చాడు.

బిచ్చగాడక్కణ్ణించి కదిలేక-అక్కడున్న మనుషుల్లో ఒకతన్ని పలకరించి "నర్సన్నా - జాడ తెలియకుండా ఆ ముష్టాణ్ణనుసరించు. ఒకటి రెండు గంటల్లో సింహం వాణ్ణి కలవ్వచ్చని నా అంచనా" అన్నాడు జగన్నాథం.

నర్సన్న అక్కణ్ణించి కదిలి వెళ్ళేక "రాజా! నువ్వు చాకులాంటి కుర్రాడివి. ఇంతకాలం ఏమాత్రమూ జాడ దొరకని సింహం గురించి కొంత ఆధారం సంపాదించ

గలిగావు. ఇలాగే మనం ముందడుగు వేయగలుగుతామను కుంటాను...'' అన్నాడు జగన్నాథం, రాజువంక అభి నందన పూర్వకంగా చూస్తూ.

రాజు నవ్వాడు.

ఆ మధ్యాహ్నానికి నర్సన్న తిరిగివచ్చాడు. బిచ్చగాడి నింకెవ్వరూ కలుసుకోలేదుట. వాడింక మళ్ళీ తమ చేయి దాటిపోకుండా వుండేలా వాడి పూర్తి ఆచూకీ తెలుసుకు వచ్చాడతను. వాడు నిజంగానే బిచ్చగాడట. అక్కడికి అయిదారుమైళ్ళ దూరంలో వున్న గ్రామంలో వాడి నివాసమట. కనీసం పదేళ్ళనుంచైన ఆ గ్రామస్థులు వాడి నెరుగుదురట. అనుమానించదగ్గ విశేషాలేమీ వాడికి సంబంధించి లేవని నర్సన్న చెప్పాడు.

# 10

''నీ పేరు?''

''సీత—''

''ఈ ఫొటోలో మనిషెవరో నీకు తెలుసా''

''తెలియకేం — రాజు! నాక్కూడా రాజే!''

అతను జేబులోంచి వందరూపాయలనోటు తీసి ''సీతా ఇది నీకు'' అన్నాడు.

సీత అతనివంక కోపంగా చూసి - ''నాకు వద్దు...'' అంది.

''తప్పుగా అర్థంచేసుకోకమ్మా - ఈ డబ్బు నీకిస్తున్నది నీనుంచి ఒక ముఖ్యవిశేషం తెలుసుకునేటందుకు. రాజు గురించిన వివరాలుకొన్ని కావాలి...''

''ఏమిటవి?''

అతను అడిగాడు, సీత చెప్పింది. కానీ ఆ వివరాలేవీ

అతనికి పనికివచ్చేవి కాదు.

"సత్తెమ్మ చచ్చిపోయిందంటున్నావ్ - రాజు పుట్టుక గురించి ఇంకేమి తెలుసుకునే ఉపాయం లేదా" అన్నాడు అతను నిస్పృహగా.

"అన్నట్లు - రెండ్రోజుల క్రితం ఓ ముసలావిడ ఇక్కడికి సత్తెమ్మకోసం వచ్చింది. ఆవిడ పేరు వెంకాయమ్మ. సత్తెమ్మనావిడ బాగా ఎరిగున్నదానిలా కనిపించింది. ఒకసారి రాజును చూడాలని వచ్చిందిట. సత్తెమ్మ పోయిన విషయం ఆవిడకు తెలియదు. కావాలంటే ఆవిణ్ణి కలుసుకో. అడ్రసిస్తాను. ఈ ఊళ్ళోనే వుంటోంది" అంది సీత.

అతను ఆ వివరాలడిగి తెలుసుకుని వెంకాయమ్మను కలుసుకున్నాడు. ఆవిడను మంచిమాటలాడి రకరకాల ఆశలతో మభ్యపెట్టి చాలా వివరాలు లాగేడు.

వాటి ఫలితంగా ఆవిడే సత్తెమ్మకు చిన్నతనంలో రాజు నిచ్చిందని తెలిసింది. రాజు ఆమెకూ బిడ్డకాదట. ఒక లక్షాధికారికి మనుమడట. ఆయన కూతురు ఎవడో అనామకుడితో అక్రమసంబంధం పెట్టుకుంటే ఫలితంగా రాజు పుట్టేడట. కుర్రాడిని చంపడం ఇష్టంలేక - ఆ లక్షాధికారి వెంకాయమ్మ కుర్రాడినిచ్చి పట్నం పంపేశాడట.

అప్పట్లో వెంకయమ్మ ఆయనింట్లో వంటమనిషిగా వుండేదట. వయసులోవున్న విధవరాలు వెంకాయమ్మకా కుర్రాడు ఇబ్బందికాగా అనుకోకుండా కలసిన సత్తెమ్మకిచ్చేసిందిట. ఇదీ రాజుకథ. అతను అడిగి ఆ లక్షాధికారి పేరు, వివరాలు తెలుసుకున్నాడు.

"ఆయనెంతోకాలం బ్రతకలేదు బాబూ - ఆతర్వాత

కొద్ది కాలానికే ఆ పిల్లాడి తల్లి ఆత్మహత్య చేసుకుంది. ఆయన్నెవరో చంపేశారు. సత్తెమ్మను నేనప్పుడప్పుడు కలుసుకుంటూనే వున్నా తన జన్మరహస్యం తెలిసిన మనిషిని నేనేనని రాజుకు తెలియదు'' అంది వెంకాయమ్మ.

అతనావిడకు రెండువందలిచ్చాడు. అక్కణ్ణించి త్వరత్వరగా బయల్దేరి కళ్యాణపురం చేరుకున్నాడు. జగన్నాథంగారిని కలుసుకుని తనకు తెలిసిన వివరాలను చెప్పాడు. జగన్నాథంగారి ముఖం అదోలాగైపోయింది. ఆయన పళ్ళు బిగిశాయి.

''శభాష్ తిమ్మన్నా! చాలా గొప్పసహాయం చేశావు నాకు...'' అన్నాడాయన.

# 11

''రాజూ—ఎలాంటి జీవితం గడపాలనుంది నీకు?''— అన్నాడు జగన్నాథం.

''పదిమందికీ నా పేరు తెలియాలి. సంపదలతో నేను తులతూగాలి. స్వర్గంలో వున్న నా తండ్రి నన్ను కన్నందుకు గర్వంతో పులకరించిపోవాలి'' అన్నాడు రాజు.

''అవి గొంతెమ్మ కోరికలు. అనవసరంగా చస్తావ్ నువ్వు. ఎందుకంటే నువ్వు సింహాన్నెదిరించి నిలబడాలనుకుంటున్నావ్. నీలాంటివాళ్ళను సింహం కరకరా నమిలేస్తాడు'' అన్నాడు జగన్నాథం.

రాజు నిర్లక్ష్యంగా నవ్వి ''చూద్దాం'' అన్నాడు.

''అలా నిర్లక్ష్యం చేయకు. సింహాన్ని లొంగదీయడానికి నాకు నచ్చనిపద్ధతి ఒకటుంది. నువ్వు గడపాలనుకుంటున్న జీవితానికి వ్యతిరేకమది. నీకు నిజంగా సింహం మీద పగ ఉంటే ఆ పని చేయవచ్చు'' అన్నాడు జగన్నాథం.

"ఏమిటది?"

"నువ్వా అజ్ఞాతవాసంలోకి వెళ్ళిపోవాలి. సింహం చేసేలాంటి పనులే చేయాలి. అప్పుడు సింహం నీదగ్గరకు రావడానికి ప్రయత్నిస్తాడు..."

రాజు నవ్వి - "ఇలాంటి ట్రిక్స్ పోలీసులీపాటికి చాలా వేసి వుంటారు" అన్నాడు.

"ట్రిక్కు కాదు. నిజంగా చేయాలి. అందుకోసం ఒకటి రెండు హత్యలు నిజంగా నువ్వు చేయాలి. ట్రిక్కుకూ, నిజానికీ తేడా సింహం తెలుసుకోగలడు" అన్నాడు జగన్నాథం.

"హత్యలా - జన్మలో చేయను నేను. ఏ కారణంతో నైనా సాటి మానవుణ్ణి చంపడం దారుణం..."

"ఒకవేళ సింహం దొరికితే ఏం చేస్తావ్?"

"సాధ్యమైనంత వరకూ ప్రాణాలతో పోలీసులకు పట్టివ్వడానికి ప్రయత్నిస్తాను."

"వీలుపడకపోతే!"

"చంపేస్తాను."

"ఏ కారణంతోనైనా సాటి మానవుణ్ణి చంపడం దారుణమేమో?"

"దారుణమే కానీ, సింహం మనిషి గాదు" అన్నాడు రాజు.

"రాజా సింహం మీద నీకు పగ వుంది కాబట్టి అతన్ని మనిషి కాదంటున్నావ్. మనుషుల్ని చంపడం తప్పనే నువ్వతన్ని హత్య చేస్తానంటున్నావ్! ఈ లోకంలో ఏ మనిషికీ ప్రిన్సిపుల్స్ లేవు. కుతర్కంలో తను చేసే ప్రతి పనికీ ప్రిన్సిపుల్స్ అంటగడతాడు.

నువ్వు అలాంటి వాడివే...ఎందుకంటే సింహం సంగతి తీసుకో. అతను ప్రజాకంటకుడే కావచ్చు. కానీ ఇరవై సంవత్సరాలుగా అతను పోలీసుల్ని ఆట ఆడిస్తున్నాడు. అతనే పనీ కేవలం ఒక్కడే చేయడంలేదు. ఇతరుల సహాయం తీసుకుంటున్నాడు. అయితే ఆ ఇతరులతన్ని పట్టివ్వడానికి ప్రయత్నించలేదు. ఎంచేత? వాళ్ళకతను మానవాతీతుడు. దేవత. అందుకే అతను పట్టుపడడంలేదు, నా పగ చల్లారడం లేదు'' అన్నాడు జగన్నాథం.

''ఇదంతా ఎందుకు చెబుతున్నారు?''—అన్నాడు రాజు.

''సింహం సంగతి మరచిపో. నన్ను తండ్రిగా భావించు. నేను నిన్ను దత్తు చేసుకుంటాను. సమాజంలో నువ్వు కోరిన గౌరవం లభించేలా చేస్తాను'' అన్నాడు జగన్నాథం.

''సింహాన్ని పట్టుకుంటే లక్షరూపాయలు బహుమతి వుంది. ఆలక్షరూపాలకూ, ప్రభుత్వం ప్రసంసలు తోడైతే ఈ తోడుకు నాపగ చల్లారడం తోడైతే_అంతకుమించిన ఆనందం వేరే ఏముంది. ఇంతవరకూ నేను అనామకుడిని. మిమ్మల్ని తండ్రిగా భావించి మీతో జీవితం గడిపినా జీవితం మరి కాస్త సుఖప్రదం కావచ్చునేమో కానీ నేను అనామకుడిగానే మిగిలిపోతాను'' అన్నాడు రాజు.

జగన్నాథం విసుగ్గా రాజువంక చూసి ''సింహాన్ని పట్టుకోవాలన్న తహతహ బాగా కనబడుతోంది నీలో. ఒకవేళ సింహం నీ తండ్రి అయితే ఏం చేస్తావ్?''—అన్నాడు.

రాజు క్షణంపాటు మాట్లాడలేకపోయాడు. తర్వాత ఆవేశంగా "అసాధ్యం" అన్నాడు.

"ఈ సృష్టిలో అసాధ్యమైనదంటూ ఏమీ లేదు. ఒక వేళ నువ్వు సింహం కొడుకువని తెలిసిందనుకో అప్పుడేం చేస్తావ్?" అన్నాడు జగన్నాథం.

"ఆ దుర్మార్గుడి కొడుకునై పుట్టినందుకు నేను చేయ గలిగినదేముంది? ప్రాణాలు తీసుకుంటాను. ఆ అవమానం నేను భరించలేను. ఏ తండ్రీ ఏ కొడుక్కీ అప్పగించ లేనంత అపకీర్తి సింహం తన కొడుక్కి అప్పగించాడు" అన్నాడు రాజు.

"నీ సంగతి నాకు తెలియదు కానీ నువ్వు సింహం కొడుకువని తేలిన మరుక్షణం నీకీ భూమ్మీద నూకలు చెల్లిపోయేలా చేస్తాను. నిన్ను బ్రతకనివ్వను" జగ న్నాథం కళ్ళు ఎర్రబడ్డాయి. ఆవేశంతో వణుకుతున్నా డాయన.

రాజు కంగారుగా ఆయన వంక చూసి "నేను నిజంగా సింహం కొడుకు నన్నంత ఆవేశం మీలో కనబడుతోంది కాస్త శాంతించండి" అన్నాడు.

జగన్నాథం తమాయించుకున్నాడు "రాజూ నువ్వు అమాయకుడివని నాకు తెలుసు. నీ హృదయం మంచిదని నాకు తెలుసు. అయినా క్షణం కాలంపాటు నిన్ను సింహం కొడుకుగా నాకు జరిగిన అన్యాయం తల్చుకో గానే నాలో ఆవేశం పొంగుకొచ్చింది. అది మానవ బల హీనత అనుకుంటాను.

ఇప్పుడు నాకు సింహం మీదకూడా జాలి వేస్తోంది. ఎంత ఆవేశానికి గురి కాకపోతే అతడంత రాక్షసు

డొతాడు. తన భార్యా బిడ్డలు తనకు దక్కివుంటే అతనూ నలుగురికీ లాగానే వుండేవాడేమో" అన్నాడు జగన్నాథం.

"అవన్నీ మనకనవసరం. ఎలాగో అలా వాడినంతం చేయడమే నా ఉద్దేశ్యం" అన్నాడు రాజు దృఢంగా.

## 12

"తిమ్మన్నా సింహం పేరులోనే ఈ రాజు నంతం చేయాలి. ఆ విధంగా నా పగ సగం చల్లారుతుంది. నేరం సింహం మీదకు పోతుంది" అన్నాడు జగన్నాథం.

"సింహానికి తెలియదంటారా బాబూ—రాజు తన కొడుకని..."

"అవకాశం లేదు...ముందు నువ్వు నేను చెప్పినట్లు చెయ్యి."

తిమ్మన్న తల ఊపి వెళ్ళిపోయాడు.

తర్వాత అర్ధగంటకు రాజు, జగన్నాథం కబుర్లు చెప్పుకుంటూండగా చేత్తో ఓ కవరుతో తిమ్మన్న ప్రవేశించాడు "తోటలో పిట్టగోడ దగ్గర నేనున్నానండి. హఠాత్తుగా ఈ కవరు నా ముందు పడిందండి. చుట్టూ ఎక్కడ చూసినా మనిషి కనబడలేదు. మీకు చూపిద్దామని తెచ్చాను."

జగన్నాథం కవరు అందుకుని చింపి అందులోంచి ఉత్తరం బయటకు తీశాడు. అది సింహం రాశాడు.

ఎల్లుండిరాత్రి జనార్దనరావుగారిల్లు దోచుకోబోతున్నాడట సింహం. ఇంట్లో పూచిక పుల్ల మిగలనివ్వడట. ఒక్క మనిషినీ బ్రతకనివ్వడట. జగన్నాథానికి సింహం మీద వ్యక్తిగతమైన పగ వుంది కాబట్టి అది ఆఖర్ సవా

లుగా యిస్తున్నాడట. పోలీసులకీ సమాచారం అందించే పక్షంలో సింహం తనకు చిక్కదట. ఆ రోజుతో జగన్నాథాన్ని కూడా అంతం చేసేస్తాడట సింహం.

ఉత్తరం రాజు కూడా చదివాడు—"ఏం చేద్దాం?" అన్నాడు.

"వెడదాం" అన్నాడు జగన్నాథం.

"బాగానే వుంది కానీ పోలీసులకు చెప్పకపోవడం వల్ల ప్రమాదమున్నదేమో! మనం ఏమీ చేయలేకపోతే అనవసరంగా ఆ జనార్దనంగారి కుటుంబం హతమైపోతుందేమో" అన్నాడు రాజు బెంగగా.

"రాజూ వయసు పొంగులో వున్నవాడివి. ప్రాణాల గురించి భయపడుతున్నావా?" అన్నాడు జగన్నాథం.

"నా ప్రాణాలకు సంబంధించినంత వరకూ నాకు భయంలేదు. కానీ ఇతరుల ప్రాణాలు కూడా నా ప్రాణాలతో ముడివడి వున్నప్పుడు కాస్త ఆలోచించడం న్యాయం" అన్నాడు రాజు.

"ఇంక ఆలోచనలతో పని లేదు, సింహం పట్టుబడతాడని నాకు నమ్మకముంది. అంతగా ఏదైనా ప్రమాదం వచ్చినా జనార్దనరావుగారి కుటుంబాన్ని రక్షించే భారం నాది. నీ ప్రాణాల సంగతి మాత్రం పూచీ ఇవ్వలేను" అన్నాడు జగన్నాథం.

"నా ప్రాణాలకు నేనే పూచీ. నేను రెడీ. మీకు ఆఖరు సవాలిచ్చిన ఆ సింహం యిక సవాలివ్వడానికి ఉండడు" అన్నాడు రాజు.

# 13

"రండి రండి జగన్నాథంగారూ..." అన్నాడు జనార్దనరావు. ఆయన కాస్త వణుకుతున్నాడు.

"పోలీసులకు చెప్పారా?"

"చెబితే ఏదో ఒక రోజున చిత్రహింసలు పెట్టి మరీ చంపుతానని చెప్పకపోతే కనీసం ప్రాణాలైనా దక్కించుకో వచ్చునని రాశాడు. నన్ను రక్షించడానికి మీరూ ఒక కుర్రాడూ వస్తారనీ తనూ వాళ్ళూ బలాబలాలు చూసుకుంటామనీ ఆ తర్వాత నే నా జోలికి వస్తానని రాశాడు. అందుకని పోలీసులకు ఫిర్యాదు చేయలేదు. సింహం విషయంలో పోలీసులేమీ చేయలేరన్నది ఇరవై ఏళ్ళ నుంచి బుజువౌతూనే వుంది కదా" అన్నాడు జనార్దనరావు.

జనార్దనరావు వయసు యాభై సంవత్సరాలకు పైగా వుంటుంది. ఆయన భార్య వయసు సుమారు నలభైఅయిదు సంవత్సరాలు. ఆయన యింట్లో ముగ్గురు పిల్లలున్నారు. ఇద్దరు మగపిల్లలు. ఒకడికి పధ్నాలుగు, ఇంకొకడికి పది హేడేళ్ళు వుంటాయి. అమ్మాయి వయసు ఇరవై ఏళ్ళుంటుంది. ఆయన ఊళ్ళో వ్యాపారస్తుడు. నగర ప్రముఖుడనే చెప్పవచ్చు.

"మీరేమీ భయపడకండి. ఇతని పేరు రాజు. నాకు కొడుకులాంటి వాడు. ఇతని సంగతి ఇదివరలో చెప్పి వున్నాను. ఈ వేళ గొడవలోంచి బ్రతికి బయటపడితే ఇతన్ని మీరు..." అని వాక్యాన్ని పూర్తి చేయకుండా ఆపి "అన్నీ మీకు తెలుసుగా..." అన్నాడు జగన్నాథం.

"తెలుసు" అన్నాడు జనార్దనరావు. ఆయన ముఖంలో కలవరం కనబడుతోంది. ఇంట్లో అందర్నీ వీళ్ళిద్దరికీ పరిచయం చేశాడు. అందరూ భయం భయంగా వున్నట్లు

రాజా గమనించాడు. బెదురు కళ్ళతో అందంగా వున్న జనార్ధనరావు కూతుర్ని రాజు ఒక్క క్షణం ఎక్కువసేపు చూశాడు.

ఆ కుటుంబమంతా ఒక గదిలో పడుకునే ఏర్పాటు జరిగింది. ఆ గది బయట రాజూ, జగన్నాథం—మడత మంచాలు వేసుకుని పడుకున్నారు. ముఖ్యంగా రాజా మంచం తలుపులకు అడ్డంగా వుంది. అతన్ని డిస్టర్బ్ జేయకుండా ఆ గదిలోకి అడుగు పెట్టడం కష్టం.

రాజుకు నిద్రపట్టలేదు. ఒకరకమైన ఉత్సాహమూ, ఆవేశమూ అతన్నావహించాయి.

జగన్నాథానికి త్వరగానే నిద్రపట్టినట్టుంది. అతను మంచం మీంచి కదలడం లేదు. రాత్రి పన్నెండు గంటల ప్రాంతాల రాజు పక్కమీంచి లేచాడు. తన మంచం మీద అతను తలగడాలో మనిషి పడుకున్న భ్రాంతి కలిగేలా ఏర్పాటు చేసి దుప్పటి కప్పాడు. అక్కడ పక్కగా వున్న సోఫా వెనుక నక్కాడతను.

టైము గడుస్తోంది. నిజంగా ఏదైనా జరుగుతుందా—అన్న కుతూహలంతో రాజు చాలా జాగ్రత్తగా పరిసరాలను గమనిస్తున్నాడు.

టైము ఒంటి గంటయింది. జగన్నాథం మంచం మీద నుంచి లేచాడు. తన సూట్‌కేసు మంచం క్రిందనేవుంది. అది తెరిచాడు. అందులోంచి ఏవో బట్టలు తీశాడు.

మరో అయిదు నిమిషాల్లో జగన్నాథం ఒక ముసుగు మనిషిగా మారిపోయాడు. ఆయన తిన్నగా రాజు మంచం దగ్గరకు వచ్చాడు. తల ప్రాంతంలో ఏదో పొట్లం వుంచాడు.

ఒక్క నిమిషం ఆగి మంచాన్ని జరిపాడు. ఆయన చేతిలో ఏదో ఆయుధం వుంది. దానితో నెమ్మదిగా తలుపుమీద గీశాడు. తలుపుకు అంతభాగం ముక్క ఊడివచ్చింది. అది అవతల పక్క గడియవున్న భాగం ఇప్పుడు తోయగానే తలుపులు తెరుచుకున్నాయి.

జగన్నాథం గది లోపల ప్రవేశించాడు.

"మిస్టర్ జనార్దనరావ్! నిద్రతే..." అన్నాడు. ఆయన చేతిలో రివాల్వర్ క్షణాల మీద పనిచేసింది. ".సింహం వచ్చాడు నీ ప్రాణాలు తీస్తాడు..."అన్నాడు జగన్నాథం వికటాట్టహాసం చేస్తూ.

రాజు జరుగుతున్నదంతా ఊపిరి బిగబట్టి చూస్తున్నాడు. సింహం మీద ఉరకటానికి అతనికి ధైర్యం చాలడం లేదు. జగన్నాథమే సింహం అని అతనెప్పుడూ అనుమానించని కారణంగా అతను నిశ్చేష్టుడైపోయాడు. ఇప్పటికి అతనిలో చలనం వచ్చింది.

రాజు వెనక నుంచి జగన్నాథాన్ని గట్టిగా పట్టుపట్టి "సింహం దొరికాడు. అంతా రండి..." అని కేకలు పెట్టాడు.

జకన్నాథం విడిపించుకునేందుకు ప్రయత్నిస్తున్నాడు కానీ రాజుది ఉక్కు కౌగలిలా వుంది. విడిపించుకోవడానికి వీలు పడలేదు.

# 14

"అవును. నీ తండ్రి సింహం" అన్నాడు ఇన్స్పెక్టర్ వేణు.

రాజు తల గట్టిగా పట్టుకుని "తెలిసుండీ ఈ విషయం నా కెందుకు చెప్పలేదు?" అన్నాడు.

"సింహాన్ని పట్టడానికి సింహం పిల్లే కావాలి గదా" అన్నాడు వేణు.

"బాగుంది. కానీ ఈ నిజాన్ని సింహం మీద అతని వంశం మీద పగబట్టిన జగన్నాథానికెందుకు చెప్పారు ఆయన నా ప్రాణాలు తీయడానికి సిద్ధపడ్డాడు..."

"ఆ విధంగా ఆయన నేరస్థుడిగా పోలీసుల చేతిలోకి వచ్చాడు. జగన్నాథమే సింహం అని ఋజువు చేయడం చాలా సులభమైంది."

"ఏమిటీ" అన్నాడు రాజు.

"సింహానికి జగన్నాథానికీ సంబంధముందని ఓ ఏడాది క్రితం నాకు అనుమానం కలిగింది. సింహం కొడుకు పేరుతో ఎవరైనా ఆయనింట్లో ప్రవేశపెడితే బాగుండునని అన్వేషిస్తుంటే సింహం కొడుకే మాకు దొరికాడు.

అయితే ఆయన నిన్ను తన కొడుకుగా విశ్వసించినట్లు లేదు. ఆరాలు తీశాడు. అందులో ఆయనకేం అనుమానా లొచ్చాయో ఏమో—నిన్ను హత్యచేయాలని నిర్ణయించు కున్నాడు. అక్కడకూడా చాలా తెలివిగా పథకం వేశాడు కానీ—నీ సమయస్ఫూర్తికారణంగా పట్టుబడ్డాడు.

సింహానికి సంబంధించిన చాలా గుర్తులాయన దగ్గర దొరికాయి. ఒకటిరెండు రోజుల్లో తనే సింహామని ఆయన ఒప్పుకుంటాడు. ఆయన్ను పట్టినందుకు నీకు లక్షరూపా యలు బహుమతి లభిస్తుంది" అన్నాడు వేణు.

# 15

"నాన్నా! నా జన్మరహస్యం తెలుసుకుందామనీ—తండ్రి ఎవరో తెలుసుకుందామనీ ఎన్నో ఏళ్ళుగా తపించి పోయాను. ఆఖరికి నా కన్నతండ్రిని నేనే చేజేతులా—

జైల్లో పెట్టాను. అదీ ఉరిశిక్షకు గురయ్యేలా..." అన్నాడు రాజు కళ్ళు తుడుచుకుంటూ.

"ఏడవకు బాబూ నాలాంటి పాపాత్ముడి కి శిక్ష ఎప్పటికో అప్పటికి తప్పదు. కానీ నన్ను జైలుపాలు చేసింది నువ్వుకాదు. ఈ సింహాన్ని ఎవ్వరూ పట్టలేదు.

ఎవరిని పోగొట్టుకుని జీవితంలో రాక్షసుడిగా మారి పోయానో – ఆ మనిషి దొరికినప్పుడు – కనీసం ఆ మనిషి కోరిక తీర్చడంతో నా జన్మ ధన్యమవుతుందనిపించింది.

నువ్వు నా కొడుకువని వేణు చెబితే నమ్మలేదు. అయితే తిమ్మన్న బుజువులు సంపాదించేక నాలో పితృ ప్రేమ పొంగిపొరలింది. నీకోరిక ఏమిటో అడిగి తెలుసుకున్నాను. సింహాన్ని పట్టిన ధీరుడిగా నిలబడితేకానీ – సింహం కొడుకువని నువ్వు ధైర్యంగా నలుగురిలో చెప్పుకోలేవు.

నువ్వు నా కొడుకుగా పదిమందిలోనూ కీర్తించబడాలి. నన్ను పట్టుకున్న ఖ్యాతి పూర్తిగా నీకే దక్కాలి. అందుకే నన్ను నేను పట్టించుకునేందుకు ఇలా నాటకమాడాను..." అన్నాడు సింహం, రాజును వాత్సల్యంగా చూస్తూ.

—: ఐపోయింది :—

# మహా మాంత్రికుడు!

అజీజ్

పినాక్ పాణి సిగరెట్ అంటించి ప్రారంభించేడు.

"హిందూ మహాసముద్రంలో మన దేశానికి చెందిన ఇరవైకి పైగా చిన్నా పెద్దా దీవులున్నాయి. వాటిలో గాజాదీవి ఒకటి.

మిగతా దీవులవల్ల ప్రభుత్వానికి అంతో ఇంతో రాబడి వుంటుంది. కాని, గాజా దీవిద్వారా రాబడి లుప్తం! అందుకే, ప్రభుత్వం దానిపట్ల ఎక్కువ ఆసక్తి చూపదు.

నిజానికి ఆ దీవి చుట్టుకొలత పెద్దదే. కాని, ఎటు చూసినా రాళ్లూ రప్పలూ, కొండలూ పనికిరాని అడవితో నిండివుంది. వివిధ ఆటవిక జాతి ప్రజలు అక్కడ

నివసిస్తారు. నాగరిక ప్రపంచం గురించి వారికి అట్టే తెలీదు. దీవి మొత్తం జనాభా వేయి లోపే!

అడవుల్లో దొరికే జంతువులూ, పళ్ళూ దుంపలూ సముద్ర చరాలూ అక్కడి ప్రజల జీవనోపాధులు.

రెండవ ప్రపంచ యుద్ధకాలంలో బ్రిటిష్ ప్రభుత్వం ఆ దీవిని సైనిక స్థావరంగా ఉపయోగించుకుంది. ఆ రోజుల్లో వాళ్ళక్కడ, మిలిటరీ జనరల్స్ నివసించడానికి ఓ భవనం, దానిపక్కనే చిన్న జైలుగది కట్టించారు.

ఓ ఎత్తైన కొండపై చిన్న కోటలాంటిది నిర్మించేరు. ఆ కోటలోంచి చూస్తే దీవి మొత్తం కనిపిస్తుంది. అందుకే అప్పటి సైనికులు అక్కణ్ణించి సముద్రం గుండా వచ్చేపోయే ఓడలమీద నిఘా వుంచేవారుట.

ఇక అసలు విషయానికి వస్తున్నాను. స్వాతంత్ర్యం వచ్చేక మన ప్రభుత్వం, ఆ నిరుపయోగమైన దీవిమీద అనవసరంగా ప్రభుత్వ సిబ్బందినుంచి అర్థంలేని ఖర్చు ఎందుకు భరించాలని అక్కడి ఆటవిక జాతి ప్రజల్లోనే కాస్త తెలివితేటలున్న వ్యక్తిని దీవికి అధికారిగా నియమించింది.

అతని పేరు డోంగా! అతను బ్రిటిష్‌వారు కట్టించిన భవనంలో వుండి అక్కడి ప్రజల బాగోగులు చూస్తూ, ఒక తెగవారు మరో తెగవారిని పీడించకుండా తగు జాగ్రత్తలు తీసుకుంటూ కేంద్రప్రభుత్వానికి నెలనెలా రిపోర్ట్ పంపాలి.

ఆ రిపోర్ట్ పంపే పద్ధతి ఏమిటంటే, ఆ దీవి చుట్టు పక్కలనించి మన వర్తక ఓడలు అడపాదడపా వస్తూ

పోతూ వుంటాయి. ఆ ఓడలే రిపోర్ట్స్ చేరవేస్తుంటాయి. అలాగే, ప్రభుత్వ ఆదేశాలు అందిస్తుంటాయి.

కొన్ని సంవత్సరాలు ఇలా, ఏ బాదరబందీ లేకుండా అక్కడి అడ్మినిస్ట్రేషన్ నడిచింది. తరవాత, పరిస్థితి బెడిసికొట్టింది.

డోంగా, కాలక్రమేణా తనక్కడి మకుటంలేని మహారాజు ననుకుంటూ వ్యవహరించసాగేడు. నెలనెలా ప్రభుత్వానికి పంపవలసిన మంత్లీ రిపోర్ట్ పంపడం ఆపేడు. స్థానిక ప్రజల్లోంచి దౌర్జన్య ప్రవృత్తిగల కొందర్ని చేరదీసి, వారి అండతో నియంతలా ప్రవర్తించసాగేడు.

ప్రభుత్వం ఈ విషయం గమనించి, వెంటనే ఓ ఐ. ఏ.ఎస్. ఆఫీసర్ని అక్కడికి గవర్నర్‌గా నియమిస్తూ పంపింది. ఆ గవర్నర్ తన సిబ్బందితో అక్కడికెళ్ళి, ప్రభుత్వ భవనంలో వున్న డోంగానూ, అతనిఅనుచరుల్ని బైటికి తరిమేడు.

అంతే! ఆరునెలల వ్యవధిలో అతనూ అతని సిబ్బందీ అనూహ్య పరిస్థితుల్లో ప్రాణాలు కోల్పోయేరు. మన సి. బి. ఐ. అధికార్లు దర్యాప్తుకై అక్కడికెళ్ళివచ్చి, ఎంత ప్రయత్నించినా వాళ్ళ మరణానికి కారణాలేమిటో తెలియలేదన్నారు.

ఆ గవర్నర్ వెంటనే, డోంగా మళ్ళీ ప్రభుత్వ భవనంలో ప్రవేశించి తనకుతానేపరిపాలన మొదలుపెట్టేడు. కేంద్ర ప్రభుత్వం వెంటనే ఓ రిటైర్డ్ మిలిటరీ కర్నల్‌ని గవర్నర్‌గా పంపిందక్కడికి. అతనివెంట పదిమంది సాయుధ సిబ్బంది వెళ్ళారు.

కర్నల్, అతని సిబ్బందీ కూడా నెల తిరక్కుండానే హఠాత్తుగా దీవినుంచి అదృశ్యమయ్యేరు.

ప్రభుత్వం మళ్ళీ సి. బి. ఐ. అధికార్లని పంపింది. వాళ్ళక్కడికెళ్ళి చూస్తే డోంగా, అతని అనుచరులూ ప్రభుత్వ భవనంలో తిష్టవేసి ఉన్నారు. కర్నల్ ఏమయ్యేడని అడిగితే, తనకు తెలియదన్నాడుట. నువ్విక్కడేం జేస్తున్నావని ప్రశ్నిస్తే, భవనం ఖాళీగావుంది, పరిపాలనా భారం ఎవ్వరో ఒకరు చూడాలికదా? అన్నాడుట.

స్థానిక ప్రజలకి మన భాష తెలియదు. అందుకే వాళ్ళని ప్రశ్నించి ఆరాలు తియ్యలేకపోయేరు. అదృశ్యమైన కర్నల్ కోసం, అతని సిబ్బందికోసం అధికార్లు ఎంత ప్రయత్నించినా జాడ తెలియక విసిగి వచ్చేశారు.

ఆ తరవాత, ఈమధ్య ఓ విచిత్ర సంఘటన జరిగింది. మన దేశానికి చెందిన ఓ వర్తక ఓడ సిబ్బంది సముద్ర ప్రయాణం చేస్తూ, విశ్రాంతికోసం ఆ దీవి ఒడ్డున లంగరు వేసి దీవిలో ప్రవేశించేరుట.

డోంగా, అతని అనుచరులూ వాళ్ళని చుట్టుముట్టి బంధించి, వాళ్ళదగ్గిరున్న వస్తువులూ, డబ్బూ కూడ లాక్కుని తరిమేసేరుట. ఆశ్చర్యం ఏమిటంటే డోంగా, అతని అనుచరులదగ్గిర ఇప్పుడు రైఫిళ్ళుకూడా ఉన్నాయిట!

దీన్నిబట్టి డోంగా ప్రభుత్వాని కెదురుతిరుగుతున్నాడనీ, అంతక్రితం జరిగిన సంఘటనలలో అతనికె సంబంధం వుందనీ ఎవ్వరికైనా అనుమానం వేస్తుంది. అందుకే ఈ సారి ప్రతిభావంతుడైన ఓ పోలీస్ అధికారిని గవర్నర్

అనేమిషతో అక్కడికి పంపించి క్షుణ్ణంగా దర్యాప్తు జరిపించాలని నిశ్చయించాం.
మిస్టర్ రాజారెడ్డి! ఇదివరకు మీరు అనేక స్పై కేసుల్లో పనిజేసి విజయం సాధించేరు. అందుకే నేను మీ పేరు వుదహరించేను. డిస్పేచన్ మీద మీరక్కడికెళ్ళి ఆరాతియ్యవలసి వుంది. మీ వెంట ఎవ్వర్ని తీసికెళ్ళ దలిచినా, ఏఏ వస్తువులు తీసికెళ్ళదలిచినా తక్షణం ఏర్పాట్లు చేస్తాను" అంటూ ముగించేడు స్పెషల్ బ్రాంచ్ డైరెక్టర్ పినాక్‌పాణి.
"ఆల్‌రైట్! వెళ్ళడానికి నేను సిద్ధంగా ఉన్నాను సార్! నా వెంట సార్జంట్ డేవిడ్‌నీ, మరో నలుగురు సాయుధ సిబ్బందినీ తీసికెళ్తాను" అన్నాను నేను.
"ఓ. కే! మీరంతా అక్కడ చాలా అప్రమత్తంగా వుండాలి. ఏ క్షణంలో ఎటువంటి ప్రమాదం వాటిల్లుతుందో ఊహించడం కష్టం. బీకేర్‌ఫుల్ మిస్టర్ రాజా రెడ్డీ!" అన్నాడు పినాక్‌పాణి హెచ్చరిస్తూ.

## 2

సాయంత్రం నాలుగుగంటల ప్రాంతంలో మమ్మల్ని గాజాదీవి జేర్చింది స్టీమర్.
డెక్ మీద నిల్చుని, బైనాక్యులర్స్‌తో ముందు దీవిని పరిశీలించేను. చుట్టూ ఎటుచూసినా చెట్టూ చేమలూ, దిబ్బలూ, మెట్టలూ కనిపిస్తున్నాయి. మనిషి ఐపు లేదు.
"డేవిడ్! లగేజ్ కేబిన్‌లోంచి సామాను దించండి" ఆజ్ఞాపించేను.
సార్జంట్ డేవిడ్, మరో నలుగురు సాయుధ సిబ్బందీ మేము తెచ్చుకున్న సామానంతా ఒడ్డుకు చేర్చారు. కొన్ని

నెలలవరకూ సరిపడే రేషన్, ఇతర నిత్యావసర వస్తువులూ నిండి ఉన్నాయందులో.

జేబులోంచి మ్యాప్ లాగి, మేము ఎటువెళితే ప్రభుత్వ భవనం చేరుకుంటామో దిశ చూసుకుని, స్టీమర్ కెప్టెన్‌కు వీడ్కోలు చెప్పి, సామాన్లు ఎత్తుకుని బైలుదేరాం.

గుట్టలూ మిట్టలూ దాటి కొద్దిదూరం వెళ్ళాక దూరాన గుడిసెలూ, చిన్న మైదానం, దాని పక్కనే ఎత్తైన భవనం కనిపించేయి. భవనం పైన మనదేశపు త్రివర్ణ జెండా ఎగురుతోంది.

"మనగమ్యం అదే!"అన్నాడు డేవిడ్ ఉత్సాహంగా.

పావుగంటలో అక్కడికి చేరుకున్నాం.

విశాలమైన భవన ద్వారం ముందు నలుగురైదుగురు వ్యక్తులు నిల్చుని కనిపించేరు. వారిలో ఓ వ్యక్తి పొడుగ్గా, దృఢంగా నీలిరంగు యూనిఫాంలో వున్నాడు.

చేతులు రెండూ నడుంమీద పెట్టి మావైపు తీక్షణంగా చూస్తున్నాడు. అప్పుడు గమనించేను. అతని నడుంకి వేలాడుతున్న పొడవాటి కత్తి, అతని వెనక నిల్చున్న నలుగురు వ్యక్తుల భుజాలకి రైఫిళ్ళు వేలాడుతున్నాయి.

"ఎవరు మీరు? ఇక్కడికెందుకొచ్చారు?" అడిగేడతను వచ్చీరాని ఇంగ్లీష్‌లో.

"ఆ ప్రశ్నే నేను మిమ్మల్నడుగుతున్నాను. ఇది ప్రభుత్వ భవనం. మీరక్కడెందుకున్నారు?" అడిగేను అధికారపూర్వకంగా.

"నా పేరు జనరల్ బాసో! మా దీవిలో ప్రవేశించ డానికి మీదగ్గిర అనుమతి పత్రాలున్నాయా?" అన్నాడతను మమల్ని తీక్షణంగా చూస్తూ.

"నువ్వు ఏదేశపు జనరల్ వో తెలుసుకోవచ్చా?" అడిగేను ఆశ్చర్యంగా.

"ఈ గాజాదీవి సైన్యాధ్యక్షుణ్ణి!"

ఆ జవాబుతో మా నోటమాట పెగలేదు! వాడంత నిర్లక్ష్యంగా, దురుసుగా మాట్లాడుతోంటే నాకు కళ్ళు మండిపోయింది.

"మిస్టర్ బాస్! నేనెవర్నో తెలుసా? ఈ దీవికి భారత ప్రభుత్వం పంపిన కొత్త గవర్నర్ని. ఈ క్షణం నించీ నిన్నూ, నీ సైన్యాన్నీ డిస్మిస్ చేస్తున్నాను. తక్షణం ఆ యూనిఫాంలు విడిచి, మీ ఆయుధాలు కింద పడెయ్యండి!" అన్నాను కఠినంగా.

గవర్నరనగానే బాస్ ఒక్కసారి ఉలిక్కిపడ్డట్టు గమనించేను. మరుక్షణం వాడి పెదాలమీద కృత్రిమ నవ్వు ప్రత్యక్షమైంది. నడుం మించి చేతులుతీసి మిలిటరీ పద్ధతిలో సెల్యూట్ కొట్టేడు.

"అయామ్ వెరీ సారీ సార్! మీరెవ్వరో తెలియక అలా మాట్లాడేను. నన్ను క్షమించండి" అన్నాడు నక్క వినయం ఒలకబోస్తూ.

"ఈసారి వదిలిపెడుతున్నాను. మళ్ళీ ఇటువంటి తలబిరుసు పనులు సహించేదిలేదు. ఏదిఏమైనా నువ్వీయూనిఫాంలో వుండటానికి వీల్లేదు. నువ్వూ నీ అనుచరులూ ఈ నిమిషంనించి మామూలు పౌరులు. తెలిసిందా?... డోంగా ఎక్కడ?"

నా మాటలకి వాడి మొహం అవమానంతో జేవురించింది. చేత్తో మౌనంగా లోపలి వైపు సైగ చేసేడు.

"సామాను ఇక్కడే పెట్టి మీరు నా వెంట రండి." అంటూ భవనంలో అడుగుపెట్టేను.

అదొక విశాలమైన హాలు. అక్కడి వస్తువులూ, ఫర్నీచరూ, గోడలకి వేలాడుతున్న చిత్రపటాలూ అన్నీ, అలనాటి బ్రిటిష్‌వారివేనని తెలుస్తూంది. నేలమీద బాగా మాసిన ఓ తివాచీ పరచివుంది.

మా చూపులు హాలు మధ్య సోఫాలో కూర్చుని, గండుపిల్లిలా చూస్తున్న ఓ వ్యక్తిమీద నిలిచేయి. నల్లగా గున్న ఏనుగులా వున్నాడు. గణపతి బొజ్జ. ఉంగరాలు తిరిగి బుర్రకి అతుక్కుపోయిన పొట్టి జుత్తు. దోసకాయ ల్లాటి పెదాలు.

"డోంగా నువ్వేనా?" అడిగేను.

"యస్!" అన్నాడతను ఇంగ్లీషులో.

"నేను భారత ప్రభుత్వం పంపిన కొత్త గవర్నర్‌ని. సాధ్యమైనంత త్వరగా నువ్వీ భవనం ఖాళీజేసి వెళ్ళి పోవాలి. లేకుంటే నా మనుషులచేత బలప్రయోగం చెయ్యవలసి వుంటుంది జాగ్రత్త!" అన్నాను అధికార పూర్వకంగా.

డోంగా రెండునిమిషాలు మౌనంగా మావైపు చూసి "మీ రిక్కడ వుండటానికి వచ్చారన్నమాట!" అన్నాడు.

"ఔను. ఏం, నీకిష్టంలేదా?"

"నా కిష్టమైనంతమాత్రాన సరిపోదు. గాజా తల్లి దైటివారిని ఆమోదించదు!"

"ప్రాణంలేని ఈ దీవి మమ్మల్ని ఆమోదించినా, ఆమోదించకపోయినా మాకేం? ముందు నీ ఆంబోతు శరీరాన్ని ఇక్కణ్నుంచి అవతలికి తీసికెళ్ళు!"

"మీరిక్కడ వుంటే, అనేక అరిష్టాలకి గురౌతారు! తరవాత చింతించి లాభంలేదు!" అన్నాడు డోంగా లేస్తూ.

"మమ్మల్ని బెదిరిస్తున్నావా?"

"నో సర్! వాస్తవాన్ని తెలియజేస్తున్నాను."

"ప్రస్తుతం మాకు నీ సలహాలు అవసరంలేదు. కావా లనుకున్నప్పుడు పిలిపించి అడుగుతాం. నీవు మాతో స్నేహపూర్వకంగా సహకరించేవంటే అన్నివిధాలా లాభం పొందుతావు. లేదా కఠిన శిక్షకి గురౌతావు... ఇహ నీ మనుషుల్తో చెప్పు, ఇక్కణ్నించి మా సామాను మోసుకెళ్ళమని."

డోంగా రెండు నిమిషాలు మమ్మల్ని గుర్రుగా చూసి, స్థానిక భాషలో బిగ్గరగా ఏదో అన్నాడు. మరుక్షణం బాసో, అతని అనుచరులూ పరుగెత్తుకు వచ్చేరు. డోంగా వాళ్ళతో సామాను మోసుకెళ్ళమని చెప్పేడు. వాళ్ళు మాటాడకుండా ఒక్కొక్కరూ లోనికెళ్ళి సామాను మోసుకుని బైటికి తీసికెళ్ళారు.

అంతా అయ్యేక "వెరీ గుడ్! ఇప్పుడు మీ ఆయు ధాలూ, యూనిఫాంలూ యిక్కడ వదిలివెళ్ళండి," అన్నాను వాళ్ళతో.

బాసో, అతని అనుచరులూ డోంగావైపు ప్రశ్నార్థ కంగా చూసేరు.

డోంగా వాళ్ళతో ఏదో అన్నాడు.

మరుక్షణం అంతా తమ తమ ఆయుధాలూ, యూని ఫాంలూ తీసి కింద పడేశారు.

"ఇక మీరు వెళ్ళవచ్చు!" అన్నాను.

అంతా బైటికి నడిచారు.

"ఊళ్ళో స్థానిక ప్రజలెవ్వరూ కనిపించడం లేదే" అన్నాడు డేవిడ్ బైటికి చూస్తూ.

"మనల్ని చూసి భయపడి గుడిసెల్లో దాక్కొనుంటారు. వాళ్ళ సంగతి తరువాత చూద్దాం. ముందు మన సామానంతా లోనికి తెచ్చి, పెట్టవలసిన గదుల్లో సర్దండి.

చీకటి కూడా పడుతోంది. ఈ దీవిలో ఎలక్ట్రిక్ లైట్ల ప్రసక్తి లేదు. భవనంలో లాంతర్లు వుండివుంటాయి. వాటిని భద్రం చేసి వెలిగించండి. మనం యిక్కడ చాలా అప్రమత్తంగా వుండాలి. ప్రమాదం ఏ క్షణంలో, ఏ రూపంలో వస్తుందో తెలీదు. రివాల్వర్స్ అనుక్షణం వెంట సిద్ధంగా ఉంచుకోవాలి" అన్నాను హెచ్చరిస్తూ.

రాత్రి ఎనిమిది గంటలకి అందరం డైనింగ్ హాల్లో కూర్చుని భోజనం చేస్తున్నాం. ఆ నిశ్శబ్ద నిశీధిలో హఠాత్తుగా దూరాన ఎక్కడో డప్పుల మోత వినిపించడం ప్రారంభమైంది.

కాసేపటికి రెండో వైపునించి వినిపించసాగింది. కొద్ది సేపటికే మూడో దిశ నుండి బిగ్గరగా డప్పులు మోగసాగేయి. అందరం చెవులు రిక్కించి ఆ చప్పుళ్ళు వింటున్నాం.

"ఆటవికులు ఏదో వేడుక జరుపుకుంటున్నట్టున్నారు!" అన్నాడు డేవిడ్.

"నేనలా అనుకోడం లేదు. డప్పులు మోగుతున్న తీరునుబట్టి, వాళ్ళా శబ్దాల ద్వారా తమ తెగవాళ్ళకి

ఏవో సంకేతాలు అందజేస్తున్నట్లు తోస్తోంది" అన్నాను.

"అంటే, మనం టెలిఫోన్లలో మాట్లాడుకున్నట్లు వాళ్ళు డప్పుల ద్వారా మాట్లాడుకుంటున్నారన్న మాట వీళ్ళిలా రాత్రంతా డప్పులు వాయిస్తూ కూర్చుంటే మనకి నిద్రెలా పట్టేది?"

"బహుశా, మనల్ని యిబ్బంది పెట్టడానికే వాయిస్తున్నారేమో!"

"నాగరిక ప్రపంచానికి ఎంతో దూరంలో సముద్రం మధ్య వున్న ఈ దీవిలో డోంగాకూ, అతని అనుచరులకూ రైఫిళ్ళూ, గట్రా ఎక్కణ్ణించి వచ్చివుంటాయి?"

"ఇంతక్రితం ఇద్దరు గవర్నర్లూ, సాయుధ సిబ్బందీ యిక్కడికి వచ్చి, మృత్యువాత బడ్డారు కదా, ఆ రైఫిళ్ళు వాళ్ళవే అయుంటాయి!"

"ఐతే, వారివద్ద యింకా కొన్ని ఆయుధాలుండవచ్చు మరి?"

తలూపేను.

భోజనాలయ్యాక అందరం ఒకే గదిలో పక్కలు వేసి నడుం వాల్చాం.

పడుకోబోయే ముందు జాగ్రత్తకోసం భవనం తలుపులన్నీ చెక్ చేసి గడియలు బిగించాం.

ప్రయాణంలో బాగా అలసి వుండటవల్ల వెంటనే కునుకు పట్టింది.

## 3

ఎందుకో చటుక్కున నిదర మేల్కొంది!

కాసేపు వెల్లికిలా పడుకుని, దిండుకిందినుంచి రిస్టువాచీ

తీసి మూసేను. రాత్రి ఒంటిగంట! దూరాన అడవిలోంచి లీలగా నక్కల ఊళలూ, మృగాల అరుపులూ, డప్పుల మోతలూ వినిపిస్తున్నాయి.

హఠాత్తుగా హాలు తలుపు ఎవ్వరో దబదబ బాదిన శబ్దం!

అప్పటికే మిగతావాళ్ళంతా మేల్కొన్నారు.

"గెటప్! మీమీ పిస్తోళ్ళు తీసుకుని లేవండి" అంటూ మంచం దిగేను.

అందరం హాల్లోకి నడిచాం. ఆగి ఆగి వినిపిస్తూంది తలుపుమీద శబ్దం.

చేతిలో పిస్తోలు సిద్ధంగా పట్టుకుని, మెల్లిగా గడియ తీసి తటాలున తలుపు తెరిచేను.

మసక చీకట్లో గుమ్మాని కవతల ఓ వ్యక్తి. పీచుగా పెరిగిన జుత్తు, అస్తవ్యస్తంగా పెరిగిన గెడ్డం, తిండిలేక ఎండిపోయిన దవడలు, లోతుగా పీక్కుపోయిన కళ్ళు. చిరిగి పేలికలైన పాంటూ, షర్టూ, ఎంతో దూరంనించి పరిగెత్తుకు వచ్చినట్టు ఆయాసపడుతున్నాడు.

"ఎవరు నువ్వు?" అడిగేను ఇంగ్లీషులో.

అతను పలకలేదు. పలికే ఓపిక లేనట్టూ, నిల్చునే సత్తువలేనట్టూ మొదలు నరికిన చెట్టులా కిందకూలేడు. అందరం ఒకరి మొహాలొకరం చూసుకున్నాం.

"ఎత్తి సోఫాలో పడుకోబెట్టండి!" అన్నాను.

అతని మొహంమీద నీళ్ళు చిలికిన కాసేపటికి కళ్ళు తెరిచి, మెల్లిగా లేచి కూర్చున్నాడు. అప్పుడు గమనించేను. పాదరక్షలు లేకుండా రాళ్ళూ రప్పల్లో తిరగడం వల్ల అతని కాలివేళ్ళు బాగా గాయపడి వున్నాయి. అతను స్థానిక పౌరుడిలా కనిపించడం లేదు!

సోఫా చుట్టూ నిల్చున్న మమ్మల్ని చూడగానే అతని కళ్ళు మెరిసేయి. "భగవంతుడు దయామయుడు, అందుకే మిమ్మల్ని నన్ను ఆదుకోడానికి పంపేడు. ఇహ నాకేం భయం లేదు" అన్నాడు హిందీలో.

"మీరెవ్వరు? ఇక్కడికెలా వచ్చారు?" అడిగేడు డేవిడ్ ఆశ్చర్యంగా.

"నా పేరు జైరాంజీ! ఇంతక్రితం ఇక్కడికి పంపబడ్డ గవర్నర్ గారి సిబ్బందిలో ఒకణ్ణి!"

"ఆయనిప్పుడెక్కడున్నారు?" అడిగేను ఆతృతగా.

అతను నిట్టూర్చి - "స్వర్గంలో!" అన్నాడు.

"మీరెంతమంది వచ్చారిక్కడికి?"

"గవర్నర్ గారితో కలిపి పన్నెండుమంది!"

"మిగతా వాళ్ళెక్కడున్నారు?"

"వాళ్ళ శవాలు యిప్పటికీ శవాలుగా ఉండి ఉంటే వాళ్ళూ చనిపోయేరనుకోవాలి!"

"అంటే?" అన్నాను అర్థంకాక.

"చెబితే మీరు నమ్మరు సార్!"

"ప్లీజ్! ప్రొసీడ్."

"ఇక్కడి మనుషులు చనిపోయినవాళ్ళని మళ్ళీ బ్రతికిస్తారు!"

పకపక నవ్వేశాం అందరం.

"అలా నవ్వకండి. ఇది నిజం. నా కళ్ళారా చూసేను."

అధిక భయంవల్ల అతనిలా పిచ్చిగా మాట్లాడుతున్నాడేమో అనుకుంటూ మాటమార్చేను. "అందరూ చనిపోగా మీరొక్కరూ ఎలా తప్పించుకో గలిగేరు? తప్పించుకుని ఇన్నాళ్ళూ ఎలా జీవించేరు?"

"గవర్నర్ గారితో సహా ఒక్కొక్కరూ ఊహించని విధంగా అదృశ్య మవుతుండటంతో నేను భయపడి నా వంతు రాకముందే ఈ భవనం వదిలి అడివిలోకి పారి పోయేను.

తరువాత కొండమీది శిధిలమైన కోటలో తలదాచు కున్నాను. అడివిలో దొరికే పళ్ళూ, దుంపలూ తింటూ యింత కాలం ప్రాణాలు నిల్పుకున్నాను. ఒక్కోసారి పక్షుల్ని చంపి పచ్చి మాంసం తిన్న రోజులూ వున్నాయి. బైట ప్రపంచంతో ఎటువంటి సంస్కారం లేకుండా ఏకాకిగా వుంటూ నేనూ ఓ అడివి మనిషినై పోయేను" అన్నాడతను రుద్ధ కంఠంతో.

"కొండమీద కోటలో వీళ్ళు మిమ్మల్ని కనుక్కోలేక పోయేరా?"

"ఆ కోటలో ప్రేతాత్మలు నివసిస్తాయని స్థానిక ప్రజల్లో ఓ మూఢనమ్మకం వుంది. అందుకే ఎవ్వరూ ఆ కోటవైపు రారు."

"గవర్నర్ గారినీ మిగతా వాళ్ళనీ వీళ్ళు తుపాకులతో కాల్చి చంపారా?"

"వీళ్ళు ఎవర్నీ ఆయుధాలతో చంపరు!"

"మరి?"

"మంత్రాలతో!"

"గవర్నరుగారి వెంట మీరు ఏ డ్యూటీ మీద వచ్చారు?"

"సెక్యూరిటీ ఆఫీసర్ గా. నేను రిటైర్డ్ మిలిటరీ మేజర్ని!"

"ఒక మిలిటరీ ఆఫీసర్ మంత్ర తంత్రాలని నమ్మ

తున్నాడంటే నాకు చాలా ఆశ్చర్యంగా వుంది'' అన్నాను అతన్ని పరీక్షగా చూస్తూ.

అతను నిట్టూర్చేడు. "మీరు నా మాటల్ని వేళా కోళంగా తీసుకుంటున్నారు. నేను రెండు యుద్ధాల్లో పాల్గొన్నాను. ఒకప్పుడు నాకూ మంత్రతంత్రాల మీద నమ్మకం వుండేది కాదు. కాని, ఇక్కడ కళ్ళారా చూసేక నమ్మక తప్పలేదు. మీరు డోంగానూ, అతని అనుచరుల్నీ చూశారా?''

"చూడటం కాదు. ఇక్కణ్ణించి తన్ని తరిమేశాం. వాళ్ళంటే నీకు భయమా?''

"నో.నో! నిజానికి వాళ్ళు కూడా ఒకరికి భయ పడుతూ ఇక్కడ జీవిస్తున్నారు. వాళ్ళే కాదు, ఈ దీవి ప్రజలంతా ఒకే ఒక వ్యక్తికి భయపడుతూ బ్రతుకు తున్నారు.''

"ఎవ్వరతను?''

"భారుంగా!''

"వాడెవ్వడు?'' అడిగేడు డేవిడ్ ఆశ్చర్యంగా.

"మహామాంత్రికుడు! వాడే తన మంత్రవిద్యతో తన ప్రత్యర్థుల్ని చంపి, వాళ్ళని తిరిగి 'కాఘా' లుగా మార్చేస్తాడు.''

"కాఘా అంటే?''

"స్థానిక భాషలో దెయ్యాన్ని 'కాఘా' అంటారు. వివరంగా చెప్పాలంటే, వాడు తన ప్రత్యర్థిని చంపి తిరిగి 'కాఘా' రూపంలో బ్రతికించి తన బానిసగా మార్చుకుంటాడు. అడవిలో వాడికి పెద్ద చెఱకు తోట లున్నాయి.

ఆ చచ్చిబ్రతికిన మనుషులచేత వాడా తోటల్లో వెట్టి చాకిరీ చేయించుకుంటాడు. దయచేసి మీరు నామాటలు నమ్మండి. మనం ఎంత త్వరగా ఈ దీవి వదిలి వెళ్ళిపోతే అంత మంచిది.''

''వెళ్ళకపోతే ఏమౌతుంది?''

''ఈ ఇంటి తలుపుమీద తెల్లని క్రాస్ గుర్తు పడి తీరుతుంది.''

అర్థంగాక మేము ఒకరిమొహాలొకరం చూసుకున్నాం.

''ఇక్కడి ప్రజలకి రాత్రిళ్ళు నిదరపట్టదు. ఎప్పుడే ఇంటి తలుపుమీద క్రాస్ గుర్తు పడుతుందో, ఎవ్వడి చావు మూడుతుందో అని గుండెలు గుప్పెట్లో పెట్టుకు గడుపుతారు.''

''క్రాస్ గుర్తుపడితే ఏం జరుగుతుంది?''

''మరణం! తరవాత శాఖా!!''

''ఆ గుర్తు ఎవరు వేస్తారు?''

''తెలీదు. రాత్రి గుర్తుపడుతుంది. తరవాత ఆ ఇంట్లో ఎవ్వరో ఒకరు మరణిస్తారు!''

''మీరు వచ్చినప్పుడు కూడా ఈ ఇంటి తలుపుమీద గుర్తుపడిందా?''

''ఔను!''

''మీరీ దీవిలో అడుగుపెట్టినప్పట్నుంచీ ఏం జరిగిందో కాస్త వివరంగా చెబుతారా?''

''చెబుతాను. ముందు నాకు తినడానికేమైనా ఇవ్వండి.మనుషులు తినే తిండి తిని ఎంతో కాలమైంది!'' అన్నాడతను పెదాలు తడుపుకుంటూ.

"మాటల్లో మీ ఆకలి దప్పికల గురించి అడగటం మరిచేను. సారీ!" అంటూ డేవిడ్ కి సైగ చేశాడు.

లోనికెళ్ళి, తినుబండారాలతో ప్లేటు నింపి తెచ్చేడు డేవిడ్.

ప్లేటుమీద చిరుతలా దాడిచేసేడతను. కన్ను మూసి తెరిచేలోగా ప్లేటు శుభ్రంగా కడిగినట్టు ఖాళీచేసేడు. తరవాత ట్రేలో కాఫీ తెచ్చి అందరికీ తలో కప్పు ఇచ్చేడు డేవిడ్.

కాఫీ తాగేక తృప్తిగా త్రేన్చి ప్రారంభించేడతను' "మేమీ భవనంలో ప్రవేశించేసరికి డోంగా, బాసో, అతని అనుచరులూ వున్నారిక్కడ. గవర్నర్ గారు వాళ్ళని తీవ్రంగా అవమానించి, భవనంలోంచి గెంటేశారు.

స్థానిక ప్రజలు మమ్మల్ని చూసి విపరీతంగా భయపడుతున్నట్టు కనిపించేరు. రెండు మూడు రోజులవరకైతే ఊళ్ళో మనిషి ఛాయ కనిపించలేదు. మేము వచ్చామని తెలిసి గుడిసెల్లో దాక్కున్నారు!

దీన్నిబట్టి ఛారుయంగా, డోంగా, బాసోలు ప్రజల్లో మా మీద తప్పుడు ప్రచారం జేసి భయం రేకెత్తించి వుంటారని గ్రహించేము. తరవాత అబ్దుల్ అనే ఒక వ్యక్తి మమ్మల్ని కలుసుకోవడానికి వచ్చేడు. అతను ఇండోనీషియా నివాసి. చాలా రోజులక్రితం ఇక్కడికి వచ్చి స్థిరపడ్డాడు.

ఊళ్ళో చిన్న దుకాణం తెరిచి సూదులూ, దారాలూ పూసలూ, దువ్వెనలూ, అద్దాలూ, ముతకరకం బట్టలూ, మొదలైనవి స్థానిక ప్రజలకమ్మేవాడు. ఇక్కడ కరెన్సీ

నడవదు గనక వాటికి బదులు ముత్యపు చిప్పలూ, గంధం చెక్కలూ మొదలైనవి పుచ్చుకునేవాడు. ఏడాది వరకూ వాటిని పోగుచేసి ఇండోనేషియా తీసికెళ్ళి అమ్మి డబ్బు జేసుకునేవాడు.

అతను మావద్దకి వచ్చి జేసిన ఫిర్యాదు ఏమిటంటే, డోంగా, బాసోలు అతన్ని వ్యాపారం జేసుకోనివ్వకుండా పీడిస్తున్నారుట. టాక్స్ రూపంలో విపరీతంగా డబ్బు గుంజుతున్నారుట. ఈ అన్యాయం ఇలాగే కొనసాగితే తను ఎక్కువకాలం ఇక్కడ బ్రతకలేననీ, తను వెళ్ళిపోతే తన కారణంగా ఇక్కడి ప్రజలకు దొరుకుతున్న నిత్యావసర వస్తువులు కూడా దొరకవనీ, వాళ్ళకు నచ్చజెప్పి తన జోలికి రాకుండా చెయ్యమనీ వేడుకున్నాడు. గవర్నర్ గారు అతనికి హామీ ఇచ్చి పంపేరు!''

''నేను అబ్దుల్ ని చూడాలి. ఎక్కడున్నాడతను?''

జైరాజ్ నిట్టూర్చి — ''ఇంకెక్కడి అబ్దుల్! మమ్మల్ని కలుసుకున్న రెండవ రోజు అతని ఇంటి తలుపుమీద క్రాస్ గుర్తు కనిపించింది. అదేరోజు అతను ఊహించని విధంగా మరణించాడు. ఆ హఠాత్సంఘటనకి మేము నివ్వెరబోయాం.

అతని శవాన్ని స్వయంగా నేను దగ్గరుండి సమాధి చేయించేను. మర్నాడు వెళ్ళి చూస్తే ఆ సమాధి తవ్వివుంది. అందులో పూడ్చిన అబ్దుల్ శవం అదృశ్యం!''

''అంటే, భారుంగా ఆ శవాన్నితీసి, మళ్ళీ బ్రతికించి కాఘాగా మార్చేడంటారా?'' అడిగేను నవ్వుతూ.

జైరాజ్ తలూపాడు. ''ఆ తరవాత ఒకరోజు ఈ

భవనం తలుపుమీదకూడ క్రాస్‌గుర్తు పడింది. అంతే! గవర్నర్‌తోసహా రోజుకొకరు అదృశ్యం కాసాగేరు. నేను భయపడి పారిపోయి కోటలో దాక్కున్నాను.

ఆ కోటమీంచి చూస్తే సముద్రంతోబాటు, ఈ దీవి మొత్తం కనిపిస్తుంది. ఈ రోజు సాయంత్రం మీరు షిప్‌లో వచ్చి ఈ దీవిలో దిగడం చూసేను. ఎవ్వరో కొత్త గవర్నర్ వచ్చి ఉంటారని ఊహించేను. నా ప్రాణం లేచివచ్చింది. చీకటిపడగానే రహస్యంగా ఇక్కడికి చేరేను. దయచేసి నా మాటలు నమ్మి తక్షణం ఇక్కణ్ణించి ప్రయాణం కట్టండి..."ఇంకా అతని మాట పూర్తి కాలేదు.

హఠాత్తుగా హాలు తలుపు కవతల, ఏదో శబ్దమైనట్టు నా పాము చెవులు పసిగట్టేయి! అందర్నీ సైలెంట్ అవమన్నట్టు వేలితో సైగ జేసేను.

మళ్ళీ వినిపించింది శబ్దం.

"డేవిడ్ ఫాలోమీ." అంటూ పిస్తోలు అందుకుని అటు నడిచేను.

డేవిడ్‌తోబాటు అందరూ సవ్వడికాకుండా నన్ను అనుసరించేరు.

గడియలాగి చటుక్కున తలుపు తెరిచేను.

చీకటి! ఎవ్వరూ లేరు!!

"అదుగో, క్రాస్‌గుర్తు!" జైరాజ్ అరిచేడు.

చటుక్కున తలుపు రెక్కమీద చూసేను.

సుద్దముక్కతో గీసిన క్రాస్‌గుర్తు!

ఆడుతున్న ఊపిరి ఒక్కసారి ఆగిపోయినట్లు తోచింది మాకు.

"ఇక మనల్ని ఎవ్వరూ ఆగుకోలేరు. ముప్పు ముూడక ముందే ఇక్కణ్ణించి మూటాముల్లె సర్దుకోడం ఉత్తమం!" అన్నాడు జైరాజ్ వణుకుతూ.

"మిస్టర్ జైరాజ్! పిరికితనం పనికిరాదు. దీన్నొక ఛాలెంజ్‌గా తీసుకోవాలి మనం. భూరుంగా ఎక్కడుంటాడో తెలుసు మీకు?" అడిగేను తలుపుమూస్తూ.

"అడవిలో ఓ ఆటవిక దేవత గుడి వుంది. ఆ గుడి పక్కనే భూరుంగా గుడిసె వుంది."

సాలోచనగా తలూపేను. దూరాన డప్పులశబ్దం వినిపిస్తూనే వుంది!

"ఆ డప్పుల శబ్దం ఏమిటి? ప్రతిరాత్రీ యిలాగే వినిపిస్తుందా?"

"రోజూ వినిపించదు! కొత్త గవర్నర్ వచ్చిన రోజూ ప్రారంభమయిందంటే ఆ గవర్నర్ పార్టీ అంతా తుడిచి పెట్టుకు పోయేవరకూ వినిపిస్తుంది."

"ఆల్‌రైట్! మిగతా విషయాలు రేపు చూసుకుందాం. పదండి." అంటూ పడగ్గదివైపు నడిచేను.

## 4

ఉదయం కాలకృత్యాలు తీర్చుకుని కేక్, బిస్కెట్, కాఫీలతో బ్రేక్‌ఫాస్ట్ కానిచ్చాం.

ఊళ్ళో ఇంకా జనసంచారం లేదు. ఇద్దరు ముగ్గురు పిల్లలు ఓ గుడిసెముందు ఆడుకుంటూ కనిపించేరు. కనీసం గోచిముక్క కూడా లేకుండా పూర్తి నగ్నంగా వున్నారు. అప్పుడప్పుడూ తలతిప్పి భయం భయంగా భవనంవైపు చూస్తున్నారు.

మాతో జైరాజ్ ఇప్పుడు మామూలు మనిషయ్యేడు.

నున్నగా గెడ్డం గీసుకున్నాడు. పొట్టిగా జుత్తు కత్తిరించుకున్నాడు. శుభ్రంగా స్నానంచేసి మేమిచ్చిన పాంటూ, షర్టూ వేసుకున్నాడు.

"ఇక్కడ జైలుగది వున్నట్టు విన్నాను. దాన్ని ఓసారి చూడాలి. పదండి." అన్నాను అందరితో.

"ఔను. భవనం వెనకభాగంలో వుంది. దాని తాలూకు తాళంచెవి ఆ బల్ల సొరుగులో ఉంటుంది." అన్నాడు జైరాజ్ హాల్లో ఓమూల వున్న బల్లచూపిస్తూ.

తాళంచెవి తీసుకుని అందరం జైలుగది దగ్గరికెళ్ళాం. రాళ్ళతో పటిష్టంగా కట్టిన గది అది. లావుపాటి ఇనుప ఊచల తలుపు మూసి వుంది. దానికి తక్కెడు బరువు తాళం వేళాడుతోంది.

దాని పక్కనే చిన్న సర్వెంట్ క్వార్టర్ కట్టేరు. క్వార్టర్ పక్కన అవతలికెళ్ళే గేట్ వుంది. తాళం తెరిచి జైలుగది శుభ్రం జెయ్యమని సిబ్బందికి పురమాయించి నేనూ, డేవిడ్, జైరాజ్ తిరిగి హాల్లోకి వచ్చాం.

మనుషులెవ్వరైనా కనిపిస్తారేమోనని బైనాక్యులర్స్‌తో ఊళ్లోకి చూసేను. ఓ గుడిసె కిటికీలోంచి ఎవ్వరో తొంగి చూస్తున్నట్టు లీలగా కనిపించింది.

"డేవిడ్! అదుగో, ఆ గుడిసెలోంచి ఎవ్వరో తొంగి చూస్తున్నారు. మీరిద్దరూ వెళ్ళి ఆ వ్యక్తిని తీసుకురండి" అన్నాను.

డేవిడ్, జైరాజ్ గబగబ బైటికి నడిచేరు. నేను గుమ్మంలో నిల్చుని బైనాక్యులర్స్‌లోంచి వాళ్ళని గమనిస్తున్నాను. ఇద్దరూ గుడిసెని సమీపించి లోనికెళ్ళి ఓ నలభై ఏళ్ళ వ్యక్తిని బలవంతంగా ఇవతలికి తీసుకువచ్చేరు.

మరుక్షణం ఆ గుడిసెలో పిల్లలూ, స్త్రీలూ ఆరున్నొక్క రాగంలో రోదించసాగేరు.

ఆ వ్యక్తి తనని పిడిచిపెట్టమని డేవిడ్ కాళ్ళా వేళ్ళా పడుతున్నాడు. జైరాజ్ అతనికి నచ్చచెప్పుతూ ఎలాగో భవనంవరకూ తీసుకువచ్చేడు. అతని నడుంచుట్టూ పులి చర్మం తప్ప మరేం లేవు.

ఆ వ్యక్తిని చూస్తూ స్నేహపూర్వకంగా నవ్వి - "నీకు ఇంగ్లీష్ అర్థమాతుందా?" అడిగేను.

అతను బెదురుచూపులు చూస్తూ తలూపేడు.

"ఎక్కడ నేర్చుకున్నావ్?"

"నా తండ్రి బ్రిటిష్‌వారి దగ్గర పనిచేసేవాడు."

"నీ పేరేమిటి?"

"షాంగో!"

"గ్లాడ్ టు మీట్ యూ మిస్టర్ షాంగో. నేను మీ కొత్త గవర్నర్ని!" అంటూ చెయ్యి ముందుకు చాచేను.

షాంగో నా చేతిని ఏదో విషసర్పాన్ని చూసినట్టు చటుక్కున రెండడుగులు వెనక్కి వేసేడు.

"భయపడకు! నేను మీ మిత్రుణ్ణి. మీ కష్టసుఖాలు చూడటానికి వచ్చేను" అన్నాను శాంతంగా.

అతను సందేహిస్తూ షేక్‌హేండ్ యిచ్చి చటుక్కున చెయ్యి వెనక్కి లాక్కున్నాడు.

"ఆ గుడిసె దగ్గర ఆడుకుంటున్న పిల్లలు నీ పిల్లలేనా?"

షాంగో తలూపేడు.

"డేవిడ్! ఓ బిస్కెట్ పాకెట్ పట్రా" అన్నాను.

డేవిడ్ లోనికెళ్ళి ఓ క్రీమ్ బిస్కెట్ పాకెట్ పట్టుకొచ్చేడు.

దాన్ని షాంగో ముందుకు చాపుతూ "తీసుకో! దీన్ని నా బహుమతిగా నీ పిల్లలకివ్వు!" అన్నాను.

షాంగో భయం కొద్దికొద్దిగా దూరమైనట్టుంది. పాకెట్ అందుకుని సెల్యూట్ చేశాడు.

"మిస్టర్ షాంగో మీరు మమ్మల్ని చూసి భయపడ వలసిన అవసరం లేదు. మేము మీ మిత్రులం. మీ మీద ఎవ్వరైనా అత్యాచారాలు జరపడానికి ప్రయత్నిస్తే మాకు ఫిర్యాదు చెయ్యాలి.

వాటిని తక్షణం పరిష్కరించి మీకు మేలు కలగ చేస్తాం. మీలో ఎవరైనా జబ్బుపడ్డా, గాయపడ్డా యిక్కడికి వచ్చి కట్లు కట్టించుకోవాలి. మందులు తీసుకో వాలి. మీలో మీరు పరస్పరం కొట్లాడుకో వద్దు. చట్టా నికి వ్యతిరేకంగా ప్రవర్తించేవాళ్ళు కఠినంగా శిక్షించ బడతారు. ఈ విషయాలన్నీ నా సందేశాలుగా ఊళ్ళో వాళ్ళకి తెలియజెయ్యి!" అన్నాను.

ఈసారి షాంగో భయం పూర్తిగా తొలగిపోయి నట్టుంది. మెరిసే కళ్ళతో సెల్యూట్ కొట్టేడు.

"రోజూ ఈభవనం ఊడ్చి శుభ్రం చెయ్యడానికిమాకో సర్వెంట్ కావాలి. మా దగ్గర ఉద్యోగం చేస్తావా?"

"చేస్తాను సార్!"

"ఐతే, భవనం వెనుక సర్వెంట్ క్వార్టర్ ఖాళీగా వుంది. గుడిసెలోంచి నీ భార్యా పిల్లల్ని తీసుకొచ్చి అందులో వుండు" అన్నాను.

షాంగో పట్టరాని సంతోషంతో ఊళ్ళోకి పరి గెత్తాడు.

"జైరాజ్! మనం యిప్పుడు అడివిలో, భారంగా

నివాసానికి బైలుదేరబోతున్నాం. మీరు మా వెంట వుండి దారి చూపించాలి.''

అతని కళ్ళు భయంతో విప్పారేయి.

''మీరు అనవసరంగా భయపడుతున్నారు. దేనికైనా తెగింపు వుండాలి. అప్పుడే తాడో పేడో తేలిపోతుంది. మన చావులు ఈ దీవిలోనే రాసిపెట్టివుంటే ఎవరైనా తప్పించగలరా?''

జైరాజ్ చిన్నగా తలూపేడు.

ముగ్గురం మూడు రివాల్వర్స్ నిండా గుళ్ళు నింపుకుని మరికొన్ని స్పేర్ బుల్లెట్స్ తీసుకుని, మిగతా వారిని భవనంలోనే జాగ్రత్తగా వుండమని చెప్పి బైలుదేరాం.

## 5

అడివి దట్టంగా వుంది. చెట్లూ చేమలూ దాటుకుంటూ నడుస్తున్నాం. అంతక్రితం ఆ మార్గం గుండా ఎవ్వరో నడిచినట్టు గడ్డి అడుక్కుపోయి చిన్న దారి ఏర్పడింది. ఆ దారి గుండా పడుతున్నాయి మా అడుగులు.

ముందు నడుస్తున్న జైరాజ్ చటుక్కున ఆగి— ''అదిగో, అదే భైరుంగా నివాసం!'' అన్నాడు తగ్గు స్వరంతో.

ముగ్గురం అక్కడే ఆగిపోయాం. చెట్ల ఆకులు కొద్దిగా తొలగించి జైరాజ్ చూపించిన వైపు చూసేను. పది గజాల దూరంలో కనిపిస్తోంది ఓ విశాలమైన గుడిసె. గుడిసె ఆవరణ అంతా శుభ్రంగా వుంది. దానికాస్త ఎడంగా మట్టితో కట్టిన చిన్న గుడి కనిపిస్తోంది.

గుడిసె ఆవరణలో వెదురు బొంగులతో చేసిన దిమ్మెల మీద కూర్చుని ఆకు చుట్టలు కాలుస్తూ మాట్లాడుకుంటున్నారు ముగ్గురు వ్యక్తులు. ఆ ముగ్గుర్లో ఇద్దరు మాకు తెలి

సిన వారే. దొంగా, బాసోలు!

మూడో వ్యక్తి నల్లగా దృఢంగా వున్నాడు. వాడి తల చుట్టూ పొడవాటి పక్షి ఈకల కిరీటం వుంది. మెడలో రంగు రంగుల పూసలహారం, పులిగోళ్ళతో అల్లిన హారం వేలాడుతున్నాయి. మోచేతికి గవ్వల పట్టీలు, ఎడం చేతికి చిన్న చురకత్తి బిగించి వుంది. నడుం చుట్టూ పులి చర్మం.

"భారుంగా వాడే!" అన్నాడు జైరాజ్.

సాలోచనగా తలూపేను. "ముందు మీరిద్దరూ వాళ్ళ దగ్గరికెళ్ళి కొత్త గవర్నర్ పిలుస్తున్నారని చెప్పండి. నేనిక్కడే వుండి రివాల్వర్‌తో మిమ్మల్ని కవర్ జేస్తుంటాను. బి కేర్ ఫుల్!"

డేవిడ్, జైరాజ్ ఆకుల్ని చీల్చుకుంటూ గుడి వైపు నడిచేరు. ఆకుల శబ్దం విని, ఆ ముగ్గురూ ఉలిక్కిపడి యిటు చూసేరు! తరవాత, నిదానంగా పొదల చాటు నించి బైటికి వచ్చి, వాళ్ళకి కనిపించేలా నిల్చున్నాను.

నా కుడిచెయ్యి జేబులో వుంది. వేళ్ళు రివాల్వర్ మీద రెడీగా వున్నాయి. అక్కడే నిల్చుని చూడసాగేను. డేవిడ్ మీద నాకు పూర్తి నమ్మకం వుంది. అతను మంచి బాక్సర్! పిడికిలి బిగించి డొక్కలో కుమ్మేడంటే, ఎంతటి వాడైనా కాండం నరికిన చెట్టులా కింద కూలవలసిందే.

డేవిడ్, జైరాజ్ వాళ్ళని సమీపించేరు. ఐనా ముగ్గురూ లేచి నిల్చోలేదు.

రెప్ప వెయ్యకుండా చిరుతల్లా చూస్తూ కూర్చున్నారు.

"మిస్టర్ భారుంగా! కొత్త గవర్నర్ గారు వచ్చేరు. నిన్ను పిలుస్తున్నారు పద!" అన్నాడు డేవిడ్.

భారుంగా పలకలేదు.

"చెప్పేది నీకే!" అరిచేడు డేవిడ్.

భారుంగా చటుక్కున ఖాండ్రించి నేల మీద ఉమ్మేడు.

కోపంతో డేవిడ్ మొహం జేవురించింది. "రాస్కెల్ నీ పొగరిప్పుడే అణుస్తాను" అంటూ వాడు కూర్చున్న వెదురు దిమ్మెమీద కాలుపెట్టి గట్టిగా తోసేడు.

ఆ తోపుకి భారుంగా ఉన్నపళాన వెనక్కి పడ్డాడు. మరుక్షణం స్ప్రింగులా ఎగిరి నిల్చున్నాడు. లేస్తూ చేతి పట్టాకి బిగించివున్న చురకత్తి లాగేడు. నా చెయ్యి పిస్తోలుతో సహా జేబులోంచి యివతలికి వచ్చింది.

ఇంత జరుగుతున్నా డోంగా, శానోలు బెల్లం కొట్టిన రాయిల్లా, అదేదో తమాషా చూస్తున్నట్లు కూర్చున్నారు. భారుంగా చురకత్తిని డేవిడ్ గుండెలో దింపడానికి చిరుతలా లంఘించేడు.

డేవిడ్ లాఘవంగా ఆ దెబ్బనించి తప్పించుకుని, పిడికిలి బిగించి వాడి పొట్టలో చావు దెబ్బ తీసేడు.

గావుకేక!

వాడా దెబ్బనించి తేరుకునేలోగా, డేవిడ్ బూటు కాలితో ఈడ్చి డొక్కలో తన్నేడు. భారుంగా బాధ భరించలేక పొట్ట పట్టుకుని కిందకూలేడు.

అడుగులో అడుగు వేసుకుంటూ వాళ్ళని సమీపించేను.

డోంగాని చూస్తూ—"లే!" అన్నాడు డేవిడ్.

ఇద్దరూ కిమ్మనకుండా కూర్చుని, మమ్మల్ని గుర్రుగా చూస్తున్నారు.

"చెప్పేది నీకే! లే." అరిచాడు డేవిడ్.

ఇద్దరూ మౌనంగా లేచి నిల్చున్నారు.

"మీదగ్గరకూడా పిడికత్తులు వుండి వుంటాయి. బుదిగా వాటిని తీసి కింద పడెయ్యండి." అన్నాడు డేవిడ్ ఆజ్ఞాపిస్తూ.

వాళ్ళలో చలనంలేదు. అలాగే నిల్చున్నారు.

"మర్యాదగా చెప్పినట్టు చేస్తారా లేక, మీకూ వాడి గతి పట్టించనా?" పిడికిలి బిగించి అడుగు ముందుకు వేశాడు డేవిడ్.

దాంతో ఇద్దరూ గబగబ బొడ్లలో ఉన్న చురకత్తులు తీసి కింద పడేసేరు. స్పృహతప్పి పడివున్న భౌరుంగాని చూపిస్తూ—"మీరిద్దరూ వాణ్ని మోసుకుని, మా వెంట ప్రభుత్వ భవనానికి రండి" అన్నాను గంభీరంగా.

మొహాలు చిట్లిస్తూ వాణ్ని సమీపించి నేలమీంచి ఎత్తేరు. వాళ్ళని వెంటబెట్టుకుని, వచ్చిన దారినే బైలుదేరాం.

# 6

ఊరి మధ్యనించి భౌరుంగాను మోసుకుంటూ భవనం వైపు వెళుతోంటే గుడిసెల్లో నక్కి నక్కి ఏదో చోద్యం చూస్తున్నట్టు చూడసాగేరు ప్రజలు.

నాక్కావలసింది అదే. ఈవిధంగా ఇంతకాలం వారిలో పేరుకున్న భయం సన్నగిల్లుతుంది. మాపట్ల విశ్వాసం, గౌరవం ఏర్పడుతుంది.

భవనంలో ప్రవేశించగానే భారుంగాను కిందపడుకో బెట్టమని సైగ జేసేను. డోంగా, బాసో చమట్లు కారుస్తూ వాణ్ణి కింద పడుకోబెట్టేరు. డేవిడ్ లోని కళ్ళి జగ్గు నిండా నీళ్ళు తెచ్చి వాడి మొహంమీద గుమ్మరించేడు.

భారుంగా కాసేపటికి కదిలి కళ్ళు తెరిచేడు.

"లేచి నిల్చో!" అన్నాను.

అతికష్టంమీద లేచి నిల్చున్నాడు.

"ఇంతక్రితం ఇక్కడికి వచ్చిన గవర్నర్లు ఏమయ్యేరు?"

భారుంగా పలకలేదు. నేల మాపులు చూస్తున్నాడు.

"ఆల్ రైట్! నీనించి నిజాలు ఎలా కక్కించాలో నాకు తెలుసు." అంటూ డేవిడ్ వైపు తిరిగి – "వీడిప్పుడు మన ప్రశ్నలకి జవాబులిచ్చే స్థితిలో లేడు. నీ దెబ్బలనించి కోలుకునేవరకూ వీణ్ని లాకప్ లో ఉండనివ్వాలి. తరవాత మన పద్ధతులు ఉపయోగించాలి" అన్నాను.

డేవిడ్ తలూపేడు.

డోంగా, బాసోలవైపు తిరిగేను. "ఇన్నాళ్ళూ చొప్పదంటు మంత్రాలతో ఈ దీవిని గడగడలాడించిన మీ మాంత్రికుడి గతి కళ్ళారా చూస్తున్నారుగా? ఈ రోజునించీ ఈ దీవి ప్రజలకి పీడి పీడ విరగడయిందనుకోండి.

గతంలో మీ ఇద్దరివల్ల జరిగిన తప్పుల్ని నేను క్షమిస్తున్నాను. ఇకనించి గూండా వ్యవహారాలు మాని బుద్ధిగా బ్రతకండి. వెళ్ళండి!"

ఇద్దరూ వెనుదిరిగి గబగబ అడవివైపు వెళ్ళిపోయేరు.

డేవిడ్ పిస్తోలు తీసి భారంగా డొక్కలో పొడుస్తూ —"పద!" అన్నాడు.

వాణ్ణి భవనం వెనక ఉన్న లాకప్‌లో తోసి, తలుపుకి తాళం వేశాం.

"మిస్టర్ జైరాజ్! అడవిలో ఎక్కడో భారంగా చెఱకు తోటలున్నాయన్నారు. నేను వాటిని ఓసారి చూడాలి" అన్నాను.

"చూపిస్తాను. పదండి!"

మధ్యాహ్నం భోజనం కానిచ్చి ముగ్గురం తిరిగి బైలు దేరాం.

తూర్పు దిశగా చాలాదూరం నడిచేక, దూరాన లీలగా కనిపించేయి చెఱకు మళ్ళు. గబగబ అడుగులు వేస్తూ అరగంటలో అక్కడికి చేరుకున్నాం.

ముగ్గురు వ్యక్తులు కొడవళ్ళతో, కలుపు మొక్కలు కోస్తూ కనిపించేరు.

వాళ్ళని సమీపించామో లేదో—"కాఘా... కాఘా... దెయ్యం!" అంటూ వెనుదిరిగి పరుగులంకించేడు జైరాజ్

ఆ హఠాత్సంఘటనకి నేనూ, డేవిడ్ నివ్వెర బోయాం.

"డేవిడ్! పరిగత్తి అతన్ని పట్టుకో" అన్నాను ఆత్రతగా.

డేవిడ్ అతని వెనక పరిగత్తి పట్టి ఆపేడు.

"జైరాజ్! ఏమిటిది? దేనికలా పారిపోతున్నావ్?" అడిగేను ఆశ్చర్యంగా.

అతను, తోటలో పనిచేస్తున్న ముగ్గురు వ్యక్తుల్లో ఒకణ్ణి చూపిస్తూ—

"నేను చెప్పిన అబ్దుల్ అతనే!" అన్నాడు.

"ఐతేఏం? సాటిమనిషిని చూసి భయపడాలా?"

"అతను మనిషికాదు! ఆరోజు నా చేతులతో అతన్ని సమాధి చేసేను. భారంగా అతన్ని కాఫీ-గా మార్చి తోటలో పని చేయించుకుంటున్నాడు."

నాకు నవ్వాగలేదు. "సరే, ఆ కాఫీ సంగతేమిటో చూద్దాం పద!" అంటూ అతన్ని వెంటబెట్టుకుని తోట వైపు నడిచేను,

ముగ్గురం ఆ మనుషుల్ని సమీపించాం.

ఐనా, వాళ్ళు మావైపు తిరిగిచూడలేదు.

తమకేమీ పట్టనట్లు యంత్రాల్లా పనిచేసుకుపోతున్నారు.

"ఏయ్, మిమ్మల్నే!" పిలిచేను.

ఐనా, వాళ్ళల్లో మార్పులేదు.

అబ్దుల్ భుజంమీద చెయ్యివేసి "మిస్టర్, నిన్నే!" అంటూ నావైపు తిప్పేను. అతను మరబొమ్మలా తిరిగి, నావైపు శూన్యంలోకి చూస్తున్నట్లు చూడసాగేడు. మొహంలో ఎలాటి భావాలూ లేవు. కనుగుడ్లు తెల్లగా పాలిపోయి వున్నాయి.

"మైగాడ్! ఇతను నిజంగా బ్రతికున్న శవంలా కనిపిస్తున్నాడు." అన్నాడు డేవిడ్ దిగ్భ్రాంతితో.

నాకూ నమ్మశక్యం కావడంలేదు. అతని భుజం మీంచి చెయ్యితీసేను. అంతే! మళ్ళీ యంత్రంలా పనిలో నిమగ్నమయ్యేడు.

నా బుర్ర చురుగ్గా పనిచెయ్యసాగింది. "డేవిడ్! వీళ్లు హిప్నాటయిజ్ చెయ్యబడ్డారని నా అనుమానం" అన్నాను.

"అంటే, భారంగా హిప్నాటిస్ట్ అయ్యుంటా డంటారా?"

"ఔను!"

"అదే నిజమైతే అంత సులభంగా మనకెలా పట్టుబడ్డాడు? వీళ్ళలా మనల్ని హిప్నాటయిజ్ చేసి సులువుగా పారిపోవచ్చుగా?"

"వాడు మామూలు హిప్నాటిజంతో కాక, ఏవో మందూ మాకులతో మనుషుల్ని హిప్నాటయిజ్ చేస్తుంటాడేమో?"

"జైరాజ్ అబ్దుల్ శవాన్ని స్వయంగా సమాధిచేశానంటున్నాడే! ఇదెలా సంభవం?" అన్నాడు డేవిడ్ ఆశ్చర్యంగా.

"బహుశా, ఆరోజు అబ్దుల్ పూర్తిగా చనిపోయి వుండడు!"

"అంటే?"

"మనిషి చావు రెండు దశలుగా జరుగుతుంది. ముందు ప్రాథమిక మరణం. తరవాత సంపూర్ణ మరణం! ప్రాథమిక మరణంలో గుండె ఆగిపోతుంది. శరీరం చలనరహితమౌతుంది. ఊపిరి అందదు. అంతే.

అది జరిగిన ఐదు, లేదా ఏడునిమిషాల తరవాత మెదడులోని సెల్స్ పగిలి చెదరడం ప్రారంభిస్తాయి. అప్పుడు సంభవిస్తుంది సంపూర్ణ మరణం! సంపన్న దేశాల్లోని ఆస్పత్రుల్లో హృద్రోగి గుండె ఆగిపోయిన వెంటనే డాక్టర్లు అతని ఛాతీమీద మాలిష్ చేస్తూ, ఇతర యంత్రాల ద్వారా మళ్ళీ అతన్ని బ్రతికించుకుంటారు.

మెదడు సెల్స్ పగిలి చెదరడం ప్రారంభమయ్యా

యంటే ఎట్టి పరిస్థితిలోనూ మనిషిని బ్రతికించడం సాధ్యం కాదు. గుండె ఆగిన ఏడు నిమిషాల తరవాత మెదడులో ఈ చర్య జరుగుతుంది.

దీని ఆధారంగా ఆలోచిస్తే, ఖాయంగా ఆ ఏడు నిమిషాల వ్యవధిని కొన్ని గంటలవరకూ పొడిగించే మందేదో కనిపెట్టి ఉంటాడని నా అనుమానం. తను కోరుకున్న వ్యక్తిని ఏదో ప్రత్యేకమైన విషంతో ప్రాథమిక మరణం పాలుచేసి, కొన్ని గంటల తరవాత మళ్ళీ బ్రతికించి, హిప్నాటయిజ్ చేసి బానిసల్లా పనులు చేయించుకుంటున్నాడని తెలుస్తూంది. అందుకే స్థానిక ప్రజలు వాడంటే హడలి చస్తున్నారు.

వాడిప్పుడు మన బందీగా వున్నాడు. మనం వాడి గుడిసకెళ్ళి సెర్చ్ చేస్తే మన హేతువాదానికి ఆధారాలేమైనా దొరకవచ్చు. మందులూ మాకులూ ఏవైనా దొరికితే వాటిని పరిశోధనకోసం లేబొరేటరీకి పంపవచ్చు" అన్నాను.

## 7

బంకమట్టితో నున్నగా నిర్మించిన గుడి అది. తలుపు లేవు.

ముగ్గురం లోన ప్రవేశించాం. గుడిమధ్య చదునైన మట్టి దిమ్మెపై ఏదో విచిత్రాకారపు విగ్రహం కూర్చోబెట్టి వుంది. దాని మెడలో చిన్నచిన్న జంతువుల పుర్రెలూ, ఎముకలూ, వేళాడుతున్నాయి.

గోడలకి రకరకాల జంతుచర్మాలు అలంకరించి వున్నాయి. విగ్రహం ముందు ఎత్తైన రాయి వుంది. దాని మీద అక్కడక్కడా ఎండిపోయిన రక్తపు మరకలు,

జంతువుల్ని దీనిమీదే బలి ఇస్తారన్నమాట!

ఓ గోడ మేకుకు కాళ్ళు కట్టి తలకిందులుగా వేలాడుతున్న గద్ద కనిపించింది. దాన్ని మేకుమీంచి తీసి, కట్లు విప్పి వదిలేను. గట్టిగా అరుస్తూ బైటికెగిరి పోయింది.

అంగుళం వదలకుండా గుడి యావత్తూ పరిశీలించాం. మాకొక్కవలసిన వస్తువేదీ కనిపించలేదు.

"గుడిసె చూద్దాం పదండి." అన్నాను బైటికి నడుస్తూ.

ముగ్గురం గుడి పక్కనే ఉన్న భారుంగా గుడిసెలో ప్రవేశించాం.

గుడిసె రెండు భాగాలుగా విభజించి వుంది. ముందు గదిలో ఓమూల వున్న బీరువా నన్నాకర్షించింది. విక్టోరియారాణి కాలంనాటి పనితనం గల బీరువా అది. దాన్ని ప్రభుత్వ భవనంనించి కాజేసి వుంటారు.

బీరువా తలుపు తెరిచిచూసిన ముగ్గురం నిర్ఘాంత బోయాం.

అరలనిండా వరసగా పేర్చిన విదేశీ విస్కీ బాటిల్స్.

"మైగాడ్! వీడు గుడిసెలో పెద్ద బార్ తెరిచాడే." అన్నాడు డేవిడ్ ఆశ్చర్యంగా.

ఓ బాటిల్ అందుకుని దానిమీద అంటించివున్న లేబిల్ చూసేను.

'మేడ్ ఇన్ హాంకాంగ్' అని రాసివుంది.

"నాగరిక ప్రపంచ ఛాయలుకూడా కనిపించని ఈ అజ్ఞాత దీవిలో వీడికి విదేశీ మత్తుపానీయాలు ఎక్కణ్ణించి వచ్చేయి?" అన్నాను ఆలోచిస్తూ.

"ఆ పక్కగదిలో ఏమున్నాయో?" అన్నాడు డేవిడ్

అటు నడుస్తూ.

ముగ్గురం ఆ గదిలో అడుగు పెట్టాం.

గది మధ్య వెదురుమంచం వేసి వుంది. దానిమీద పరుపులా పులిచర్మం పరిచివుంది. మా దృష్టి ఓమూల ఉన్న వెడల్పాటి బల్లమీదికి మళ్ళింది. దాన్ని చూడగానే నా కనుబొమలు ముడిపడ్డాయి.

దానిమీద చిన్నా పెద్దా సీసాలూ, గాజుభరిణలూ పేర్చి వున్నాయి. సీసాలనిండా రంగురంగుల ద్రావకాలూ, చూర్ణాలూ నిండి వున్నాయి. గాజు భరిణెల్లో పాములూ, వివిధ జాతుల తేళ్ళూ, జెర్రులూ కదులుతున్నాయి.

"వీటిద్వారానే వాడు ఏదో కొత్తరకం విషం తయారు చేస్తుండవచ్చు" అన్నాను. అదేక్షణంలో ఏదో శబ్దం వినిపించి ముగ్గురం ఉలిక్కిపడ్డాం!

"బీప్... బీప్... బీప్... బీప్... టక్!" అనే శబ్దం వినిపిస్తూంది గదిలోంచి. ఏమిటా అని చుట్టూ చూసేను. శబ్దం ఆగకుండా వినిపిస్తూనే వుంది.

రెండు నిమిషాల తరవాత శబ్దం ఎక్కణ్ణించి వస్తూందో నా చెవులు పసిగట్టేయి. మంచంవైపు నడిచేను. చటుక్కున వంగి కింద చూసేను. ఏదో ఎత్తుగా కనిపిస్తూంది. దానిమీద నల్లని ఎలుగుబంటి చర్మం కప్పివుంది.

చేత్తో చర్మాన్ని తొలిగించేను.

అది ట్రాన్స్‌మీటర్!

శక్తివంతమైన మాడ్రన్ ట్రాన్స్‌మీటర్!!

అంతవరకూ వినిపిస్తున్న శబ్దం ఇప్పుడు హఠాత్తుగా ఆగిపోయింది.

దిగ్భ్రాంతితో మా మస్తిష్కాలు క్షణం పనిచెయ్యలేదు.

"ఒక ఆటవిక జాతి మాంత్రికుడి దగ్గర ఇటువంటి ట్రాన్స్మిటర్ ఉందంటే, తప్పకుండా ఇక్కడేదో మిస్టరీ వుంది" అన్నాడు డేవిడ్.

నా బుర్ర చురుకుగా పనిచెయ్యసాగింది. "డేవిడ్! నీ అంచనా సరైనదే. భారుంగా పైకి కనిపిస్తున్నట్టు ఆటవిక మాంత్రికుడు కాడు. మాంత్రికుల దగ్గర విదేశీ మత్తు పానీయాలూ, అధునాతనమైన ట్రాన్స్మిటర్ వుండవు. వాడు మన శత్రుదేశ గూఢచారి అయ్యుంటాడని నా అనుమానం!"

"నిర్జనమైన ఈ దీవిలో రహస్యాలంటూ ఏమున్నాయని శత్రుదేశం గూఢచారిని పంపింది?"

"మనకు తెలియని రహస్యమేదో తప్పక ఉండి ఉంటుంది. లేకుంటే ఒక గూఢచారి ఇక్కడ తిష్ట వేసే అవసరం లేదు. ఆ వివరాలేవో భారుంగా ద్వారానే రాబట్టాలి. బహుశా, డోంగా, బాసోల చెయ్యికూడా ఇందులో వుండవచ్చు. భారుంగాతో బాటు వాళ్ళనీ అరెస్ట్ చెయ్యకపోవడం మన పొరబాటు.

వాళ్ళిప్పుడు స్వేచ్ఛగా తిరుగుతున్నారు. ఈ ట్రాన్స్మిటర్ ద్వారా వాళ్ళు ఎవ్వరితోనూ మాట్లాడకుండా, మనం దీట్లోంచి ఓ పార్ట్ ఊడదియ్యాలి!" అంటూ జేబులోంచి తాళంచెవుల గుత్తితీసి, గుత్తిలో వున్న చిన్న చాకుతో ట్రాన్స్మిటర్ కవర్ స్క్రూలు తీసేను. లోపల చిన్నచిన్న పరికరాలూ, వైర్లూ వలలా పేర్చి వున్నాయి. వాటిలోంచి కేప్సూల్ వంటి చిన్న పరికరం తీసి జేబులో వేసుకున్నాను.

ట్రాన్స్మిటర్ని యధాతథంగా బిగించి, దాని మీద

చర్మాన్ని కప్పి లేచాను. ఇంకేమైనా వస్తువులు కనిపిస్తాయేమోనని గుడిసె అంతా వెదికాం. ఏమీ లేవు.

"ఆల్ రైట్! లెటస్ గో!" అంటూ బైటికి నడిచేను.

చీకటి పడే వేళకి భవనం చేరుకున్నాం.

అప్పటికే షాంగో తన భార్యా పిల్లలతో సర్వెంట్ క్వార్టర్‌కు మకాం మార్చేడు.

"ఆ గుడిసె కంటే యిక్కడ చాలా బాగుంది సార్!" అన్నాడు ఆనందంగా.

లాకప్ గదివైపు వెళ్ళి భారుంగాను చూశాం. ఓ మూల కూర్చుని ఆలోచిస్తున్నాడు. బూట్సుల శబ్దం విని తలెత్తి గండుపిల్లిలా మా వైపు చూడసాగేడు.

"వీడికి తినడానికేమైనా ఇవ్వమంటారు?" అడిగేడు డేవిడ్.

"వద్దు! ఈ రోజు యిలాగే ఎండబెట్టి, రేపు ఉతికి ఆరేద్దాం!" అన్నాను.

ఆ రాత్రి నిన్నటిలా మళ్ళీ డప్పుల మోత వినిపించసాగింది!

అందరం భోజనాలు కానిచ్చి పక్కమీద వాలాం.

# 8

ఎవ్వరో బిగ్గరగా ఏడుస్తున్నట్టు వినిపించడంతో మగత నిదరలోంచి చటుక్కున కళ్ళు తెరిచేను. భవనం వెనకవైపు నుంచి వస్తోంది శబ్దం.

లేచి కూర్చుంటూ రిస్టువాచీ చూసుకున్నాను. రాత్రి రెండు గంటలు!

ఆలోగా డేవిడ్, జైరాజ్ కూడా కళ్ళు తెరిచేరు.

"ఏమిటో చూద్దాం పదండి!" అంటూ మంచం దిగేను.

అందరం రివాల్వర్స్, టార్చిలైట్లు అందుకుని భవనం వెనక్కి పరిగెత్తాం.

అక్కడ కనిపించిన దృశ్యం మమ్మల్ని దిగ్భ్రాంతుల్ని చేసింది!

సర్వెంట్ క్వార్టర్లో వున్న షాంగో క్వార్టర్ ఇవతల శూన్యంలోకి చూస్తూ నిదరలో నడిచే రోగిలా భవనం వెనక్కి వెళ్ళే గేటువైపు పోతున్నాడు. అతని భార్యా పిల్లలు భయంతో ఏడుస్తూ నిల్చునున్నారు. మా అడుగుల శబ్దం విని కూడా షాంగో యిటు తిరిగి చూడలేదు. శూన్యంలోకి చూస్తూ గేటుని సమీపించి, కొక్కెం తెరిచి అవతలికి వెళ్ళేడు.

"మీ రెందుకేడుస్తున్నారు? షాంగోకేమైంది?" అడిగేను షాంగో భార్యను.

"అర్ధరాత్రి ఏదో చప్పుడైతే నా నిదర మేలుక్కుంది. నా భర్త తెరిచివున్న కిటికీలో నిల్చుని ఎవ్వరితోనో మాట్లాడుతున్నాడు. తరువాత నెమ్మదిగా తలుపు తెరుచుకుని బైటకెళ్ళాడు. నేనెంత పిల్చినా ఆగడం లేదు. నాకు భయం వేసి ఏడుస్తున్నాను..." అంది ఆమె వెక్కిళ్ళు పెడుతూ.

"డేవిడ్! షాంగోను ఎవ్వరో హిప్నాటయిజ్ చేసి ఎక్కడికో రప్పించుకుంటున్నారు. పదండి" అంటూ గేటుగుండా అతను వెళ్ళినవైపు పరుగు తీశాను. ఆ వైపంతా చెట్లూ, చేమలూ నిండివున్నాయి. వాటిలో పడి ముక్కుకు సూటిగా సాగిపోతున్నాడు షాంగో. ఏం జరుగుతుందో చూద్దామని అందరం అతని వెనకే నడవసాగాం.

కొద్ది దూరం వెళ్ళేక, సడన్‌గా కుడివైపు పొదల్లో ఎవ్వరో కదిలిన చప్పుడు వినిపించింది నాకు.

ఇంకేమీ ఆలోచించకుండా పిస్తోలు అటు గురిపెట్టి వరసగా రెండు సార్లు ట్రిగ్గర్ వత్తేను.

"ఢాం! ఢాం!!"

పొదల్లోంచి గావుకేక వినిపించడం, షాంగో ఉలిక్కిపడి వెనుదిరగడం ఒకేసారి జరిగేయి.

"ఏం జరిగింది? నేనిక్కడికెలా వచ్చేను?" అన్నాడు షాంగో చుట్టూ ఆశ్చర్యంగా చూస్తూ.

"చెబుతాను. ముందా పొదల్లో ఎవరున్నారో చూద్దాం పద!" అంటూ టార్చి ఫోకస్‌లో అటు పరుగు తీసేను.

పొదల మధ్య బోర్లా పడుంది ఓ ఆకారం! గుండు తొడలో తగిలింది. రంధ్రంలోంచి కారుతోంది రక్తం. చేతులు బార్లా చాపివున్నాయి. కుడి చేతిలో వెడల్పాటి చురకత్తి మెరుస్తోంది.

డేవిడ్, బోర్లా పడున్న అతన్ని వెల్లకిలా తిప్పేడు. దిగ్భ్రాంతితో మా నోళ్ళు తెరుచుకున్నాయి.

అతనెవరో కాదు అబ్దుల్!

"కాఛా...కాఛా...!" అన్నాడు షాంగో.

"ఇతన్ని గుర్తు పడతావా?"

"ఔను సార్! ఊళ్ళో యితని దుకాణం వుందేది!"

"నువ్వు ఇల్లు విడిచి దేనికి బైటకొచ్చావ్?"

"భార్యాపిల్లలతో ఇంట్లో నిదరబోతున్నాను. కిటికీలోంచి ఎవ్వరో పిలిచినట్టయి లేచి కిటికీ దగ్గర కెళ్ళేను. అంతే! ఆ తరవాత ఏం జరిగిందో నాకు తెలీదు.

సాలోచనగా తలూపుతూ అబ్దుల్ పల్స్ చూసేను. నార్మల్ గా కొట్టుకుంటోంది. గుండు తగిలి కేవలం స్పృహ తప్పింది.

అతన్ని మోసుకుని అందరం భవనం చేరుకున్నాం.

ఫస్ట్ ఎయిడ్ బాక్స్ తెప్పించి, అతని తొడలో దిగిన గుండు తీసి, కట్టుకట్టి సోఫాలో పడుకోబెట్టేను.

“ఇదంతా ఏమిటో బొత్తిగా నాకు అర్థం కావడం లేదు. అబ్దుల్ కు షాంగోను చంపే అవకాశం ఏమొచ్చింది? క్వార్టర్లో నిదురబోతున్న షాంగోను కిటికీ దగ్గరికి ఎవ్వరు పిలిచేరు? అతను ఒళ్ళు తెలియని స్థితిలో బైటికెందుకు వెళ్ళేడు? మళ్ళీ అకస్మాత్తుగా మామూలు స్థితికెలా వచ్చేడు?” అన్నాడు డేవిడ్ అయోమయంగా.

సిగరెట్ అంటించేను. “నాకు దాదాపు అర్థమయింది. షాంగో మన దగ్గర పని జెయ్యడానికి ఒప్పుకుని పెళ్ళాం పిల్లలతో ఇటు మకాం మార్చేడు. దాంతో భారుంగా, డోంగా, బాసోలు అతన్ని హతమార్చడానికి ఈ ప్లాన్ వేసి వుంటారు.

ఇక్కడి ప్రజలు మనదగ్గిర పనిచెయ్యడం వాళ్ళకిష్టం లేదు. షాంగోను హతమారిస్తే ప్రజలు హడలిపోయి మళ్ళీ మన ఛాయలకి రారు. వారిక్కావలసింది అదే!

అందుకే షాంగోను చంపడానికి, అబ్దుల్ ను వాడుకున్నారు. ముందే హిప్నాటయిజ్ స్థితిలో ఉన్న అబ్దుల్ వాళ్ళ ఆదేశానుసారం కత్తితో ఆ పొదలదగ్గిర నిల్చున్నాడు.

తరవాత, క్వార్టర్లో నిదరబోతూన్న షాంగోను కిటికీ దగ్గిరికి పిలిచి అతన్ని హిప్నాటయిజ్ చేసి, అబ్దుల్

పొంచివున్న పొదల దగ్గిరికెళ్ళమని ఆజ్ఞాపించేరు. అదృష్టవశాత్తు సమయానికి మనం రంగంలో దిగడం వల్ల పాంగో బ్రతికిపోయేడు...''

# 9

సోఫాలో పడున్న అబ్దుల్ కొద్దిగా కదిలి మెల్లిగా కళ్ళు తెరిచాడు. అదే క్షణంలో మరో విచిత్రం జరిగింది.

ఇటు అబ్దుల్ కళ్ళు తెరవగానే, అప్పటివరకూ దూరాన లీలగా వినిపిస్తున్న డప్పుల శబ్దం ఆగిపోయింది!

చుట్టూవున్న మమ్మల్ని విచిత్రంగా చూస్తూ—''ఎవరు మీరు? నేనెక్కడున్నాను?'' అంటూ లేచి కూర్చు న్నాడు అబ్దుల్.

అందరం ఒకరి మొహాలొకరం చూసుకున్నాం. అంత వరకూ నిర్జీవమైన యంత్రంలా మసలిన అబ్దుల్ ఇప్పుడు మాట్లాడుతున్నాడు!

''నీవిప్పుడు ప్రభుత్వ భవనంలో ఉన్నావ్. ఇంత క్రితం నన్నెక్కడైనా చూసినట్టు గుర్తుందా?'' అడిగేను.

అబ్దుల్ తల అడ్డంతిప్పి-''నో! ఇప్పుడే చూస్తు న్నాను.'' అన్నాడు.

''సాయంత్రం నీవు చెరకుతోటలో పనిచేస్తున్నప్పుడు నిన్ను పలకరించాం. గుర్తులేదా?''

''చెఱకు తోటలోనా? అక్కడ నాకేం పని?''

''మరి ఆ సమయంలో ఎక్కడున్నావ్ నువ్వు?''

''నా దుకాణంలో వున్నాను. చీకటి పడేవేళ బాసో వచ్చి స్నేహంగా పనసపండు ఇస్తే తిన్నాను!

అంతే, తరవాతేం జరిగిందో నాకు తెలీదు. ఇక్కడికెవరు తీసుకొచ్చారు?''

''ఆ విషయాలన్నీ తరవాత వివరంగా చెబుతాను. ముందు నువ్వు బాగా రెస్టు తీసుకో. డేవిడ్! ఇతనికి ఓ నిద్రమాత్ర ఇచ్చి పడుకోబెట్టు'' అన్నాను.

డేవిడ్ మెడికల్ ఛెస్ట్‌లోంచి గార్డినాల్ మాత్ర తీసి అబ్దుల్ చేత తినిపించి, పడగ్గదిలో పడుకోబెట్టి వచ్చేడు.

''సార్! నాకంతా అయోమయంగా వుంది. అబ్దుల్ కాఫా కాదన్నారు. హిప్నాటయిజ్ చెయ్యబడ్డాడన్నారు. మరి ఇంతకాలం హిప్నాటిజం ప్రభావంలో వున్న అతను ఇప్పుడు అకస్మాత్తుగా మామూలు స్థితికెలా వచ్చేడు?'' అన్నాడు జైరాజ్ ఆశ్చర్యంగా.

''హిప్నాటిజం థియరీ దృష్ట్యా, దాని ప్రభావమంతా కళ్ళద్వారా మెదడుకు జేర్చబడుతుంది. మనిషి కార్యకలాపాలని ఆజ్ఞాపించేది మెదడేకదా? హిప్నాటయిజ్ చెయ్యబడ్డ మెదడు పూర్తిగా దాని ప్రభావానికి లోనై, ఇతర విషయాలన్నీ మరిచిపోయింది. అకస్మాత్తుగా ఆ మెదడుకు ఏదైనా షాక్ తగిలిందంటే, మళ్ళీ ఆ మనిషి మామూలు స్థితికి వస్తాడు.

అబ్దుల్ విషయంలోనూ సరిగ్గా అదే జరిగింది. ఇంత వరకూ హిప్నాటిజం ప్రభావానికి లోనైవున్న అతని మెదడు, నేను పేల్చిన పిస్తోలు గుండు శరీరంలో దిగబడేసరికి, సడన్‌గా షాక్ తిని ఆ ప్రభావాన్ని తక్షణం వదిలేసింది.''

డేవిడ్ రిస్టువాచీ చూసుకుని_''మూడున్నరయింది.

ఇహ మనకు ఓ పట్టాన నిద్దరపట్టదు. సమయం దేనికి వృథా చెయ్యాలి? ఆ భూగృహంగా వెధవని చితకబాది, నిజానిజాలు తెలుసుకుంటే?'' అన్నాడు.

''ఔను సార్. నాకూ చాలా క్యూరియస్‌గా వుంది. ఈ విచిత్రాలన్నీ వాడినోట వినాలని'' అన్నాడు జైరాజ్.

''సరే! పదండి'' అంటూ లేచాను.

అందరం భవనం వెనక్కి నడిచాం. జైలు గది ముందాగి, కటకటాలగుండా టార్చి ఫోకస్ లోనికి వేశాను.

గది ఖాళీ!

అందులో బంధించిన భూగృహంగా మాయం!!

క్షణంపాటు అందరం స్థాణువుల్లా నిల్చుండిపోయాం. తలుపు గడియకి వేళ్ళాడుతున్న తాళం మేమెలా వేశామో అలాగే వుంది. వేసిన తాళం వేసినట్టుండగా లోపలి వ్యక్తి ఎలా మాయమయ్యేడు? ఆ తలుపు తప్ప గదిలో చిన్న కిటికీ కూడా లేదే?

గిరగిర తిరుగుతున్న నా బుర్రలో సడన్‌గా ఓ ఆలోచన తళుక్కుమంది. ''మీరనవసరంగా ఖంగారు పడకండి. వాడిక్కణ్నించి ఎలా మాయమయ్యేడో నాకర్థమైంది. సాధారణంగా ప్రతితాళానికీ రెండేసి తాళం చెవులుంటాయి. మనం భూగృహాను బంధించడానికి తాళం చెవులకోసం బీరువా వెతికితే ఒక్కే ఒక తాళం చెవి దొరికింది!

వాడి అనుచరులు దొంగా, బాసోలు ఎంతోకాలం ఇక్కడ నివసించేరు. వాళ్ళే ఆ రెండో తాళం చెవి

కాజేసి ఉంటారు సమయానికి పనికి వస్తుందని. చీకట్లో దొంగ చాటుగా వచ్చి ఆ తాళం చెవితో వాళ్ళే భారుంగాను విడిపించుకు పోయివుంటారు.

దీన్నిబట్టి ఆలోచిస్తే, క్వార్టర్స్లో నిదరబోతున్న షాంగోను కిటికీదగ్గర నిల్చుని లేపి, అతన్ని హిప్నొటయిజ్ చేసింది భారుంగాయే అనిపిస్తోంది.'' అన్నాను.

ఊహించని ఈ హఠాత్పరిణామంతో మాలో ఉత్సాహం సన్నగిల్లింది. ఉస్సూరుమంటూ తిరిగి భవనంలోకెళ్ళి కూర్చున్నాం. సిగరెట్లు అంటించి తీవ్రాలోచనల్లో నిమగ్నమయ్యాం.

ఉన్నట్టుండి చటుక్కున నిశ్శబ్దాన్ని ఛేదించేడు డేవిడ్.

''సార్! ఇంతవరకూ మనం ఒక విషయాన్ని విస్మరించాం!''

''ఏమిటది?''

''భారుంగా అంత పెద్ద చెఱకు తోటలు పెంచుతున్నాడు కదా? ఆ చెఱకుపంటని ఏంచేస్తాడు?''

''ఏం చేస్తాడో నాకు తెలుసు!'' అన్నాడు షాంగో వెంటనే.

''నేనింతవరకూ ఈ మోటివ్ మీద ఆలోచించనేలేదు. సమయానికి గుర్తుచేశావు ... ఏంచేస్తాడు?'' అడిగేను షాంగోను.

''ఆ పంటనంతా అడవిమధ్యకి తరలించి చెఱకు రసం తీసి చక్కెర తయారుచేస్తారు!''

''మైగాడ్! ప్రభుత్వానికి తెలియకుండా వాడిక్కడ

షుగర్ ఫ్యాక్టరీకూడా తెరిచాడా?" అన్నాడు డేవిడ్ని వ్వెరబోతూ.

"ఆ ఫ్యాక్టరీ ఎక్కడుంది?"

"అడవి మధ్య చిన్న మైదానం వుంది. ఆ మైదానం మూడువైపులా ఎత్తైన కొండలున్నాయి. అక్కడ!"

"వెల్! తెల్లారేవరకూ మనం కాస్త ఓపికపట్టాలి. తెల్లారగానే బైలుదేరి ఆ ఫ్యాక్టరీ సంగతి చూద్దాం" అన్నాను ఆలోచిస్తూ.

# 10

సూర్యోదయం కాగానే, అబ్దుల్నూ, మిగతా సిబ్బందినీ భవనంలోనే ఉండమని చెప్పి, నేనూ, డేవిడ్, జైరాజ్, షాంగో బైలుదేరాం.

ప్రతి ఒక్కరి దగ్గిరా గుళ్ళు నిండిన పిస్తోళ్ళు సిద్ధంగా ఉన్నాయి. షాంగో మాకు దారి చూపిస్తున్నాడు.

పన్నెండు గంటల ప్రాంతంలో ఓ కొండప్రదేశానికి చేరుకున్నాం.

"అదుగో, అక్కడే!" అన్నాడు షాంగో.

బైనాక్యులర్స్ లోంచి అతను చూపినవైపు చూసేను. దూరాన చిన్న మైదానంలాటి లోయ కనిపిస్తోంది. దాని మూడువైపులా మూడుకొండలు కోటగోడల్లా లేచి వున్నాయి. ఓ కొండకి ఆనుకుని చిన్న బిల్డింగ్ కట్టి వుంది. మైదానంలో చెల్లాచెదురుగా చెక్కపెట్టెలు పేర్చివున్నాయి. ఒకో్క పెట్టె దగ్గిర యిద్దరు ముగ్గురు మనుషులు నిల్చుని ఏదో పనిచేస్తున్నారు.

"కమాన్, మూవ్!" అంటూ ముందుకి నడిచేను.

పొదలమాటున నక్కుతూ, జాగ్రత్తగా చుట్టూ చూస్తూ మైదానాన్ని సమీపించి ఆగిపోయాం. ఓ దిబ్బ మాటున నక్కి చూడసాగేము. మైదానంలో పనిచేస్తున్న మనుషులు మన్నుతిన్న పాముల్లా, యంత్రాల్లా పనిచేస్తున్నారు.

"వాళ్ళు కాఫాలు!" అన్నాడు పాంగో భయంగా.

"ఆ పెట్టెల్లో ఏముంది?" అడిగేడు డేవిడ్.

"అదే తెలుసుకోవాలి! పదండి. వాళ్ళు హిప్నాటయిజ్ చెయ్యబడ్డ మనుషులు. మన ఉనికి వాళ్ళకి తెలియదు." అంటూ దిబ్బ చాటునించి కదిలేను.

ఒకరి వెనక ఒకరం అప్రమత్తంగా మైదానంలోకి నడిచాం. మాకు పది గజాల దూరంలో, ముగ్గురు వ్యక్తులు ఓ పెట్టె మూత బిగించి మేకులు కొడుతున్నారు. వాళ్ళని సంబోధించి—"హలో!" అన్నాను.

వాళ్ళు తిరిగి చూడలేదు! వినిపించనట్టు తమ పనేదో చేసుకుపోతున్నారు.

ఇంతలో బిల్డింగ్ వైపునించి నలుగురు వ్యక్తులు, తోపుడు బండిమీద ఓ పెట్టె తోసుకుంటూ అక్కడికి వచ్చేరు. వారూ కాఫాల్లాగే వున్నారు. ఓ చోట బండి ఆపి, పెట్టెదించి తిరిగి యంత్రాల్లా ఖాళీబండి తోసుకుంటూ వెళ్ళిపోయేరు.

ఆ పెట్టెమూత తెరిచి వుంది. "రండి. అందులో ఏముందో చూద్దాం!" అంటూ పెట్టెని సమీపించేను.

పెట్టెలోకి చూడగానే ఆశ్చర్యంతో మా కళ్ళు విప్పారేయి.

పెట్టెనిండా రాళ్ళు! బూడిదరంగు రాళ్ళు!!

"ఈ రాళ్ళతో ఏం చేసుకుంటారు వీళ్ళు?" అన్నాడు జైరాజ్ ఆశ్చర్యంగా.

అదే ఆలోచిస్తున్న నా బుర్రలో తళుక్కుమంది మెరుపు!

"ఇవి మామూలు రాళ్ళుకాదు. వీటిలో ముడి యురేనియం నిండి వుంది. ప్రపంచంలో అతి విలువైనది యురేనియం! ఆటంబాంబులూ, హైడ్రోజన్ బాంబులూ తయారుచెయ్యడానికి మూలాధారమైన ధాతువు ఈ కొండల్లో దాగివుంది.

మన శత్రుదేశమేదో ఈ రహస్యం కనిపెట్టి, స్థానిక ప్రజల్ని మందూ మాకులతో వశంచేసుకుని, యురేనియం తవ్వించి తీసికెళ్తోంది. చెంచులతోటల భాగోతం కేవలం ఇతర్లని మభ్యపెట్టడానికే!

బహుశా వాళ్ళు ఆ శత్రుదేశానికి సహాయపడుతున్న దేశద్రోహులు. బూటకపు మంత్రాలతో, స్థానిక ప్రజల్లో భయాలురేపి, వాళ్ళని తమ వశం చేసుకున్నారు. ఈ రహస్యం ఎక్కడ బైటపడుతుందోనని, వచ్చిన గవర్నర్ల నందర్నీ మట్టుబెడుతున్నారు.

"మరి తవ్వడం ఎక్కడ జరుగుతున్నట్టు? చుట్టుపక్క లెవ్వరూ కనిపించడం లేదే?"

"ఈ పెట్టె ఇప్పుడే ఆ బిల్డింగ్ లోంచి వచ్చింది. అంటే, కొండనానుకుని వున్న ఆ బిల్డింగ్ లోనే సొరంగం వుండి వుంటుంది! అక్కడే తవ్వకం జరుగుతూండవచ్చు."

"మైగాడ్! ఇంత పకడ్బందీగా ప్రాజెక్ట్ తయారు చేశారా? ఐతే, అక్కడ చాలామందే వుండివుంటారు. ఇంజనీర్లు లేందే తవ్వకం పని జరగదు. ఇప్పుడేం చేద్దాం?

మనం అంతమందిని అదుపులోకి తీసుకోగలమా?"

"ఈ కాఛాలతో బాటు మనంకూడా కలిసి పనిచేస్తూ అవకాశంకోసం వేచివుండాలి. ఈ పెట్టెచుట్టూ నిల్చుని పనిచేస్తూ నటించండి. ఈసారి బండిలో పెట్టె తీసుకుని ఎవ్వరైనావస్తే వాళ్ళనించి ఆ బండి లాక్కుని బిల్డింగ్‌లో ప్రవేశించాలి" అన్నాను.

మైదానంలో వున్న మిగతా కాఛాలు మాతో ఎలాంటి నిమిత్తం లేనట్టు యంత్రాల్లా పనిలో నిమగ్నమై వున్నారు. మేం నలుగురం ఆ పెట్టెచుట్టూ చేరి మేకులు కొడుతున్నట్టు నటించసాగేము.

ఇంతలో బిల్డింగ్ వైపునించి నీలిరంగు యూనిఫాం వేసుకున్న ఓ వ్యక్తి మైదానంవైపు వస్తూ కనిపించేడు. అతని చేతిలో హంటర్ వుంది. దడదడలాడుతున్న గుండెలో ఊపిరి బిగబట్టి ఓరగా అతన్ని చూడసాగేను. ఆ వ్యక్తి గుర్తుపట్టగలిగేటంత దగ్గరికి రాగానే, నా నరాలు షాక్ తగిలినట్టు ఝల్లుమన్నాయి.

అతను స్థానిక పౌరుడు కాడు! చైనీయుడు!!

మైదానంలో నిల్చుని గట్టిగా ఈల వేసేడు. మరుక్షణం పనిలో నిమగ్నమై వున్న కాఛాలంతా అతనివైపు తిరిగేరు. ఆ ఈల వారి మస్తిష్కాలపై సిగ్నల్‌లా పని చేస్తుందన్నమాట!

ఆ చైనీయుడు అందర్నీ సంబోధిస్తూ గట్టిగా అరిచేడు_ "అఖరి నాలుగు పెట్టెలు రాబోతున్నాయి. వాటి పని పూర్తిచేసి మీరంతా మీ షెడ్‌లోకెళ్ళి పడుకోవాలి. అర్థమైందా? పడుకోవాలి...పడుకోవాలి...పడుకోవాలి!" నాలుగైదుసార్లు చివరి వాక్యాన్ని నొక్కి చెప్పేక, కాఛాలందరూ మెల్లగా తలలూపేరు.

తరవాత, ఆ చైనీయుడు బిల్డింగ్ వైపు వెళ్ళిపోయేడు.

పది నిమిషాలు గడిచేక తోపుడు బండి వస్తూ కనిపించింది.

సిద్ధంగా వుండమన్నట్టు నా అనుచరులకి సైగ చేసేను. బండిని నలుగురు కాఫ్రాలు తోసుకుంటూ వస్తున్నారు. వాళ్ళు మైదానంలోకి రాగానే, గబగబ బండిని సమీపించి దాంట్లో వున్న పెట్టెలుదించి, కాఫ్రాల చేతుల్లో మేకులు వుంచి, బండితోసుకుంటూ బిల్డింగ్ వైపు కదిలాం.

బిల్డింగ్ లోపల అంతగా వెలుతురు లేదు. ఓ నడవాగుండా ముందుకు నడుస్తున్నాం. నడవాకి కిరుపక్కలా గదులు కట్టివున్నాయి. తలుపులు మూసివున్నాయి. మా జేబుల్లో సేఫ్టీకాచ్ లు లాగివున్న పిస్తోళ్ళు సిద్ధంగా వున్నాయి. ఏ క్షణంలో ప్రమాదం ముంచుకు వచ్చినా, వాటిని తియ్యడం, పేల్చడం ఒకేసారి జరగాలి.

కొద్ది దూరంలో నడిచేమో లేదో, హఠాత్తుగా ఓ గది తలుపు తెరుచుకుంది. ఓ వ్యక్తి ఇవతలికి వచ్చేడు. నా గుండె గతుక్కుమంది!

అత నెవరో కాదు. భాఋంగా!

అతని దృష్టి మా మీద పడకుండా, తలలు దించుకుని బండి తొయ్యసాగాం. భాఋంగా మమ్మల్ని గమనించకుండా గబగబ వచ్చిన గది కెదురుగా ఉన్న గది తలుపు తెరుచుకుని లోనికెళ్ళేడు. తలుపు తిరిగి మూసుకుంది.

"కమాన్!" అంటూ ఆ గదివైపు పరుగుతీసేను.

బండి వదిలి, జేబుల్లోంచి పిస్తోళ్ళు లాగి అందరూ నా వెనక వచ్చేరు. ఆ తలుపు కీహోల్ మధ్య కన్నుపెట్టి లోనికి చూసేను.

లోపల భారుంగాతో బాటు ఫుల్ సూట్లలో వున్న ఇద్దరు చైనీయులువున్నారు.

"అదృష్టవశాత్తూ ఆ జైలు తాళం చెవి ఒకటి మా దగ్గరున్నందువల్ల నేను తప్పించుకు రాగలిగేను. ఇంతకి ముందు వచ్చిన గవర్నర్లకంటే, వీళ్ళు చాలా ప్రమాద కరంగా కనిపిస్తున్నారు. సాధ్యమైనంత త్వరగా వీళ్ళ నేదో చెయ్యకపోతే మన బండారం బద్దలుకొట్టేలా వున్నారు" అంటున్నాడు భారుంగా.

"వాళ్ళకి మనగురించి తెలిసే అవకాశంలేదు. స్థానిక ప్రజలంతా మన హిప్నాటోన్ మందు ప్రభావంలో వున్నారు. వచ్చిన చిక్కల్లా, మాజీ గవర్నర్లని చంపినట్టు వీళ్ళనీ చంపేస్తే భారత ప్రభుత్వానికి అనుమానం బల పడుతుంది, ఇక్కడేదో మిస్టరీ వుందని. అప్పుడిక్కడికి మిలిటరీని పంపితే మనం తప్పించుకోలేము," అన్నాడు ఓ చైనీయుడు.

"ఐతే, వీళ్ళ పీడ ఎలా విరగడచేద్దామంటారు?"

"ఓ ఉపాయం వుంది. వాళ్ళను చంపకుండా, మన హిప్నాటోన్ మందును కాస్త ఎక్కువ మోతాదులో తాగించి భవనంలోనే ఉండనివ్వాలి. అప్పుడు భారత ప్రభుత్వానికి ఎలాటి అనుమానం రాదు. ఆ మందు ప్రభావంవల్ల వాళ్ళు మనం చెప్పినట్లు వుంటారు!" అన్నాడు రెండో చైనీయుడు.

"ఉపాయం బాగానే వుంది. కాని, వాళ్ళచేత మందెలా తాగించాలి?" అడిగేడు భారుంగా.

"ఆ పనేదో నువ్వే ఆలోచించు!"

భారుంగా ఏదో అనబోయేడు. సరిగ్గా అదే క్షణంలో

మా వెనక అడుగుల శబ్దం వినిపించింది. "ఏయ్! ఏం చేస్తున్నారక్కడ?"

అందరం గిరుక్కున వెనుదిరిగాం.

డోంగా, బాసోలు!

"జైరాక్! నువ్వూ, షాంగో వాళ్ళని చూసుకోండి. డేవిడ్! కమాన్." అని అయస్తూ బూటుతో తలుపుతన్ని లోని కురికేను.

భారుంగాతో బాటు ఇద్దరు చైనీయులూ ఉలిక్కిపడి ఇటు తిరిగేరు.

ఆ చైనీయుల్లో చలనం రాకముందే, నా పిస్తోలు రెండు సార్లు పేలింది. తిన్నగా వెళ్ళి వారి భుజాల్లో తిష్ట వేసేయి గుళ్ళు! ఎలా కూర్చున్నారో అలాగే అతుక్కుపోయేరు కుర్చీలకి.

ఆ రెప్పపాటు వ్యవధిలో భారుంగా చిరుతలా డేవిడ్ మీదికి లంఘించేడు. వాడింకా గాలిలో ఉండగానే డేవిడ్ పిస్తోలు పేలింది. భారుంగా ఎలా ఎగిరేడో అలాగే కిందకూలేడు. చైనీయులిద్దరూ తోకతొక్కిన తాచుల్లా బుసలు కొడుతూ చూస్తున్నారు మమ్మల్ని.

"ఇద్దరూ లేచి నిల్చోండి," అన్నాను పిస్తోలు ఊపుతూ.

బుద్ధిగా లేచి, చేతులెత్తేరు.

"మా ప్రశ్నలకీ సరైన జవాబులివ్వాలి. లేకుంటే, వాడికి పట్టిన గతే మీకూ పడుతుంది! ఈ బిల్డింగ్‌లో మీ మనుషులు ఎంతమందున్నారు?" అడిగేను.

"నూట యాభైమంది! అందులో నలుగురు ఇంజనీర్లు" అన్నాడొకడు.

"వాళ్ళంతా ఎక్కడున్నారు?"

"సారంగంలో!"

"ఇద్దరూ చేతులెత్తి అలాగే బైటకి నడవండి. ఏమాత్రం పిచ్చివేషాలు వేసినా, మీ శరీరాలు జల్లెడ అవుతాయి జాగ్రత్త!" అన్నాను ట్రిగ్గర్ మీద వేలు పెడుతూ.

ఇద్దరూ తలుపువైపు నడిచేరు. వాళ్ళని కవర్ చేస్తూ కదిలొంచి బైటపడ్డాం. నడవాలో డోంగా, బాసోల శవాలు పడున్నాయి. జైరాజ్, షాంగో వారి దుస్తులు సోదా చేస్తున్నారు.

"జైరాజ్! ఈ ప్రాజెక్ట్ నాయకులైన ఈ ఇద్దరూ ఇప్పుడు మన బందీలు. వీళ్ళని ప్రభుత్వ భవనానికి తీసి కెళ్ళి, సాధ్యమైనంత త్వరగా ట్రాన్స్‌మీటర్ ద్వారా మిలిటరీ ట్రూప్స్‌ని పిలిపించాలి" అన్నాను హిందీలో.

నలుగురం ఆ ఇద్దరు చైనీయులని కవర్ చేస్తూ, గబగబ ప్రభుత్వ భవనం చేరుకున్నాం.

ఆ చైనీయులని బంధించి, తక్షణం మిలిటరీ దళాలని పంపవలసిందిగా, ట్రాన్స్‌మీటర్ ద్వారా మద్రాసు అధి కారుల్ని కోరాం.

చీకటిపడే వేళకి పేరాట్రూప్ దళాలు విమానాలలో దిగేయి. మా పర్యవేక్షణలో దీవిని చుట్టుముట్టేయి.

ఆ విధంగా, ఇన్నాళ్ళూ నిరుపయోగకరమైనదని తాత్సారం చెయ్యబడ్డ ఆ దీవి, అమూల్యమైన నిక్షేప్తాన్ని అందించింది!

—: ఐపోయింది :—

# హతుడు - హంతకుడు

కె. బి. ఎస్. కుమార్

మరోసారి టైమ్ చూసుకున్నాడు డిటెక్టివ్ జలంధర్.

పదిగంటలు దాటి ఐదు నిముషాలు కావొస్తూంది. 'ఈ అమ్మాయి ఇంకా రాలేదేమిటి చెప్మా?' అనుకున్నాడు మనసులోనే. అసహనంగా అటూ యిటూ కదిలాడు.

'...తను పొరపాటుగా విన్లేదు కదా!...ఊహుఁ... ఏ విషయాన్నైనా ఒక్కసారి వింటేచాలు. నిద్దరలో లేపిఅడిగినా అక్షరమ్ముక్క పొల్లు పోకుండా కరక్టుగా చెప్పెయ్యగలదు తను...మరైతే పదిగంటలు దాటినా ఆమె యింకా ఎందుకు రాలేదు??

ఎంత ఆలోచించినా అంతు చిక్కలేదు. ఈ దయం జరిగింది అతని మస్తిష్కంలో లీలగా మెదిలింది.

ఆ ఉదయం...

సరిగ్గా ఎనిమిది గంటలకి ఫోను మోగింది. రిసీవరు తనే ఎత్తాడు. ఎవరో అమ్మాయి మాట్లాడుతూ తనతో ఏదో రహస్యంగా మాట్లాడాలనీ సరిగ్గా పదిగంటలకి 'హోటల్ ఎవరెస్ట్'లో 99 వ రూములో తనకోసం వెయిట్ చెయ్యమనీ, ఆ రూమ్ తన పేర బుక్ చేశాననీ, వివరాలు వచ్చాక చెబుతాననీ చెప్పేసి గబుక్కున ఫోన్ పెట్టేసింది.

ఆ అమ్మాయెవరు? ఎలా వుంటుంది?

హోటల్ ఎవరెస్ట్ అంటే మామూలు వాళ్ళు బస చేసేది కాదు. అక్కడ ఒక్కొక్క రూముకి ఒక్కొక్క రోజుకి అద్దె అయిదు వందల రూపాయలు!!

అయిదు వందలంటే మాటలుగాదు. అదీ ఒక్క రోజుకి! అంటే ఆమె బాగా కలవారింటమ్మాయి అయి వుండాలి.

...'టక' 'టక' మని తలుపు చప్పుడు కావటంతో ఈ లోకంలోకి వచ్చి పడ్డాడు డిటెక్టివ్ జలంధర్. తాగుతోన్న సిగరెట్‌ని క్రింద పడవేసి బూటుకాలితో నలిపి, లేచి వెళ్ళి తలుపు తెరిచాడు.

మెరుపు తీగలాంటమ్మాయి గభాలున లోనికొచ్చి వెంటనే తలుపు మూసేసింది. తృప్తిగా గాలి పీల్చుకొని "నేనే మీకు ఫోన్ చేశాను" అంది.

ఆమె నోసారి పరిశీలనగా చూశాడు జలంధర్.

వయసు ఇరవై - ఇరవై రెండు మధ్య వుండొచ్చు. వయసుకి తగ్గ ఎత్తు, ఎత్తుకి తగ్గలావు. ఇంకా పెళ్ళి కాలేదు. మనిషి తెల్లగా, ముట్టుకుంటే మాసి పోయేలా వుంది.

నడుం క్రిందికి వ్రేలాడుతోన్న జడ. నొక్కులజుత్తు. తీర్చి దిద్దినట్టున్న కనుబొమలు. కోటేరులాంటి ముక్కు, సన్నని పెదాలు, పల్చని నిండైన లేత బుగ్గలు. శంఖం లాంటి మెడ, నల్లని చీర, నల్లని జాకెట్ వేసుకున్నందున మరింత తెల్లగా అవుపిస్తోంది.

మొత్తంమీద ఏ చిత్రకారుడో ప్రత్యేక శ్రద్ధతో అత్యంత సుందరంగా గీచిన రేఖా చిత్రంలావుందా అమ్మాయి.

చేష్టలుడిగి నిల్చుండి పోయాడు జలంధర్ - 'ఈ అమ్మాయికి ఓ డిటెక్టివ్‌తో రహస్యంగా మాట్లాడాల్సి నంత అవసరం ఏం వచ్చిందా?' అని తలపోస్తూ.

యాంత్రికంగా ఆమెతోపాటు నడిచి కుర్చీలో కూర్చున్నాడు.

"ఇక చెప్పనా?" అందామె మళ్ళీ.

"చెప్పండి..." అన్నాడు జలంధర్ తనలోని ఆశ్చ ర్యపు తాలూకు భావాలని ప్రక్కకు నెట్టడానికి ప్రయ త్నిస్తూ.

"... నేనో అబ్బాయిని ప్రేమిస్తున్నాను. పేరు ప్రవీణ్ బాబు. రెండు రోజులుగా అతను కన్పించటం లేదు. అతనెక్కడున్నాడో కనుక్కొని నాకుచూపాలి. అడ్వాన్సుగా మీ ఫీజులో యిది జమ కట్టుకోండి." కుడి చేతిలోని వ్యానిటీ బ్యాగ్‌లోంచి ఓ కట్టతీసి టేబుల్‌పై పెట్టిందామె.

జలంధర్ కళ్ళు జిగేలుమన్నాయి. అది వందరూపా యల నోట్ల కట్ట. అంటే పదివేల రూపాయలన్నమాట.

"...మా నాన్నగారు గొప్ప బిజినెస్ మ్యాగ్నెట్.

'శాంతీ ఎలెక్ట్రికల్ గూడ్స్ మ్యానుఫాక్చరింగ్ కంపెనీ' ప్రొప్రైటర్ త్రివిక్రమరావుగారి పేరు మీరు వినే వుంటారు. ఆయనే మా ఫాదర్. 'రేఖా సూయింగ్ ఫ్యాక్టరీ' మాదే! 'హోటల్ త్రివిక్రమ్' ఓనర్ మా నాన్నగారే! విక్రమార్క ఆర్ట్ పిక్చర్స్ ఫిలిమ్ బ్యానర్, విక్రమార్క మోషన్ ఫిల్మ్ డిస్ట్రిబ్యూటింగ్ కంపెనీ కూడా మావే...మా నాన్నగారు మీకు తెలుసను కుంటాను" ఒక్క క్షణం ఆగిందామె.

"తెలీక పోవడమేమిటి? పోయిన్నెల్లో మీ విక్ర మార్క ఆర్ట్ పిక్చర్స్ పతాకం క్రింద మీ నాన్నగారు నిర్మిస్తోన్న తొమ్మిదో చిత్రానికి కెమెరా ఆన్ చేసింది నేనే! చిత్రం పేరు 'ఓ ప్రేమ కథ' అనుకుంటాను."

"కరెక్ట్...అప్పుడు నేను కలకత్తాలో మా చిన్నాన్న గారి వద్ద వున్నాలెండి. మా నాన్నగారు మీకు బాగా తెలుసని నాకు తెల్సు. మా నాన్నగారికి యివికాక యింకా ఎన్నో చిన్న చిన్న వ్యాపారాల్లో పార్ట్నర్ షిప్పులున్నాయి. వీటన్నిట్నీ మేనేజ్ చెయ్యటానికి మేనేజర్లున్నారు. వీళ్ళందరికీ పెద్ద ప్రవీణ్ బాబు."

"అంటే జనరల్ మేనేజరన్నమాట."

"అవును."

"అతన్ని గురించి చెప్పండి."

"చెప్తాను...దాదాపు నాకు పదకొండు-పన్నెండేండ్ల వయసున్నప్పుడు ప్రవీణ్ మాయింటి కొచ్చాడు. తను అనాధ నయ్యానని తండ్రి బ్రతికున్నప్పటివరకూ పియూసీ కంటే ఎక్కువ చదవలేక పోయానని. ఇక చదివే స్తోమత లేదని తనకున్న ఫ్యాక్టరీల్లో ఏదైనా వుద్యోగం

యిప్పించమని మా నాన్నగార్ని ప్రాధేయపడి అడిగాడు.

జాలి గుండెగల మా నాన్నగారు అంగీకరించారు. ఉద్యోగం యిచ్చారు.

"ఉద్యోగం చేసుకుంటూ రాత్రిపూట చదువుకొనేవాడు ప్రవీణ్. చదువుపట్ల అతనికిగల శ్రద్ధ గమనించి మా అమ్మగారు అతన్ని చదువుకోమని ప్రోత్సహించారు. అమ్మద్వారా అతని విషయాలు విన్న మా నాన్నగారు సంతోషపడి స్వంత ఖర్చుతో ఎమ్మెస్సీ వరకూ చదివించారు.

"తన చదువుకి కారణం మా అమ్మగారేనని ఆమెని ఆప్యాయంగా 'అక్కయ్యా' అని పిలిచేవాడు ప్రవీణ్. తప్పిపోయిన తన తమ్ముడే ఆరూపంలో వచ్చాడనుకొని మా అమ్మగారూ అతన్ని ఆదరంగా చూసేవారు. చదువు పూర్తయ్యాక..."

"మిమ్మల్ని ప్రేమించాడా?"

"లేదు. మా నాన్నగారు అతన్ని మా వ్యాపారాలన్నిటికీ జనరల్ మేనేజర్‌గా నియమించారు. ప్రవీణ్ నన్నేనాడూ కోరలేదు. కాని అందమూ, అందాన్ని మించిన తెలివితేటలూ, వాటిని మించిన సమయస్ఫూర్తీ చురుకుదనమూ, అన్నిట్నీ మించిన పాల నురుగులాంటి స్వచ్ఛమైన అతని మనసూ నా హృదయాన్ని లాక్కున్నాయ్! నాకు తెలీకుండానే నా మనసు అతని కంకితమైంది'.'

"ఈ విషయం అతనికి తెల్సా?"

"అప్పుడే తెలీదు. మా అమ్మను 'అక్కయ్యా' అని

పిలుస్తూ మా కుటుంబంలో తనూ ఒకడుగా కలిసి పోయి నట్టు అతడు ప్రవర్తిస్తున్నా అతని ఎదుట నిలవాలంటే నా కళ్ళు వణికేవి. ఏదో తెలియని సిగ్గు, భయం ముంచుకు రాగా అతడు కనబడగానే అవతలికి పరుగు తీసేదాన్ని బహుశా దాన్నే "ప్రేమ" అంటారేమో!

'...ఆలోచించి ఆలోచించి" అతన్ని నేను ప్రేమి స్తున్నాను, అని బాగా దృఢ పరచుకున్నాను. అతని అభిప్రాయం కనుక్కోవాలంటే అతన్ని అడగాలి. అడగాలంటే ధైర్యం కావాలి.

"అందుకోసం నేనే అతన్ని పరిచయం చేసుకోక తప్పలేదు. రోజులు గడిచేకొద్దీ భయం తగ్గి క్రమంగా నా కతనివద్ద చనువేర్పడింది. ఇంతలో నా బియస్సీ పూర్తయ్యింది.

మా నాన్న నెలకి మూడు వారాలకిపైగా వూళ్ళు తిరిగేవారు. అమ్మ ఒక్కతే వుండేది. అతనితో కలిసి తిరిగినా అమ్మ అపార్థం చేసుకునేది కాదు.

"ఓరోజు నా అభిప్రాయాన్ని అతని ముందుంచి అతని అభిప్రాయంకోసం ఎదురుచూశాను. మొదట బిత్తరపోయాడు. తర్వాత నన్ను మృదువుగా మందలిం చాడు. నన్ను పెళ్ళిచేసుకుంటే తను నాన్నగారికి ద్రోహం చేసిన వాడౌతాడని, ఇంతకాలం పెంచి పెద్ద చేసి చదువు చెప్పించి ఎంతో ఆప్యాయంగా చూసిన ఆ దంపతులకి అన్యాయం చేసినవాడనౌతానని, తిన్నయింటి వాసాలు లెక్కపెట్టాడనే నింద తనకి తప్పదని ఆ వుద్దేశ్యం మానుకోమని చెప్పాడు.

"నేను ససేమిరా అన్నాను. ప్రవీణ్ కి కోపం

వచ్చింది. ఆరోజు సాయంత్రమే ఈ విషయం గురించి మా అమ్మతో మాట్లాడటానికి పూనుకున్నాడు.

"ఆరోజు మా నాన్నగారు ఊళ్ళో లేరు. 'అమ్మాయి బియస్సీ పూర్తయిందిగా, సంబంధాలేమైనా చూస్తున్నారా...?' అనే వాక్యంతో సంభాషణ మొదలు పెట్టాడు. కాసేపు మాట్లాడాక మా అమ్మ మాట విని తెల్లబోయాడు.

"తమ్ముడివి నువ్వుండగా అమ్మాయికి మరో సంబంధం ఎందుకు?" యిదీ మా అమ్మ అభిప్రాయం!

"ఏదో చెప్పబోయాడు. మా అమ్మ విన్పించుకోలేదు. ప్రవీణ్‌లో తన తమ్ముణ్ణి చూసుకుంటోంది మా అమ్మ. మా నాన్నగారితో తనే మాట్లాడి ఒప్పిస్తానంది. ప్రవీణ్ అభిప్రాయం అడిగింది...ఒప్పుకున్నాడు.

"నా ఆనందానికి ఏదీ ఆనకట్టు వేయలేకపోయింది. మా అమ్మ నన్ను చిన్నాన్నవద్దకి వెళ్ళమని, నాన్నగారు వచ్చాక ఒప్పించి పిలిపిస్తానని చెప్పింది. ఆ సమయంలో నేనుండటం మంచిదికాదు. మా నాన్న అభిప్రాయం ఎలా వుంటుందో మరి!

"సరే నన్నాను. కలకత్తా వెళ్ళిపోయాను.

"పదిహేను రోజులక్రితం యింటినుండి టెలిగ్రామ్ వచ్చింది. నాన్నగారూ ఒప్పుకున్నారని తెలిసి రెక్కలు గట్టుకువాలాను అలవి మీరిన ఆనందంతో.

"మా అమ్మ, నాన్న చాల సంతోషంగా కన్పించారు. రెండ్రోజులయ్యాక మా యింట్లో ఓ పార్టీ అరేంజ్ చేసి అందరి ఎదుటా మా యిద్దరి వివాహ విషయాన్ని ప్రకటించారు మా నాన్నగారు.

"ఆ సాయంత్రం పబ్లిక్ గార్డెన్స్‌లో స్వచ్ఛమైనగాలి పీలుస్తూ అంతకంటే స్వచ్ఛమైన ప్రవీణ్ కబుర్లు వింటూ పవిత్రమైన అతని ఒడిలో తృప్తిగా విశ్రాంతి తీసుకున్నాను. నా అదృష్టానికి నేను పొంగిపోయాను.

"వారంక్రితం కట్టుమిషన్ల ఫ్యాక్టరీలో వాటిని తయారుచేసే ఓ యంత్రం ట్రబులిచ్చింది. చెక్ చెయ్యగా అందులో ఓ పార్టు విరిగిపోయిందనీ అది బొంబేలో మాత్రమే దొరుకుతుందనీ చెప్పారు. మరురోజే మా నాన్నగారు ప్రవీణ్‌ని పంపించారు ప్లేన్‌లో.

"రెండు రోజులతర్వాత ఆ పార్టు దొరికిందని, రేపు బయల్దేరుతున్నానని ప్రవీణ్ దగ్గర్నుంచి టెలిగ్రాం వచ్చింది. అతనికోసం కళ్ళలో వత్తులు వేసుకొని ఎదురు చూశాను.

"మరుసటి రోజు—అంటే మొన్న రాత్రి తలుపు టక టకమని విన్పించటంతో స్వయంగా నేనే వెళ్ళి తలుపు తెరిచాను. ఆశ్చర్యంతో, భయంతో, బాధతో కంపించిపోయాను.

"ఎదురుగా నేలమీద యంత్రానికి కావలసిన భాగం మాత్రమే వుంది. ఎవరూ లేరు. గబ గబా బయటకు పోయి చూశాను. ఎవరూ కన్పించలేదు!

"ప్రవీణ్ ఎందుకలా చేశాడు? పార్టు తీసుకొని యింటి వరకూ వచ్చినవాడు తలుపు తట్టికూడా తలుపు తెరిచే వరకూ ఎందుకు వుండలేకపోయాడు? పార్టు బయట పెట్టి వచ్చేలోగా కన్పించకుండా పోవటం ఏమిటి?

"ఆ పార్టు మాయింటి ముందుంచింది ప్రవీణేనా?... అసలు ప్రవీణ్ బొంబేనుండి తిరిగొచ్చాడా? వస్తే ఈ

ఊళ్ళో ఎక్కడున్నాడు? రాకపోతే బొంబేలో ఏమయ్యాడు?...యివే మీరు తెల్సుకోవలసినవి..."

చెప్పటం ముగించి దీర్ఘంగా నిట్టూర్చిందా అమ్మాయి.

"ప్రస్తుతం మీ నాన్నగారు ఊళ్ళో లేరా?" అడిగాడు డిటెక్టివ్ జలంధర్.

"లేరు. ప్రవీణ్ దగ్గర్నుంచి టెలిగ్రాం వచ్చిన రోజే ఆయన వూరికి వెళ్లారు. 'ఓ ప్రేమకథ' ప్రస్తుతం 'కులు వ్యాలి'లో అవుట్ డోర్ షూటింగులో వుంది. అక్కడుంటారు. తిరిగొచ్చేసరికి పదిరోజులు పట్టొచ్చు. అమ్మ నాతో అసలు మాట్లాడటంలేదు. దయచేసి మా నాన్నగారు తిరిగొచ్చేలోగా మీరీ కేసు పరిశోధించాలి. ఖర్చుకి వెనకాడకండి. ఆఁ...మరో ముఖ్య విషయం. మీరీ కేసు ఇన్వెస్టిగేట్ చేస్తున్నట్టు మా నాన్నగారికి కాని మా వ్యాపారాలకి సంబంధించిన మరెవరికి కాని తెలియపరచకండి..."

"అలాగే..." సిగరెట్ దమ్ము ఘాటుగా లాగుతూ ఏదో ఆలోచిస్తున్నాడు జలంధర్ ఆమె కళ్ళు తుడుచుకోటాన్ని ఓరగా గమనిస్తూ.

"ప్రవీణ్ మిమ్మల్నేనాడూ కోరలేదని అన్నారు. అతను మరో అమ్మాయితో తిరుగుతున్నట్టుకాని ఆడపిల్లల్తో స్నేహం చేసినట్టుకాని మీకేమైనా తెల్సా?"

"లేదు. అతనేనాడూ ఎవర్నీ ఆ దృష్టితో చూడలేదు. నాకు తెల్సినంతవరకూ అతనికి గర్ల్ ఫ్రెండ్స్ కూడ ఎవరూ లేరు."

"యిలా అడుగుతున్నానని మరోలా అనుకోకండి.

మీ కెవరేనా బోయ్‌ఫ్రెండ్సున్నారా?"

"లేరు. నాతో మాట్లాడటానికూడ ఎవరూ సాహసించరు."

"ప్రవీణ్ మీ యింట్లోనే వుండేవాడా?"

"అవును."

"అతని కెవరేనా శత్రువులున్నారా?"

"ఆడపిల్లని. అలాంటివన్నీ నాకెలా తెలుస్తాయి? మేనేజర్లందరికీ మేనేజరు. అందరికీ తలలో నాలుకగా వుండేవాడు. అంతఃశత్రువు లెవరేనా వున్నారేమో!"

"అతని ఫొటో వుందా మీవద్ద?"

మౌనంగా తీసిచ్చింది.

"మీ అడ్రస్ ఇవ్వండి" ఫొటోనే చూస్తూ అన్నాడు.

ఆ అమ్మాయి చెప్పినట్టుగానే చాల అందంగా వున్నాడు ప్రవీణ్.

"తీసుకోండి..." అడ్రస్‌గల కాగితం డిటెక్టివ్ చేతిలో పెట్టిందా అమ్మాయి.

'మిస్ కాంతిరేఖ; డాటరాఫ్ యస్. త్రివిక్రమరావు, కాంతీసదన్, నవీన్ నగర్, హైదరాబాదు...' ఒక్కసారి చదివి మడిచి జేబులో పెట్టుకుంటూ "ఆల్ రైట్ మిస్ కాంతిరేఖా! ప్రవీణ్‌బాబుని వెదికే ప్రయత్నం ఈరోజునుండే మొదలెడతాను. మీరు దిగులు మానండి. అవసరమైతే మళ్ళీ కలుస్తాను."

చేతులు జోడించి, సెలవు తీసుకొని గబగబా నడిచి తలుపు తెర్చుకొని వెళ్ళిపోయింది మిస్ కాంతిరేఖ.

ఆమె చెప్పిన విషయాలు ఆలోచిస్తూ అయిదు నిమి

చాలసేపటు అలాగే కూర్చుండిపోయాడు డిటెక్టివ్ జలంధర్.

తర్వాత ఆమె టేబిల్‌పై ఉంచి వెళ్ళిన నోట్లను లెక్క పెట్టుకున్నాడు. చివరినోటు లెక్కిస్తూండగా ఏదో చిన్న కాయితం జారిపడింది. క్రిందికి వంగి తీసి అందులోని మేటర్ చదివాడు.

"ప్రేమిస్తే చంపేస్తా!"

అనిమాత్రం వుంది! సంతకం లేదు!!

అవాక్కైపోయాడు జలంధర్!!! ఆమె దగ్గరికీ కాయితం ఎలా వచ్చింది?

ఈ కాయితానామె చూసుకోలేదా? ఆమె నలా బెదిరించటానికి కారణం ఏమిటి? ఎవరు చేసుంటారాపని? కాంతిరేఖ యింతవరకూ చెప్పిందంతా నిజమేనా? లేక ఏదైనా దాస్తోందా? ఆమె తల్లి అలా మారిపోవడాని క్కారణం ఏమిటి?

అంతు తెలియని సమస్యలతో, జవాబులేని ప్రశ్నలతో హోటలు గదినుండి బయటపడ్డాడు జలంధర్!

## 2

"టాక్సీ...!" గట్టిగా పిలిచాడు ప్రవీణ్‌బాబు. అటుగా పోతోన్న ఓ టాక్సీ అతని ముందాగింది.

"కాంతీసదన్, నవీన్‌నగర్." చెప్పాడు ప్రవీణ్, సీటులో వెనక్కి వాలుతూ.

టాక్సీ వేగాన్ని పుంజుకుంది.

జేబులోంచి విల్స్ ఫ్లేక్ సిగరెట్ తీసి వెల్గించుకున్నాడు ప్రవీణ్‌బాబు.

పది నిమిషాలు గడిచాయి. ఇంజన్ ట్రబుల్ వల్ల టాక్సీ ఆగిపోయింది.

విసుగ్గా వుండిపోయాడు ప్రవీణ్ బాబు. అతని కెప్పు డెప్పుడు కాంతిరేఖని చూద్దామా అని వుంది.

ఆ రోడ్డులో సామాన్యంగా ఖాళీ టాక్సీలు రావు. ఆ ప్రక్క సందులలోగుండా వెళ్ళితే అక్కడికి ఇల్లుదగ్గరే. టాక్సీ దిగి ఫేర్ చెల్లించి నడవసాగాడు.

గబగబా నడుస్తున్నాడు ప్రవీణ్ బాబు. అది చిన్న యిరుకుసందు. ఆ యిరుకు సందులోంచి తిన్నగా ఫర్లాంగు వెడితే మెయిన్ రోడ్ ని కలుస్తుంది. యిల్లు దగరవుతుంది.

తొందరగా కాంతిరేఖని చూడాలనే తపనతో అడ్డ దారైన ఆ సందులో నడుస్తున్నాడు ప్రవీణ్ బాబు.

కుర్రాళ్ళు రాళ్ళు విసిరారేమో, వున్న రెండు వీధిలైట్ల బల్బులూ పగిలిపోయాయి. ఓ రకమైన దుర్వాసన వేస్తోంది ఆ సందు.

సగం దూరం నడిచాడో లేదో - ఎవరో 'అమ్మో' అని కేకెయ్యటంతో వెనక్కి తిరిగి ఆ సందులోంచి పాయగా చీలిన మరో సందులోనికి తొంగి చూశాడు ప్రవీణ్ బాబు.

ఎదురుగా కన్పించిన దృశ్యం అతన్ని కంపింప జేసింది.ఒక వ్యక్తిని నలుగురైదుగురు కలిసి ఒకేసారి పొడి చారు కత్తులతో. మళ్ళీ మళ్ళీ పొడుస్తున్నారు. ఆ వ్యక్తి శరీరం చిల్లులు పడింది. రక్తం కాల్వలా పారింది.

ఆ దృశ్యాన్ని చూడలేకపోయాడు ప్రవీణ్. కళ్ళు మూసుకొని 'మైగాడ్!' అన్నాడు అప్రయత్నంగా.

వాతావరణం ప్రశాంతంగా వుండటంతో ఆ మాటలు హంతకుల కర్ణేంద్రియాలకి సోకాయి. ఉలిక్కిపడి ప్రవీణ్ వేపు చూశారు.

మరుక్షణం వాళ్ళ కళ్ళు ఎరుపెక్కి నిప్పులు కక్కనారంభించాయి. జేబుల్లోంచి రివాల్వర్లు తీసి అతనికేసి గురిపెట్టి ఒక్కొక్క అడుగూ ముందుకేస్తూ ప్రవీణ్ వైపు రాసాగారు.

ప్రవీణ్ కి ముచ్చెమటలు పోశాయ్. అయిపోయింది. వాళ్ళు తనని చూశారు. తన ప్రాణం యింకా ఎన్ని క్షణాలుంటుందో వ్రేళ్ళమీద లెక్కపెట్టొచ్చు... ఓ మనిషిని దారుణంగా హత్యచేస్తూండగా తను కళ్ళారా చూశాడు. తనని బ్రతకనిస్తారనుకోటం కల్ల...

ప్రవీణ్ బాబు గుండెలు దడదడ లాడాయ్...

## 3

"డిటెక్టివ్ గారూ!"...ఆత్రంగా, భయంగా వణుకుతోన్న కంఠస్వరం వినవచ్చింది ఫోనులో. ఆ కంఠం శాంతిరేఖది!!

"నేనే మాట్లాడుతున్నాను. వాట్ హ్యాపెండ్ శాంతిరేఖా?"

"అయిపోయింది జలంధర్ గారూ! అంతా అయిపోయింది..." అంతకంటే ఎక్కువగా మాట్లాడలేక పోయిందామె. అంతవరకూ దాచుకున్న దుఃఖం ఒక్కసారిగా కట్టలు తెంచుకు ప్రవహించింది.

"ఏమైంది శాంతిరేఖా? ఎందుకేడుస్తున్నారు?" లాలనగా అన్నాడు జలంధర్.

"నా ప్రవీణ్...నా ప్రవీణ్ ని...హత్యచేశారు డిటెక్టివ్ గారూ!" భోరుమంది శాంతిరేఖ.

అదిరిపడ్డాడు జలంధర్. ఎన్నో ప్రశ్నలు అతని మస్తిష్కాన్ని తొలుస్తున్నాయి. "వెంటనే వస్తున్నాను" అని

మాత్రం అనేసి డాడ్జిపద్దకు పరిగెత్తాడు.

రాకెట్ వేగంతో కాంతీసదన్ చేరుకుంది డాడ్జి.

కాంతీసదన్ వెలవెలబోతోంది. భయంకర నిశ్శబ్దం విలయతాండవం చేస్తోందక్కడ. నిర్జీవ ప్రతిమలా కూర్చుని వుంది కాంతిరేఖ ఒక్కతే. ఆమె ముఖం అమావాస్య చీకటిలా వుంది. కళ్ళు లావెక్కి జ్యోతుల్లా వున్నాయి.

ఆ నిశ్శబ్దాన్ని భరించలేక పోయాడు జలంధర్. కాంతిరేఖవైపు తిరిగి ఏదో అనబోయాడు. వెక్కుతూనే ఆమె ఓ వైపుకి చేత్తో చూపించి ముఖాన్ని అరచేతుల్తో కప్పుకుంది.

ఆ వేపు దృష్టి సారించాడు డిటెక్టివ్ జలంధర్.

అక్కడో పొడుగాటి పెట్టెవుంది. అది మామూలు పెట్టెకాదు. శవపేటిక!

ఆ పెట్టె తలుపు తెరిచాడు జలంధర్.

లోపల ప్రవీణ్ బాబు శవం వుంది. ఒళ్ళంతా రక్తంతో తడిసి వుంది. రివాల్వర్ తో చంపబడ్డాడు.

పెట్టె తలుపు మూసేసి నెమ్మదిగా కాంతిరేఖ దగ్గరికొచ్చాడు. మృదువుగా ఓదార్పుగా ఆమె భుజం నిమిరాడు.

చల్లగాలికి వర్షించే మేఘమాలికల్లా అయ్యాయి కాంతిరేఖ కళ్ళు.

"ఎవరు తెచ్చారీపెట్టెని?" శాంతంగానే అడిగాడు.

ఏదో మాట్లాడాలని ప్రయత్నించిం దామె. కాని దుఃఖంవల్ల మాటలు పెగల్లేదు.

ఆ అవకాశాన్ని వినియోగించుకున్నాడు డిటెక్టివ్.

అతని ముఖంలో గంభీరత అలముకుంది. "రహస్యాలు దాచటంవల్ల ప్రయోజనం ఏమీ లేదు కాంతిరేఖా! ప్రవీణ్ చనిపోవటానికి ఒకవిధంగా కారణం మీరే!"

చటుక్కున యిటు తిరిగింది కాంతిరేఖ. "నేనా?!" అంది. అంతబాధలోనూ ఆమెకి అంతులేని ఆశ్చర్యం కలిగింది.

"అవును. మీరే! దీన్నిగురించి మీరు మొదటే చెప్పి వుంటే ప్రవీణ్ ప్రాణం దక్కివుండేదేమో!" జేబులోంచి ఓ కాగితం తీసి ఆమె కందించాడు.

రూపాయికాగితం సైజులో వుందది. అందులో ఎర్ర సిరాతో లావుగా గుండ్రంగా "ప్రేమిస్తే చంపేస్తా!!" అని మాత్రం వ్రాయబడుంది. అంతకుమించి మరేమీ లేదు!

ఆ అక్షరాలని చదవగానే కాంతిరేఖ భృకుటి ముడి వడింది. తనకేమీ అర్థంకాలేదన్నట్టుగా జలంధర్ వేపు చూసింది. "డిటెక్టివ్ గారూ! ఏమిటిది?!!

"ఇది మీకెలా వచ్చిందో మీకే తెలీదా?"

"నిజంగా నాకు తెలీదు జలంధర్ గారూ! నన్ను నమ్మండి."

ఆమె ముఖంలోని అమాయకపు రేఖల్ని చూసి ఆమె నిజమే చెబుతోందని గ్రహించాడు జలంధర్. మరు క్షణంలో ఆయన ముఖంలో ఆశ్చర్యం చోటు చేసుకుంది.

"మీరు నన్ను హోటల్లో కలిసినప్పుడు అడ్వాన్సుగా వుంచుకోమని నాకు కొంత డబ్బిచ్చారు. గుర్తుందా?"

"వుంది."

"ఆ నోట్లలో ఈ కాగితం కలుపబడివుంది."

"ఆఁ!?"

"అవును. బాగా గుర్తు చేసుకోండి. ఆ డబ్బు మీరు యింటినుండి తీశారా లేక దార్లో ఎక్కడైనా పట్టుకొచ్చారా?"

"మా యింట్లో బీరువాలోంచి తీశాను. తీసేప్పుడు లెక్కట్టుకున్నాను. అలాంటి కాగితమేదీ లేదని స్పష్టంగా చెప్పగలను."

"దారిలో ఎవరైనా యివ్వటంకాని ఎవరినుండైన పుచ్చుకోవటం కాని జరిగిందా? బాగా గుర్తుచేసుకోండి."

ఒక్కక్షణం ఆలోచించింది కాంతిరేఖ. తర్వాత అప్రయత్నంగా 'టాక్సీ' అంది!

కుతూహలంగా కనుబొమలెగరేశాడు జలంధర్.

"జలంధర్ గారూ! మీవద్దకు టాక్సీలో వచ్చాను. మిమ్మల్ని కలవాలనే తొందర్లో నా బ్యాగ్ టాక్సీలోనే పెట్టి కారు దిగాను. నాలుగడుగులు వేశాక టాక్సీ డ్రయివరు నా దగ్గరకు పరుగెత్తుకొచ్చి బ్యాగ్ మర్చిపోయారంటూ నాకిచ్చాడు. ఆ సమయంలో..."

'అవు'నన్నట్టుగా తలపంకించాడు జలంధర్.

"టాక్సీ డ్రయివర్ కి తప్పితే అలాంటవకాశం మరెవ్వరికీ లేదు. మధ్యలో నేను బ్యాగ్ ఓపన్ చెయ్యనేలేదు."

"టాక్సీ డ్రయివర్ ముఖం కాని టాక్సీ నెంబరు గాని మళ్ళీ చూస్తే గుర్తుపట్టగలరా?"

నిస్సహాయంగా చూసిందామె డిటెక్టివ్ వైపు.

"సారీ. మీతో కలిసి మాట్లాడాలనేదే తప్ప నాకు మరో ధ్యాసే లేకపోయింది."

"నెవర్ మైండ్. ఈ పెట్టె మీదగ్గరికెలా వచ్చిందో చెప్పండి."

"మెషిన్ పార్ట్‌లోనే వచ్చింది."

"తలుపు దగ్గరుంచి సిగ్నలిచ్చి మీరొచ్చేలోగానే వెళ్ళిపోయారన్నమాట."

"అవును. గంటక్రితం కాలింగ్ బెల్ మ్రోగింది. తలుపు తెరిచాను. పెట్టె వాకిట్లో వుంది. ఎవరూ లేరు. ఏమిటోనని ఆత్రంగా చూశాను. అంతే. గుండె బద్దలైంది జలంధర్ గారూ!" ఆమెలో దుఃఖం మళ్ళీ వెల్లుబికింది.

మౌనంగా శవపేటిక వేపు నడిచాడు జలంధర్. తలుపు తెరిచి తదేకంగా శవాన్ని చూశాడు. శవం ముఖంలో ఏవిధమైన భావమూ లేదు.

శవాన్నంతా కలయజూస్తోన్న జలంధర్ కళ్ళు మెరిశాయ్. మెదడు చురుగ్గా పనిచేసింది. తన భావాలు బయటపడనీకుండా శవం జేబువేపు దృష్టి పోనిచ్చాడు. ఏదో కాగితంలాంటిది కన్పించింది. కర్చీఫ్‌తో మెల్లిగా దాన్ని బయటకి లాగాడు. అదో ఉత్తరం.

ఆత్రంగా మడతలు విప్పాడు.

"మిస్ కాంతిరేఖా!

ఏ ప్రేయసైనా తన ప్రియుడికోసం ప్రేమనే కాదు, అవసరమైతే ప్రాణాన్నే త్యాగం చెయ్యగలదు. అలా చేసే వ్యక్తే నిజమైన ప్రేయసి. నువ్వుకాదు. నువ్వు ప్రవీణ్‌ని ప్రేమిస్తున్నావని నాకు తెల్సు. మీ పెళ్ళి జరగటం నాకిష్టంలేదు. అందుకే అతన్ని మాయం చేశాను.

నీకు డిటెక్టివ్‌ని సాయంకోరేంత తెలివుందని నాకు తెలీదు. అక్కడికీ నెక్స్టాఫ్‌రి మూమెంట్‌లో నిన్ను

హెచ్చరించాను. నా హెచ్చరికని కూడ నిర్లక్ష్యం చేశావ్. డిటెక్టివ్ సాయం కోరావ్. అందుకే నా మాట చెల్లించుకోక తప్పలేదు. నీ ప్రవీణ్‌ని నీ కప్ప గిస్తున్నాను. అయితే అతని ప్రాణం మాత్రం తీసుకున్నాను.

యిక నువ్వు యధేచ్ఛగా అతన్ని ప్రేమించవచ్చు. పరిశోధన మానమని డిటెక్టివ్‌ని హెచ్చరించు. లేకపోతే తర్వాతి వంతు నీదికాదు. మీ అమ్మది...!''

క్రింద సంతకం లేదు!!

ఆమె చేతికిచ్చాడు జలంధర్ ఆ వుత్తరాన్ని. చదివితే మరింత బాధపడుతుంది. అయినా తప్పదు.

''...జలంధర్‌గారూ! మా అమ్మను మీరే కాపాడాలి...'' చేతులు జోడిస్తూ అరిస్తున్నట్టుగా అంది కాంతిరేఖ. భయంవల్ల ఆమె ముఖంనిండా స్వేదబిందువులు అలముకున్నాయ్.

''...ఇలా రండి...'' ఆమె మాటల్ని మధ్యలోనే త్రుంచివేస్తూ శవ పేటిక దగ్గరగా తీసుకుపోయాడు జలంధర్. శవం చెవిక్రింద చేత్తో తడిమి ఒక్కసారిగా చేతిని చురుగ్గా వెనక్కి తీసుకొచ్చాడు.

మరుక్షణం కాంతిరేఖ కళ్ళు ఆశ్చర్యంతో రెపరెప కొట్టుకున్నాయ్.

చేతిలోకి వూడివచ్చిన మాస్క్‌ని పక్కన పెడుతూ అన్నాడు జలంధర్. ''ప్రవీణ్ చావలేదు. ఎవరోన్ని చంపి మాస్క్ తొడిగి ప్రవీణ్‌లా మేకప్ చేసి పంపించారు. అంటే ప్రవీణ్‌తో వాళ్ళకేదో అవసరం వుంది. అతన్ని మీరు పెళ్ళిచేసుకుంటే వాళ్ళ అవసరం

తీరదు. అందుకే యిలా మిమ్మల్ని నమ్మించి మీకు దూరంచేసి వాళ్ళకి దగ్గరయ్యేలా చేసుకున్నారు. ప్రవీణ్ ఎక్కడో సురక్షితంగా వున్నాడు."

కాంతిరేఖ ముఖంలో కాంతిరేఖలు వెల్లివిరిశాయ్.

"అన్నట్టు మీ అమ్మగారెక్కడ? ఆవిడగారి పరిస్థితెలావుంది?"

ఆనందాశ్రువుల్ని కర్చీఫ్‌తో తుడుచుకుంది కాంతిరేఖ. "అమ్మ పరిస్థితిలో ఏ మార్పూ రాలేదు. కాని ఆమె అలవాట్లలో చాల మార్పు వచ్చింది. ఎప్పుడూ దేవుడి పటంముందు కూర్చుని కన్నీరు కారుస్తూవుంటుంది. రోజూ రెండు మూడు గుళ్ళకి వెళ్ళి అభిషేకాలు చేయిస్తోంది. ఈ రోజూ వెళ్ళింది. జలంధర్ గారూ! మా అమ్మకే ప్రమాదమూ రాదుగదా!"

"ఎందుకైనా మంచిది. ఎవరైనా తోడు పంపిస్తూండండి. నైంటీనైన్ పర్సంట్ అలాంటిదేదీ జరగదనే అనుకుంటున్నాను... మీ అమ్మగారొచ్చేసరికి యింకా ఎంత సేపవుతుంది?"

"నలభై నిమిషాలు పట్టొచ్చు."

"ఆలోగా శవాన్నిక్కడ్నుంచి పంపించేస్తాను. మీ అమ్మగారికివేవీ తెలీనివ్వకండి."

తలూపింది కాంతిరేఖ.

ఫోనువద్దకు నడిచాడు జలంధర్. ఏదో నంబరుకి డయల్ చేశాడు.

"హాలో చక్రం! నేను జలంధర్ని మాట్లాడుతున్నాను. పావుగంటలోగా నువ్వు మఫ్టీలో యిక్కడికి రావాలి. ఇక్కడో పాడుగాటి పెట్టె వుంది. మామూలుగా దాన్ని

రిసీవ్ చేసుకో. ఓ ఫ్రెండ్‌లా ప్రవర్తించు యిక్కడి వాళ్ళతో. తర్వాతేం చెయ్యాలో తరువాత తెలుస్తుంది నీకు..." అడ్రస్ చెప్పి ఫోన్ పెట్టేసి కాంతిరేఖవయిపు తిరిగాడు.

"కాసేపట్లో క్రైంబ్రాంచ్ యినస్పెక్టర్ చక్రవర్తి యిక్కడికొస్తాడు. అతన్తో పంపించివెయ్యండి దీన్ని. ఆఁ...మరోమాట. ప్రవీణ్ బాబు అధీనంలో వున్న మేనేజర్లు, యితరుల పేర్లు, వారి క్లుప్తవివరాలూ కావాలి నాకు. వీలైతే..."

"వారి ముఖాలు చూడకపోయినా అందరిపేర్లూ తెలును నాకు. ఆఫీసుపనుల్లో అప్పుడప్పుడూ ప్రవీణ్‌కి సాయపడుతూండేదాన్ని. మీ యింటికి వచ్చి అందజేస్తాను."

"థాంక్స్...వస్తాను..."

శవపేటికవేపు జాలిగా చూసింది కాంతిరేఖ.

"పాపం! ఎవరో పూర్ ఫెలో..." అంటూ అక్కడి నుండి బయటకొచ్చాడు డిటెక్టివ్. ఆలోచనల్లో అప్పటివరకూ సిగరెట్ కాల్చాలనే ఆలోచనకూడ రాలేదు. జేబులోంచి రెడ్‌విల్స్ పాకెట్ తీసి సిగరెట్ వెల్గించుకొని ఘాటుగా దమ్ము లాగాడు.

డ్రాజిలో కూర్చుని స్టార్ట్ చేశాడు. రెండు నిమిషాల్లో కారు కాంతీసదన్ కాంపౌండ్ దాటి రోడ్డుమీదికి తిరిగింది.

"...హ్యాండ్సప్ మైడియర్...ఓవ్...సారీ! డ్రయివ్ చేస్తున్నావ్ కదూ! అబిద్‌రోడ్డుకాదు. యిటుప్రక్క పోనీవ్!!!" అన్న కోమలమైన స్వరంతోపాటు వీపుకి

గ్రుచ్చినట్టుగా ఏదో అనింది.

అది పిస్తోలు మొన అని గ్రహించటానికి డిటెక్టివ్‌కి ఒక్క క్షణం చాలు!

పరధ్యానంగా కారెక్కినందుకు మొదటిసారిగా నొచ్చుకున్నాడు డిటెక్టివ్ జలంధర్.

## 4

"వీల్లేదు!" గట్టిగా అరిచాడు ప్రవీణ్. "మీరు చెప్పినట్టు చెయ్యటం నావల్లకాదు!"

రెండు మూడు రోజుల్నుండి సరిగా తిండిలేదేమో! మనిషి చిక్కి నీరసంగా కన్పిస్తున్నాడు ప్రవీణ్.

మృదువుగా నవ్వాడు ముసుగు మనిషి. "అవుతుంది మిస్టర్ ప్రవీణ్! ఏనాటికైనా మళ్ళీ మీ కాంతిరేఖని చూడాలనుకుంటే నే చెప్పినట్టు మీరు వినాల్సిందే. లేకపోతే మీ జీవితంలో ఎప్పటికీ కాంతిరేఖ ప్రసరించదు!"

"అంటే...?"

"వెరీ సింపుల్! మిమ్మల్ని ప్రాణప్రదంగా ప్రేమిస్తోన్న కాంతిరేఖ మిమ్మల్నే కాదు. ఈ లోకాన్నే వదిలిపెట్టి వెళ్ళిపోతుంది!!"

"మీ మనుషులు ఎవర్నో హత్యచేస్తోంటే చూసింది నేను! ఆ రహస్యం నావల్ల బయటపడుతుందనే భయం వుంటే నన్ను చంపెయ్యండి. ఆ పిల్లేం చేసింది?" కోపంగా అన్నాడు ప్రవీణ్.

"నిన్ను చంపాలనుకుంటే అది క్షణాలమీద పని మిస్టర్ ప్రవీణ్ బాబూ! నీ కిదివరకే చెప్పాను. మేం భారీ ఎత్తున ప్రారంభించబోతోన్న కొత్త స్మగ్లింగ్ ఏజెన్సీకి నీవంటి సమర్థుడైన మేనేజర్ కావాలి! నువ్వు

తప్పితే ఆ పని మరెవ్వరూ చెయ్యలేరు. ఆ విషయం నేను స్వయంగా తెల్సుకున్నాను.

నిన్ను చంపటానికాదు నిన్నిక్కడికి తెచ్చింది. మా కంపెనీ నీ ఆధ్వర్యంలో నడపబడాలి. కోరి పిల్లనిస్తామన్నా వుద్యోగంలేందే వద్దనుకునే ఈ రోజుల్లో కోరి వుద్యోగం యిస్తానంటే కాదనకు. త్రివిక్రమరావు నీకు మహా యిస్తే వెయ్యో రెండువేలో యివ్వొచ్చు నెలకి. కాని నేను పదివేలిస్తాను. యింకా కావాలిస్తే ఎంత కావాలిస్తే అంత యథేచ్ఛగా వాడుకోవచ్చు నువ్వు. లేదు–షేర్ కావాలా? తీసుకో. సిరిరామోకాలొడ్డకు!"

నవ్వాడు ప్రవీణ్. "నాకు డబ్బుమీద ఆశలేదు మిస్టర్!"

"కాంతిరేఖమీద వుందంటావ్. కాని ప్రవీణ్! కాంతిరేఖని మించిన అందగత్తెలెందరో మా ఏజన్సీలో వున్నారు. వాళ్ళందర్నీ నువ్వు వాడుకోవచ్చు. అంతే కాదు. యింకా నువ్వేవరైనా కోరితే మరుక్షణం నీ ముందుంచటానికి మనవాళ్ళెప్పుడూ రెడీయే! యింకా ఏం కావాలి నీకు?"

"పరువు! మంచితనం!! ఆత్మగౌరవం!!!"

"హ హాహా హా!" వికటంగా నవ్వాడతను. "పరువు, మంచితనం, ఆత్మగౌరవం! ఈ మూడూ కల్సినా నీకు మూడు మెతుకులు కూడు పెట్టలేవు ప్రవీణ్! అసలీ కాలంలో ఆ పదాలకి అర్థమేలేదు. మొదట అందరూ అలా చెప్పేవారే!"

"నా కూటికి ప్రస్తుతం లోటేమీలేదు మిస్టర్! నా కొచ్చే జీతం నా జీవితం గడవటానికి సరిపోతుంది,

ప్రస్తుతం నాకే కరువూ లేదు. ఎప్పుడో రాబోతుందని పరువును అమ్ముకోలేను. అయాం వెరీ సారీ."

"సారీ అంటే ప్రయోజనం లేదు. నీకోసం మా మనిషి నొకణ్ణి పోగొట్టుకున్నాను. వయసు, ఎత్తు, బరువు దాదాపు నీతో సమానంగా వున్న మా మనిషి నొకణ్ణి చంపి నీ రూపంలో కాంతిరేఖకి ప్రజెంట్ చేశాను. త్వరలో ఆమె మరొకర్ని పెళ్ళిచేసుకోవచ్చు. లేదా సినిమాలోలా 'నీవు లేని జీవితం వృధా' అని డైలాగ్ చెప్పుకొని ఆత్మహత్య చేసుకోవచ్చు. సో, డోంట్ థింక్ అబౌట్ హర్. థింక్ అబౌట్ యువర్ బ్రైట్‌ఫుల్ ఫ్యూచర్."

ఆ మాటలు వినగానే ముఖం చిట్లించుకున్నాడు ప్రవీణ్. ఆ వ్యక్తిపై అతనికి విపరీతమైన అసహ్యం కలిగింది. సాటి మనిషిని తన స్వార్థంకోసం నిర్దాక్షిణ్యంగా బలిచేశాడు. అటువంటి వాణ్ణి 'రాక్షసుడు' అంటే చాలా? ఊహూం... చాలదు.

"నా అభిప్రాయం తెల్సుకోకుండా నువ్వాపని చేస్తే అందుకు బాధ్యుణ్ణి నేనుకాదు. నేను హత్యాదృశ్యాన్ని చూసినట్టుగా ఎవరితోనూ చెప్పను. నన్నొదిలెయ్. చెబుతానని అనుమానం, భయం వుంటే చంపెయ్."

"నీ నిర్ణయం మారదా?"

"మారదని చివరిసారిగా చెబుతున్నాను." ప్రవీణ్ కంఠం దృఢంగా పలికింది.

ఆ వ్యక్తికి అరికాలి మంట నెత్తికెక్కింది. కోపంతో వూగిపోయాడు.

"నిన్నెలా ఒప్పించాలో మాకు తెలుసు. మాట వింటావని మాటల్తో ప్రయత్నించటం పొరపాటు" అంటూనే

రెండుసార్లు చప్పట్లు కొట్టాడు.

మరుక్షణం యిద్దరు గూండాల్లాంటి యువకులు ప్రత్యక్ష మయ్యారా గదిలో.

"మిస్టర్ ప్రవీణ్ బాబూ!" కటువుగా పలికిందతని స్వరం. నేనూ చివరిసారిగా చెబుతున్నాను. నీకు ఒక్క గంట మాత్రమే గడువివ్వబడుతోంది. ఈలోగా మరో సారి ఆలోచించుకో. ఒప్పుకోకపోతే నీకు బ్రెయిన్ వాష్ చేయించటం అంత కష్టమైన పనేం కాదు. ఆతర్వాత నువ్వే 'ఆర్డర్ బాస్!' అంటూ నాచుట్టూ తిరుగుతావు.

ఈ రోజు సాయంత్రం మా సైంటిస్టులు ప్లాస్టిక్ సర్జరీ ద్వారా నీ ముఖాన్ని పూర్తిగా మార్చేస్తారు. మా కంపెనీలో వున్న నిన్ను ఎవ్వరూ ప్రవీణ్ గా గుర్తించలేరు. ఆఖరుకి నీ కాంతిరేఖకూడ! నీ నిశ్చయాన్ని తెలియజెయ్యటానికి అంతకంటె అవసరంలేదు. ఒప్పుకుంటే నీకు కొన్ని శారీరక బాధలూ మాకు కొంత శ్రమా తప్పుతాయి."

ముసుగుమనిషి ఆ గూండాలవేపు తిరిగాడు. "ఇతన్ని తీసికెళ్ళి మన సీక్రెట్ సెల్ లో బంధించండి" అన్నాడు.

"ఆర్డర్ బాస్!" అన్నారు వాళ్ళు వినయంగా.

# 5

"ఇంకా ఎంతదూరం?" విసుగ్గా అన్నాడు జలంధర్.

"నేను ఆపమని చెప్పేవరకూ" అందామె.

మవునంగా కారు డ్రయివ్ చెయ్యసాగాడు జలంధర్. కారు వేగంగా పరుగుతీస్తోంది. అప్పటికే వాళ్ళు పది మైళ్ళకి పైగా ప్రయాణం చేశారు. ఇంకా ఎంతదూరం పోవాలి? అసలు తను కాంతిరేఖ దగ్గరికెళ్ళినట్టు ఈమెకెలా తెల్సింది? తనని ఎక్కడికి తీసికెడుతోంది? తమ

స్థావరానికా? ఈమె నెలాగో బోల్తా కొట్టించాలి. ఎలా?

జలంధర్ మెదడు చురుకుగా పనిచేసింది. మెరుపు లాంటి ఆలోచన మస్తిష్కంలో మెదిలింది. అవకాశం కొరకు ఎదురుచూస్తూ కూర్చున్నాడు.

"లెఫ్ట్...!" అందామె. అప్పట్నుంచీ మలుపు తిరగాల్సిన చోటల్లా ఆలా యిన్స్ట్రక్షన్స్ యిస్తోనే వుంది.

ఫోర్ రోడ్స్ సెంటరది.

ఆ రోడ్డుమీద జనసంచారం అంతగా లేదు. లెఫ్ట్‌కి త్రిప్పబోతూ ఒక్కసారిగా రైట్‌కి త్రిప్పాడు జలంధర్. వెంటనే సడన్ బ్రేక్ వేశాడు.

ఎదురుచూడని ఆ హఠాత్పరిణామానికి ఆమె తెల్లబోతూ తూలి ఎడమవేపు సీటుపై పడిపోయింది. ఆలా పడిపోతూనే ట్రిగ్గర్ నొక్కేసింది అప్రయత్నంగా.

కాని ఆమె పడిపోవటంతో రివాల్వర్ వున్న చెయ్యి కిటికీ వేపుకి తిరిగుండటంమూలాన బుల్లెట్ కిటికీగుండా దూసుకుపోయింది. అది సైలెన్సర్ అమర్చింది కావటంతో ఆ కాస్త శబ్దమూ కారులోపలే వుండిపోయింది.

డిటెక్టివ్ బ్రేక్ వెయ్యటం, రివాల్వర్ వున్న ఆమె చేతిని తనచేత్తో నొక్కటం, ఆ బాధకి తట్టుకోలేక ఆమె రివాల్వర్‌ని జారవిడవటం - అంతా క్షణాల్లో జరిగిపోయింది.

"ఎవరు నువ్వు? ఎక్కడికి తీసుకుపోతున్నావ్? నిన్నిలా చెయ్యమని చెప్పిందెవరు? మీ రహస్య స్థావరం ఎక్కడ? ఎవరు మీ బాస్...?" కటువుగా ప్రశ్నించాడు జలంధర్.

అన్ని ప్రశ్నలకీ జవాబుగా ఆమె తల వాల్చేసింది!

ఉలిక్కిపడి ఆమె మీదకి వంగి చూశాడు. ఆమె తొడపై పిన్‌తో గ్రుచ్చిన చిన్న గాయం వుంది. ఎడం చేతి చిటికెన వ్రేలికి పదునైన మొనగల ఎర్ర రాయి పొదగబడిన వుంగరం వుంది!

అంటే...అందులో సైనేడ్ వుందన్నమాట!!

గాఢంగా నిట్టూర్చి ఆమెనోసారి పరిశీలించాడు జలంధర్. వయసు యిరవై వుండొచ్చు. తెల్లగా వుంది. అందమైన ముఖం. బాబ్డ్ హెయిర్. ఎరుపురంగు మినీ స్కర్టు. మోకాళ్ళవరకూ సాక్స్, పాదాలకు బూట్సు. ఎడంచేతిలోని హ్యాండ్ బ్యాగ్ క్రిందకి వ్రేలాడి అటూ ఇటూ వూగుతోంది.

నెమ్మదిగా దాన్నందుకొని ఓపన్ చేశాడు. లోపల కాస్మటిక్ గూడ్స్‌తోపాటు ఓ వంద రూపాయల నోటుంది. దానిపై అశోకచక్రం కన్పించే తెల్లని ఖాళీ స్థలంలో EE అన్న అక్షరాలతోబాటు 'హోటల్ కల్పన' అని మాత్రం రాసుంది!

శవాన్ని చేర్చవలసిన చోట చేర్చి తిరిగి కారులో బయల్దేరాడు డిటెక్టివ్ జలంధర్.

నెమ్మదిగా పరుగుతీస్తోంది డాడ్జి. ఆయన మస్తిష్కంలో ఆలోచనలు చోటు చేసుకుంటున్నాయ్. ముఖం గంభీరంగా వుంది. పెదవుల మధ్య రెడ్ విల్స్ ఎర్రగా కాలుతోంది.

'హోటల్ కల్పన' అని వందరూపాయల నోటుమీద రాసుంది. మరి EE అన్న అక్షరాలేమిటి? వీటిలో వున్న అంతరార్థమేమిటి? హోటల్ కల్పనకీ వీళ్ళకీ సంబంధం ఏమిటి?

ఏదో ఆలోచన ఆయన బుర్రలో మసకగా మెదిలింది. మరుక్షణం మెరుపులా మెరిసింది. 'అవును దీనిలోని అర్థం యిదే! E అంటే ఈవెనింగ్. అల్ఫబెట్స్‌లో అయిదవ అక్షరం E! అంటే మొదటి అక్షరానికి సాయంత్రం అని, రెండవ అక్షరానికి 5 అని అర్థం!!'

'సాయంత్రం అయిదు గంటలకి హోటల్ కల్పనలో ఏదో జరగబోతోంది!'

హుషారుగా మరో సిగరెట్ వెలిగించుకున్నాడు జలంధర్. టైమ్ చూసుకున్నాడు. యింకా చాలా వుంది. ఈలోగా ఏం చెయ్యాలి?

కాంతిరేఖ మెదిలింది తన మనసులో. తన అనుమానం కూడ తీర్చుకోవచ్చు.

## 6

ఐదు గంటలైంది.

హోటల్ కల్పన చాల సందడిగా వుంది. డిటెక్టివ్ జలంధర్ ఓ కుర్చీలో మౌనంగా విస్కీ చప్పరిస్తూ కూర్చున్నాడు. వ్రేళ్ళమధ్య సిగరెట్ పొగలు గ్రక్కుతోంది.

ఆయన కళ్ళు హోటల్ అంతా కలయజూస్తూ అందరి మొహాల్ని చదివేస్తున్నాయి.

ఎవరూ ఎవర్నీ పట్టించుకోటంలేదు. ఎవరి ఆనందంలో వాళ్ళున్నారు. అందరి దృష్టి స్టేజిపైనే వుంది.

స్టేజిపైన ఓ యువతి, ఓ యువకుడు ఫారిన్ మెథడ్స్‌ని అనుకరిస్తూ డాన్స్ చేస్తున్నారు.

డిటెక్టివ్ జలంధర్ కూడ ఓసారి స్టేజివంక చూశాడు వారిద్దరి డాన్స్ చూస్తూంటే అతనికే ముచ్చటేసింది.

సభ్యతాబద్ధులై క్లాసికల్‌గా అడుగులేస్తున్నారు వాళ్ళు.

అప్పుడప్పుడూ ఆ హాల్లో క్లాప్స్ మారుమ్రోగు తున్నాయి.

తిరిగి జనంవేపు దృష్టి పోనిచ్చాడు.

తినేవాళ్ళు తింటోన్నారు. తాగేవాళ్ళు తాగు తోన్నారు. కొందరు వుత్సాహవంతులైన యువతీ యువ కులు జంటలుగా స్టేజీపైని జంటతో జతగా హాల్లో డాన్స్ చేస్తోన్నారు.

'సర్...' అన్న పిలుపు విని ఉలిక్కిపడి చూశాడు జలంధర్. ఆ హోటల్లో పనిచేస్తోన్న ఓ లేడీ సర్వర్!

ఏమిటన్నట్టు చూశాడు జలంధర్.

"ఈ స్లిప్ మీకందజెయ్యమన్నారు." అతని చేతిలో ఓ కాగితముక్క వుంచిందామె.

తీసి చూశాడు.

"ప్రే... హెల్ప్... మీ!—కాంతిరేఖ."

టెలిగ్రాఫ్ భాషలో వుందా ఉత్తరం!

జలంధర్ మొహంలో రంగులు మారాయి. 'ఎందు కొచ్చింది కాంతిరేఖ యిక్కడికి? లేక దార్లోనే బంధించి తీసుకొచ్చారా?... కాంతిరేఖ తన క్లయింట్. ఆమెకే అపాయమూ రాకుండా కాపాడాలి!' ఒక్కొక్క ఆలోచన కనుగుణంగా ఆయన ముఖ కవళికలు మారు తున్నాయి.

"ఎక్కడున్నారు వీరు?" ఆత్రంగా అడిగాడు.

"రండి. చూపిస్తాను..." దారి తీసిందామె. అనుస రించాడు జలంధర్ జేబులోంచి రెడ్‌విల్స్ పాకెట్ తీస్తూ.

ఆ హాల్లోంచి మరో హాల్లో ప్రవేశించిందామె. అందులో ఎవరూ లేరు. గోడమీదవున్న ఓ మీట నొక్కింది. నేలమీద ఓ వృత్తాకారం గల పలక ప్రక్కకు తప్పుకొని సొరంగమార్గం ఏర్పడింది. లోపల మెట్లున్నాయ్!

సిగరెట్ ప్యాక్ చేత్తో పట్టుకొనే ఆమె వెనక నడిచాడు జలంధర్. వెనక ద్వారం తిరిగి మూసుకు పోయింది.

"ఈ సహాయం చేస్తానన్నందుకు కాంతిరేఖ నీ కెంతిస్తానంది?"

"రెండు వేలు."

"స్మగ్లింగ్ గ్యాంగ్ నాయకుడెవరో చెప్పు. నేను అయిదు వేలిస్తాను."

"అమ్మో! ఆ రహస్యం బయటపెడితే నా ప్రాణం పోతుంది."

అప్పటికే వాళ్ళిద్దరూ సొరంగ మార్గం దాటి ఓ విశాలమైన గదిలో అడుగుపెట్టారు.

"నీ ప్రాణానికి నేను హామీ యిస్తున్నాను. భయం లేదు. చెప్పు."

"ముందు మీ ప్రాణాలకి హామీ యిచ్చేవాళ్ళెవరో ఆలోచించుకోండి మిస్టర్ జలంధర్!" మెరుపులా వెనక్కి తిరిగి చేతిలోని రివాల్వర్ డిటెక్టివ్ కేసి గురి పెడుతూ అందా అమ్మాయి!!

"చింత చచ్చినా పులుపు చావలేదు..." వ్యంగ్యంగా అంటూ ప్రత్యక్షమయ్యాడు ముసుగుమనిషి. "మా స్థావరంలో ప్రవేశించి మా మనిషి ప్రాణాలకే హామీ యిస్తు

న్నావే! ఎంత ధైర్యం నీకు?''

''నీ మనుషుల ఎదుటే తలెత్తుకు తిరగలేక ముసుగేసు కున్న నువ్వు ధైర్యం గురించి మాట్లాడుతున్నావా?'' హేళనగా అన్నాడు జలంధర్.

ఆ మాటలు విన్పించుకోలేదు ముసుగుమనిషి.

''మా సంస్థ నిబంధనల్లో అప్పగించిన పని చెయ్యలేక, కారణం తెలియజెయ్యక పూరుకుంటే ఆ మనిషి మరణించి నట్టే లెక్క. రీటాగురించి తెలియకపోయేసరికి ఆమె నీకు చిక్కి ప్రాణాలు కోల్పోయి వుంటుందని వూహించాను. ఆమె దగ్గరున్న వందరూపాయల నోటుద్వారా నీకు ఈ హోటల్ అడ్రస్ తెల్సిపోయింది.

''అందుకే ప్రవీణ్ కి బ్రెయిన్ వాష్ చెయ్యటం కోసం ఈ రోజిక్కడ మా సైంటిస్ట్లు జరపబోయే సమావేశాన్ని వాయిదా వేశాను. నువ్వొస్తావని తెల్సు నాకు. అందుకే కాంతిరేఖ ఆపదలో వుందని తెలియజేస్తున్నట్టు తెలివిగా స్లిప్ పంపించి నిన్ను రప్పించాను.''

''రీటాలాంటి రివటలూ నీలాంటి చవటలూ ఎంత తెలివిగా ప్రవర్తించినా చట్టంనుండి తప్పించుకోలేరుమిస్టర్!''

''అసలు మీ రిక్కడ్నుంచి ఎలా తప్పించుకుంటారో చూస్తాను...'' వికటంగా నవ్వుతూ చప్పట్లుకొట్టాడు ముసుగుమనిషి. బిలబిలమంటూ ఐదారుగురు ప్రవేశించారు.

''ఇతనికీ ప్రవీణ్ కి పట్టిన గతి పట్టించండి'' గర్జించాడు.

చేతులెత్తి నిలబడిన జలంధర్ ని ప్రవీణ్ ప్రక్కనే వున్న మరో స్తంభానికి కట్టిపడేశారు వాళ్ళు.

## 7

''మీమీ యిష్టదైవాల్ని స్మరించుకోండి.'' లేడీ సర్వర్ నుండి రివాల్వర్ తీసుకొని, తన జేబులోంచి మరో రివా

ల్వర్ తీసి రెండు రివాల్వర్‌లు యిద్దరికీ గురిపెడ్తూ కర్క శంగా అన్నాడు ముసుగుమనిషి.

"...ఆ పని చెయ్యాల్సింది నువ్వు మిస్టర్!!" అన్న సింహ గర్జనతోబాటు నిశ్శబ్దంగా వెలువడిన రెండు బుల్లెట్లూ ముసుగుమనిషి చేతుల్లోని రివాల్వర్లని ఎగర గొట్టేశాయి!!

ఉలిక్కిపడి ప్రక్కకి చూశాడు ముసుగుమనిషి.

ఎదురుగా పోలీసులు! డిటెక్టివ్ యిన్స్‌పెక్టర్ చక్ర వర్తి చేతిలోని సైలెన్సర్ అమర్చిన పిస్తోలు యింకా సన్నగా పొగలు విరజిమ్ముతూనే వుంది!

"ఊఁ... ప్రవీణ్ కట్లూ నా కట్లూ విప్పండి. లేకపోతే ఇన్స్‌పెక్టర్ చేతిలోని పిస్తోలు మీ నాయకుణ్ణి హత్య చేస్తుంది... ఏం నాయకా? ఎలా వుంది మన తెలివి? తుపాకీ తూటాలా లేదూ!!" పరిహాసంగా అన్నాడు జలంధర్.

ముసుగుమనిషి ఆ మాటలు యాంత్రికంగా వింటు న్నాడు. శిలా ప్రతిమలా నిల్చుండిపోయాడు. పోలీసులు అతనిని, అతడి అనుచరులను క్షణాలలో అదుపులోకి తీసు కున్నారు.

బంధవిముక్తుడై హుషారుగా ఒళ్ళు విరుచుకున్నాడు జలంధర్.

"శాంతిరేఖ బంధించబడలేదని నాకు తెల్సు. లేడీ సర్వర్ స్లిప్ తెచ్చివ్వగానే యిది నీ పథకమేనని తెల్సి పోయింది. అయినా అనుమానం రాకుండా శాంతిరేఖ బంధించబడినందుకు బాధపడ్డట్టు నటించి, ఆత్రత కన పరుస్తూ ఆమె వెనక నడిచాను. నడుస్తూ నడుస్తూ నా

సిగరెట్ పాకెట్ లోంచి ఒక్కో సిగరెట్టూ టర్నింగ్ పాయింట్స్ వద్ద పడేశాను. ఆ గుర్తుల్ని బట్టి నా వాళ్ళు ఈ స్థలం కనిపెట్టగలిగారు. అదీ సంగతి యిప్పుడర్థమైందా?"

జవాబివ్వలేదు ముసుగుమనిషి.

"ఏడుస్తున్నావో నవ్వుతున్నావో తెలీటం లేదు. యింకా ఆ ముసుగెందుకు తీసేయ్!"

మరుక్షణం ముసుగుమనిషి 'ముసుగు' అతడి చేతుల్లోకి వూడి వచ్చింది.

"మైగాడ్! హతుడు!!" ఆశ్చర్యం పట్టలేక గట్టిగా అరచాడు అక్కడే వున్న ప్రవీణ్.

అర్థం కానట్టు చూశాడు డిటెక్టివ్ అతనివేపు.

"ఓ. యిరుకు సందులో యితన్ని చంపుతూండగా నా కళ్ళారా చూశాను సార్! యితన్ని హత్యచేస్తుంటే చూశాననే నన్ను పట్టి బంధించారు."

"ఓహో! ఈ హతుడే నీలాగ మేకప్ చేసి కాంతిరేఖకి పంపిన మనిషిని చంపిన హంతకుడన్నమాట! వేరే వాళ్ళయితే నువ్వు ముందు ముందు చూడొచ్చు. తనైతే ముసుగులో వుంటాడు గాబట్టి నువ్వు చూసే అవకాశం లేదు. అందుకే తనని చంపుతున్నట్టూ దాన్ని నువ్వు చూసినట్టూ సన్నివేశాన్ని కల్పించి నిన్ను బుట్టలో వేసుకున్నాడు."

"నన్ను పట్టుకోటానికింత నాటకం ఎందుకాడాడు?"

"అదే సస్పెన్స్ మరి...!" నవ్వుతూ ప్రవీణ్ వేపు చూసి పోలీసులవేపు తిరిగాడు జలంధర్. "డాన్సర్ ఎక్కడ?" అన్నాడు.

వెనకనుండి యింతకు ముందు స్టేజిపై డాన్స్ చేసిన

యువతి, యువకుడు ముందుకొచ్చారు.

"బాబాయ్...!" గట్టిగా అంది డాన్సర్. ఆమె కళ్ళు ఆశ్చర్యంతో పెద్దవైనాయి.

"అవును. మీ బాబాయి త్రినాధరావు యితనే..."

త్రినాధరావు ఆశ్చర్యపోయాడు. ఆమె ఎవరో తనని 'బాబాయ్' అని ఎందుకందో అతని కర్థంకాలేదు.

అది గమనించిన డాన్సర్ తన ముఖంమీది మాస్క్‌ని తొలగించేసింది.

"కాం...తి...రే...ఖ..." అస్పష్టంగా గొణిగాడు త్రినాధరావు!

కాంతిరేఖతో బాటు డాన్స్ చేసిన యువకుడు మేకప్ తుడుచుకున్నాడు.

"యితడు ప్రఖ్యాత డిటెక్టివ్ జలంధర్ గారి అసిస్టెంట్ శ్రీనివాస్ బాబాయ్!" అతన్ని పరిచయం చేసింది కాంతిరేఖ. త్రినాధరావు పట్ల అసహ్యంతో కోపంతో ఆమె ముఖం జేవురించింది.

ప్యాకెట్‌లో వున్న ఆఖరి సిగరెట్‌ని వెలిగించుకొని చెప్పటం ప్రారంభించాడు డిటెక్టివ్ జలంధర్.

"మిస్ కాంతిరేఖా! కలకత్తాలోవున్న మీ బాబాయిని ఈ పాత్రలో చూసేసరికి నీకు విపరీతమైన ఆశ్చర్యం కలిగింది కదూ! యితనే ఈ కేసుకంతటికీ మూలకారకుడు..."

"మీ తాతగారు మీ నాన్నగారికీ, యితనికీ, మీ అత్తగారికీ ఆస్తి సమానంగా పంచియిచ్చారు. త్రివిక్రమ రావుగారు సక్రమమైన పద్ధతిలో తన ఆస్తిని వ్యాపారంలో పెట్టి కష్టపడి వృద్ధిచేశారు. కాని ఈ త్రినాధ

రావు మాత్రం అడ్డదార్లు త్రొక్కాడు. స్మగ్లింగ్ ముఠాలో చేరి క్రమేణా దానికి 'బాస్' అయ్యాడు. ఈ వూరు అతని బ్రాంచీ మాత్రమే. హెడ్డాఫీసు కలకత్తాలో వుంది.

"భర్త పోయిన మీ అత్తగార్ని ఆమె పదేండ్ల కుమారుడు శ్రీనాథ్‌ని చేరదీశాడు. ఆ తర్వాత తెలివిగా ఆమె ఆస్తిని తనపేర రాయించుకొని ఆమెని స్లో పాయిజన్‌తో హత్యచేశాడు. మామ పెంపకంలో అల్లుడు తాగుబోతుగా తయారయ్యాడు... కాదు, ఇతను తయారు చేశాడు. అతనికి నిన్నిచ్చి పెళ్ళిచేసి తనవద్ద వుంచుకొని మున్ముందు మీ ఆస్తినికూడ కాజెయ్యాలని ప్లాను వేశాడు.

"అందుకు మీ అమ్మగారి స్వంత తమ్ముడు ప్రతాప్‌ని చిన్నప్పుడే మాయం చేశాడు_ అతడు నిన్ను చేసుకో వచ్చనే భయంతో.

"ప్రతాప్‌ని చంపమని త్రినాథరావు తన నమ్మిన బంటు మాధవరావుకు అప్పగించాడు. మాధవరావు, త్రినాథరావుని గుప్పిట్లో పెట్టుకోవాలని అతన్ని చంపక కొంతకాలం పెంచి కొంతవరకు చదువు చెప్పించి తిరిగి మీ యింటికే చేర్చాడు 'ప్రవీణ్ బాబు' అనే పేరుతో. ప్రవీణ్ బాబు పెద్దయ్యాడు.

"ఏదో సందర్భంలో మాధవరావుని బెదిరించాడు త్రినాథరావు. మాధవరావు ఎదురుతిరిగి ప్రతాప్ బ్రతికే వున్నట్లు, ప్రవీణ్ అనే పేరుతో మీ యింటనే పెరుగుతున్నట్లు తెలియపరిచి త్రినాథరావు నోరు మూయించాడు. అంతేగాక మీ అమ్మగారికే కూడా

అతనే మీ విషయాలు తెలిపాడు.

"ఫలితంగా మాధవరావు హత్య చెయ్యబడ్డాడు.

"నేను మీ అమ్మగారితో మాట్లాడాను. ఎంతో బలవంతం చేస్తే అసలు విషయం చెప్పారు. ప్రవీణ్ తన సొంత తమ్ముడేనని తెలియజేస్తూ ఈ విషయం ఎవరికీ తెలియనివ్వకనీ, అలా తెలియపర్చినా, ప్రవీణ్ కాంతి రేఖల పెళ్ళి జరిపించినా, యిద్దరి ప్రాణాలూ తీసేస్తానని ఆమెని బెదిరించారు మారుపేరుతో. అటు సొంత తమ్ముడు—ఇటు కన్న కూతురు. ఆమె ఎటూ చెప్పలేక పిచ్చిపట్టినదానిలా అయిపోయారు.

"ప్రవీణ్ మంచితనం చూసి అతనికి నిన్నిచ్చి చెయ్యాలనుకున్నారు మీ అమ్మ, నాన్న. అప్పటికింకా ప్రవీణ్ గతం తెలీదు. అంతకుముందే నిన్ను శ్రీనాథ్ కివ్వమని త్రినాథరావు అడిగాడు. సొంత చెల్లెలి కొడుకైనా అతడు తాగుబోతు కావడంతో నిన్ను అతని కివ్వటానికి మీ నాన్నగారు ఒప్పుకోలేదు.

"అందుకే ప్రవీణ్‌ని ఓ స్మగ్లర్‌గా తయారుచేసి, మీ నాన్నగారి దృష్టిలో పడేలా చెయ్యాలని యింత నాటకం ఆడాను. ప్రవీణ్ స్మగ్లరని తెలిస్తే అతనిపై మీ నాన్నగారికున్న సదభిప్రాయం కాస్తా తుడిచిపెట్టుకుపోతుంది. అతన్ని బయటికి గెంటేసి 'గుడ్డికంటే మే'లని, పెళ్ళైతే అతనే సర్దుకుపోతాడని అనుకొని మీ నాన్నగారు నిన్ను శ్రీనాథ్‌కిచ్చి చేస్తారని, ఒప్పుకోకపోతే నిదానంగా చెప్పి ఎలాగైనా ఒప్పించవచ్చని మీ బాబాయ్ యింత తతంగం జరిపించాడు...!'

త్రినాథరావు ముఖం అవమానభారంతో క్రిందికి వంగిపోయింది.

"యిదంతా నాకెలా తెల్సిందోనని అనుమానిస్తున్నావ్ కదూ! మాధవరావు కుటుంబం ఈ వూళ్ళోనే వుంది. అడ్రస్ తెల్సుకుని వెళ్ళాను. మాధవరావుని నీవు మట్టు బెట్టినా, అతని డైరీలో నీ గుట్టు దాచబడి వుండిందిన్నాళ్ళూ. అది యిప్పుడు బయటికొచ్చింది..." అన్నాడు డిటెక్టివ్ జలంధర్ గంభీరంగా.

—: ఐ పో యిం ది :—




[తొమ్మిదవ భాగము]

"యూ ఆరే డేంజరస్ మేనియక్ మిస్టర్ కోబ్రా!" దడాలున పైకిలేచాను కుర్చీని వెనక్కి నెంటి "నువ్వో మానసిక వ్యాధిగ్రస్తుడివి. నీలాంటి వాడు బ్రతికి వుండడం నీ చుట్టుపక్కల మనుషులకు అపాయకరం.... అది నీకు తెల్సా?" అర్చాను ఆవేశంగా ఊగిపోతూ.

తొణుకు, బెణుకు లేకుండా కామ్‌గా నాకేసి చూశాడు కోబ్రా.

"మిస్టర్ భయంకర్! నేనా కోరికను చంపుకోలేక పోతున్నాను. ఇది నాలుగు సంవత్సరాలుగా రోజురోజుకీ పెరుగుతూ వేధిస్తున్న కోరిక! నువ్వు నన్ను 'మానియాక్'

అన్నా, ఏ పేరుతో పిల్చినా సహిస్తాను. కాని నా కోరిక నీద్వారా తీరాలి. ఐ వాంట్ టు గెట్ డన్ బై యూ! నీకు గుండె బలం వున్నదని చెప్పావ్!"

"వాట్ ది హెల్ అర్యూ టాకింగ్ మిస్టర్ కోబ్రా! యిలాంటి అతి నీచపు, దౌర్భాగ్యపు పని చేయించడానికా నా గుండె దిటవును, ధైర్యాన్ని కొల్చుకున్నావ్? ఈ విషయం నీ నీగ్రో అనుచరులకు తెలిస్తే ఏమౌతుందో తెల్సా?" కోపోద్రేకాలతో ఊగిపోతూ అడిగాను.

"కామ్ డౌన్ మిస్టర్ భయంకర్! వాళ్ళు విశ్వాసపు జంతువులు. నువ్వా విషయం వాళ్ళకు చెప్తే నిన్ను పిచ్చి వాడికింద జమకడ్తారు. పైగా యజమానిపై చాడీలు చెప్పావని నిన్ను చంపడానిక్కి నా అనుమతి అడుగు తారు. అలాంటి కట్టుబాట్లు వారివి.

"అంతేకాదు నీలాగే ఓ సంవత్సరం నల్గురు టూరిస్టులు ఈ అడవిలో చిక్కుకున్నారు. వాళ్ళు నా కోరిక తీర్చ డానిక్కి ఒప్పుకోలేదు. దానికి ప్రతిఫలంగా బందీలై దిక్కు లేని ఆకలి చావు చచ్చారు" ఆఖరి మాటలంటున్నప్పుడు కోబ్రా ముఖం క్రూరంగా మారింది.

"అయ్ కాంట్ హెల్ప్ మై సెల్ఫ్. ఈ కోరిక రాత్రివేళల్లో ఎక్కువైపోతోంది నాకు. నిద్రరాని రాత్రుళ్ళు ఎన్నో వున్నాయి. అందుకే_ఈ దఫా అది అమల్లోకి వచ్చితీరాలి."

"మిస్టర్ కోబ్రా! నిన్ను అనవసరంగా ఎక్కువగా ఊహించుకున్నాను." అన్నాను ఊగిపోతూ.

"నీ ఊహలకు, నిగ్రహాలకు నేను బాధ్యుడ్ని కాను మిస్టర్ భయంకర్!"

“ఈ దారుణాన్ని అన్నం తినే మనిషెవడూ వప్పుకోడు.”

“వప్పుకోకపోతే ఆ అన్నంలేక దిక్కులేని చావు చస్తావ్ మిస్టర్ భయంకర్.”

“నా ఒంట్లో చీము, నెత్తురు వున్నాయి. దానికి చస్తే ఒప్పుకోము. రాక్షసత్వం యిది. ఇటీజ్ జస్ట్ ఎ సావేజ్ లస్ట్” అన్నాను దిక్కులు పెక్కటిల్లే స్వరంతో.

మా యిద్దరిమధ్యా కాస్సేపు చావు నిశ్శబ్దం ఏర్పడింది. కొద్ది నిముషాలక్రితం యిద్దరం నవ్వుతూ మాట్లాడుకున్నాం. యిప్పుడు ఆ నవ్వూ, ఆ నిర్మలత్వం, స్నేహ వాతావరణం లేవు.

అసహ్యం పుడుతోంది అతనిపై నాకు.

కోబ్రా అసలేమీ జరగనట్టు మౌనంగా డైనింగ్ టేబుల్ ముందునుంచి లేచాడు. ఓసారి నావైపు చూసి, తానో సిగరెట్ పెదిమల మధ్య పెట్టుకున్నాడు. అగ్గిపుల్లతో సిగరెట్ ముట్టించి, వేళ్ళమధ్య కాలుతున్న అగ్గిపుల్లకేసి చూస్తూ పలికాడు.

“మిస్టర్ భయంకర్! నువ్వేదో మాట్లాడావ్ ఆవేశంలో. అది నేనూహించిన పరిణామమే కాబట్టి అన్యథా భావించడం లేదు. అదంతా మర్చిపోతున్నాను. పోతే_రెండ్రోజులు టైం యిస్తున్నాను నీకు. నేనడిగిన విషయం పైన_నీ నిర్ణయం తీసుకోడానికి ఆ వ్యవధి చాలనుకుంటాను.

“ఆ రెండ్రోజుల్లో యిక్కడ్నుంచి తప్పించుకోవాలనే ఆలోచన నీలో పుడుతుంది. పారిపోడానికి ప్రయత్నించొద్దని నేనను. ప్రయత్నించి అది ఎంత

అసాధ్యమో తెల్సుకో. యూ ఆర్ మెంటల్లీ టైర్డ్. యిప్పుడు నువ్వు నా గదికి వెళ్ళి విశ్రాంతి తీసుకొంటావ్.'' అగ్గిపుల్లని బూటుకాలితో నొక్కి హుందాగా అక్కణ్ణించి బయటికి నడిచాడు కోబ్రా.

స్థాణువులా నిలబడిపోయాను కోబ్రా మాటలకు.

* * *

అర్ధరాత్రి దాటుతోంది.

బయట వర్షం పడ్తోంది.

నీరు చూరుమీంచి జారి, నేలమీద పడుతున్న శబ్దం...నిద్రపట్టలేదు.

కోబ్రా కుటీరంలో నాకు కేటాయించబడిన గదిలో, మెత్తని తోళ్ళు కప్పిన నులక మంచంమీద కూర్చుని యిబ్బందిగా కదుల్తున్నాను.

మస్తిష్కం కోబ్రా దౌర్భాగ్యపు కోరిక గురించి ఆలోచిస్తూ తననొప్పి పుట్టిస్తోంది...

నా మంచానికి పక్కగా కిటికీ...

తలుపుల్లేవు వాటికి.

అడ్డంగా నిలువుగా చెక్కబడిన కొయ్యముక్కలు దిగ్గొట్టబడ్డాయి. గాలి రివ్వున వీస్తోంది కిటికీలోంచి లోపలికి.

బయట అప్పుడప్పుడు భయంకరంగా మెరుపులు మెరుస్తున్నాయి...

ఉరుముల శబ్దం దానితో ఐక్యంగా వెలువడుతోంది.

మెరుపుల కాంతిలో వర్షం స్పష్టంగా అవుపిస్తోంది.

నేను మనిషిని.

నాగరికుడెవ్వడూ కోబ్రా కోరిక తీర్చలేడు.

తీరిస్తే తిరిగి ఆ మనిషి రాతియుగంనాటి మానవ దిశలోకి వెళ్ళినట్టే!

పోనీ పారిపోతామంటే...ఎలా? హౌ కెన్ ఐ ఎస్కేప్?

కోబ్రా మాటలు బట్టి—

అతను తగిన కట్టుదిట్టాల్లో ఉన్నట్లు గ్రహించవొచ్చు.

ఒకవేళ పారిపోవడమంటూ జరిగితే—

మళ్ళీ నిరాహారంగా...నిరాయుధంగా...

కాళ్ళీడ్చుకుంటూ ఎన్నివందల మైళ్ళు నడవటం?

కనీసం యిప్పుడు ఖాళీ తుపాకీ కూడా తనవద్ద లేదు.

బయట ఒక్కసారిగా భయంకరంగా ఉరిమింది.

ఎక్కడో పెద్ద శబ్దం...

ఫ్లాష్ లైట్ కాంతి తళుక్కున మెరిసింది.

ఆ మెరుపులో...

నాకు ఓ ఆకారం కనబడింది.

ఆ ఆకారం బయట మెట్లవేపు అటూ ఇటూ కదలడం ఆ క్షణంలో నేను చూశాను. ఆ ఒక్క క్షణం కాంతిలోను ఆ ఆకారం ముఖాన్ని గమనించాను. నా గుండె ఒక్క క్షణం కొట్టుకోడం మానేసింది.

ఆమె...ఆమె...శాన్యోరాయేనా?

మరోసారి మెరుపు మెరిసింది—పెద్ద శబ్దం వెనుక.

కళ్ళు చిట్లించాను.

గుండెలు గుబగుబలాడాయి.

ఆమే...

ప్రొఫైల్ యాంగిల్ లో ముఖం కనబడింది.

షీ ఈజ్ శాన్యోరా! అవే వంపుసొంపులు!! తడిసిన తెల్లని దుస్తుల్లో జుట్టు విరబోసుకొని గబగబా గేటువైపు వడుస్తూ కనబడిందామె.

శాన్యోరా...!!

శాన్యోరా బ్రతికే వున్నదా?

కంగారుగా నడువాల్సిన అవుసరం??

ఆమె శావ్యోరా అయివుంటే ఈ అర్ధరాత్రి వర్షంలో...??

నా బుర్ర పగిలిపోతోంది ఆలోచనల్తో.

నా కళ్ళను నేనే నమ్మలేకపోతున్నాను.

తొడమీద గట్టిగా గిల్లుకున్నాను.

నొప్పి తెల్సింది.

డామిట్! కలకాదు.

అయ్ హేవ్ సీన్ శాన్యోరా!

నా ప్రియురాలు, నా ఆరాధ్య దేవత శాన్యోరా బ్రతికే వున్నదా?

యిక ఆలస్యం చేయదల్చుకోలేదు.

చేతిలోని సిగరెట్ విసిరికొట్టి తటాలున పైకి లేచాను.

రగ్గు ఎగిరిపడింది.

తలగడ క్రిందవున్న టార్చిలైట్ చటుక్కున తీసాను.

మరో మెరుపు!

ఉలిక్కిపడి ఆశగా అటువైపు చూసాను.

కర్రగేటు కిర్రు కిర్రుమంటూ కదుల్తోంది!

ఆ గేటుకి అవతలగా అడివిలోకి గబగబా నడుస్తున్న తెల్ల చీర!

మళ్ళీ చీకటి...

ఎందుకో నా గుండెలు గుబగుబలాడుతున్నాయి.

నోరు అప్పటిదాకా ఎందుకు పెగల్లేదో నా కర్థం కాలేదు.

గది తలుపు గడియ తీసి మెరుపులా బైటికి లంఘించాను.

మెట్లమీంచి హై జంప్ చేసాను.

పాదంవద్ద అప్పుడే మానిన గాయం కలుక్కుమంది.

గేటువద్దకు పరిగెత్తాను.

గేటు తియ్యనక్కర్లేకుండా గాలికి అదే వెనక్కి తెరుచుకుంది.

"శాన్యోరా!" ఒక్కచోట ఆగి బిగ్గరగా అరిచాను. నా చేతిలోని ఫైవ్ సెల్స్ టార్చి—చెట్ల మధ్యకు అర్థ వలయంగా సర్వే చేసింది.

తెల్లచీర కనబడటం లేదు!

ఆమె అటువైపే వెళ్ళింది! సందేహం లేదు!

ఆఖరిసారి చీర కనబడినప్పుడు దారి గుర్తుపెట్టు కున్నాను మస్తిష్కంలో.

గబగబా అటువైపే ముందుకి పరిగెత్తాను.

టార్చి ముందుకు దారి చూపుతోంది. వర్షం పడు తూనే వుంది. బట్టలు అప్పటికే తడిసిపోయాయి. ఏవో కీటకాలు కదుల్తూ కన్పిస్తున్నాయి, టార్చి కాంతిలో.

"శా..న్యో..రా!" నోటి చుట్టూ చేతులుపెట్టి పొలి కేక పెట్టాను పిచ్చాడిలా.

నా గొంతుక ఆ అరణ్యంలో ప్రతిధ్వనించింది హేళనగా. కళ్ళకడ్డుపడిన తడి జుట్టు నుదుటిమీదుగా

తోసుకుంటూ ఎడంచేత్తో టార్చి మళ్ళీ అర్థవలయంగా త్రిప్పాను.

నా కళ్ళు మెరిసాయి.

కుడివైపు...

అల్లంత దూరంలో మరమనిషిలా వెళ్ళిపోతోంది తెల్ల చీర ఆకారం. "శాన్యోరా! స్టాప్ దేర్!" వెర్రికేక పెట్టాను వెనకనించి.

వర్షం పడుతున్నట్టే గుర్తించనట్లుంది ఆ ఆకారం నడక చూస్తుంటే.

ఆమె శాన్యోరాయేనా?

అయితే తన మాట ఎందుకు వినిపించుకోదు??

వర్షం తుప్పర్లలోకి తగ్గింది.

ఆమె వెనకాల భాగం మాత్రం కనబడ్తోంది నాకు.

ముఖం కనబడ్డంలేదు.

అయినా ఆమె శాన్యోరాయే!

షీ ఈజ్ శాన్యోరా!

షీ మస్ట్ బి శాన్యోరా!

ఆమె నడక గుర్తించలేని మూర్ఖుణ్ని కాను నేను.

కసిగా పరిగెట్టాను ఆమెవైపు.

ఓ వెడల్పాటి చెట్టువేపు గబగబా అడుగులు వేసింది ఆ ఆకారం. చటుక్కున చెట్టు వెనక్కి గెంతింది.

తడిసిన నేలమీద శబ్దం చేసుకుంటూ పరిగెట్ట సాగాను ఆవైపు.

టార్చి కాంతి చెట్టు అవతలివేపు ప్రసరింపచేసాను.

నా గుండె ఝల్లుమంది...

అక్కడ...

అక్కడ.

శాన్యోరా లేదు...

ఎంతోసేపు కాలేదు ఆమె ఆ చెట్టువద్దకు వొచ్చి.

మాక్సిమమ్ అరనిముషం!

ఎక్కడ మాయమైంది అంతలో??

చెట్టు చుట్టూ పరీక్షించాను నేలను...

అడుగు జాడలు చెట్టుదాకా వచ్చి—ఆగిపోయాయి.

ముందుకు లేవు ఫుట్ ప్రింట్స్.

ఎలా సాధ్యం?

ఎక్కడ మాయమైంది?

అంతలో ఏదో ఆలోచన మెరిసింది మెదడులో!

చెట్టుపైకి వేసాను లైటుని.

ప్చ్!

పైకి ఎక్కాను గబగబా...

ప్రతి కొమ్మని వెతికేసాను పిచ్చివాడిలా.

"శాన్యోరా! శాన్యోరా!" భయమయిన కంఠంతో పిలుస్తూనే వున్నాను ఆశగా.

పావుగంట తర్వాత చెట్టు దిగాను.

చినుకులు పడుతూనే వున్నాయి.

అలాగే పిచ్చి చూపులు చూస్తూ చినుకుల మధ్య నిలబడిపోయాను తడుస్తూ, "ఎక్కడికీ తప్పించుకోలేవ్" అంటూ యిద్దరు నీగ్రోలు ప్రత్యక్షమై నన్ను వెనక్కిలాక్కెళ్ళేవరకూ.

* * *

ఉదయం—ఏడు గంటలు చూపుతోంది కోబ్రా కుటీరంలోని గోడ గడియారం.

"మిస్టర్ భయంకర్! రాత్రి నువ్వు తప్పించుకోవాలని చూసావ్!" అన్నాడు కోబ్రా నవ్వుతూ.

"మిస్టర్ కోబ్రా!" ఉద్వేగంగా పలికాను.

"యస్. మిస్టర్ భయంకర్!"

"రాత్రి కాన్స్యోరాను చూశాను."

"కాన్స్యోరా?"

"ఎస్. కాన్స్యోరా. నా ప్రియురాలు."

"ఓహ్! జ్ఞాపకం వచ్చింది. ఎక్కడ?"

"మెట్లమీంచి దిగి గేటు తెరచుకుని ఆమె బయటకి నడవడం నేను చూశాను.

"ఎక్కడ మెట్లు?"

"ఈ యింటి మెట్లు."

కోబ్రా మౌనంగా నిలబడి సిగరెట్ ముట్టించాడు.

"మిస్టర్ భయంకర్! యిదే నెలా?" అడిగాడతను.

"ఏప్రిల్" అన్నాను వింతగా చూస్తూ.

"తారీఖు?"

"ఒకటి" అన్నాను గోడగడియారం చూసి.

"డోంట్ మేక్ మీ ఏప్రిల్ ఫూల్!"

అకస్మాత్తుగా అరిచాడు కోబ్రా, కోపంగా.

"నవ్వుతో తప్పించుకోడానికి ట్రై చేసానని."

"స్టాప్ యువర్ బార్కింగ్ మిస్టర్ కోబ్రా!" పలికాను గంభీరమైన మిలట్రీ కంఠంతో.

"నేనూ అరవగలను నీలా. కాని పాయింట్ లెస్‌గా మాట్లాడక. నా కళ్ళతో నేను చూసానామెను. తెల్ల దుస్తుల్లో ... షీ మస్ట్ బి కాన్స్యోరా! ఎక్కడ దాచావ్ ఆమెను?"

"తెల్లదుస్తులు?"

"ఎస్స్! ఇన్ వైట్ శారీ!"

పగలబడి నవ్వాడు కోబ్రా. "యిప్పుడు అర్థమైంది" అంటూ నవ్వుతూ చప్పట్లు కొట్టాడు.

గదిలోనికి ఓ నీగ్రో వచ్చి తలవొగ్గి నిలబడ్డాడు.

"బొసాంబో! మీ అందరి పెళ్ళాలనీ తీసుకురా! గెట్ లాస్ట్!"

అతను మళ్ళీ తలవంచి వెనక్కు మళ్ళాడు.

"కోబ్రా! ఏవిటదీ?" అన్నాను అర్థం కానట్లు చూస్తూ.

"పేషన్స్ మిస్టర్ భయంకర్! వెయిట్ ఫర్ మినిట్!"

మౌనంగా ఉండిపోయేను.

అయిదు నిముషాల్లో యిరవైమంది నీగ్రో యువతులు వరుసగా లోనికి వచ్చారు.

త్రుళ్ళిపడుతూ వారివేపు చూసాను.

"మిస్టర్ భయంకర్! వీళ్ళంతా నాక్రింద పనిచేస్తున్న సేవకుల పెళ్ళాలు. నా యింటిచుట్టూ అక్కడక్కడా వీరికి 'బాండా' అని పిలువబడే కాటేజిలు కట్టించబడ్డాయి. వీళ్ళు ధరించిన చీరలు క్రిందటిసారి నేను యింగ్లండ్ వెళ్ళినప్పుడు తెచ్చి ప్రెజెంట్ చేసిన ఇంపోర్టెడ్ నైలెక్స్ చీరలు. అవి వాళ్ళు ఎంతో ప్రేమతో కట్టుకుంటారు. వీరిలో ఎవరినైనా రాత్రి నువ్ చూసి ఉంటావ్. అయామ్ ష్యూర్ ఆఫ్ యిట్! ఎందుకంటే" అంటూ ఆగిపోయాడు.

"ఎందుకు?"

కోబ్రా మెల్లిగా నా దగ్గరకు వచ్చేడు.

"...ఎందుకంటే ... వాళ్ళలో కొంతమందిని నేను వాడుకుంటాను. నేనంటే మోజు వాళ్ళలో చాలమందికి. నిన్న రాత్రి నా దగ్గరకి ఓ నీగ్రో యువతి వచ్చిన మాట నిజం." అన్నాడు తగ్గు స్వరంతో.

అదిరిపడుతూ అతనివైపు చూసాను.

"ఈ విషయం వాళ్ళ భర్తలకు తెలిస్తే?" ఆశ్చర్య పోతూ లోగొంతుకతో పలికాను.

"తెలుసు..."

"వ్వా...ట్?"

"ఎస్సి దనో. అవన్నీ నీకనవసరం. వారి సాంప్రదా యాలు అవీ నీకు తెలియవ్. అవన్నీ యిప్పుడు చెప్ప లేను."

నీగ్రో యువతులవేపు చూసాను.

"మీరంతా వెళ్ళిపొండి" అరచాను.

వాళ్లు కదల్లేదు.

నవ్వుతూ కోబ్రా వేపు చూస్తున్నారు.

"మీరు వెళ్ళొచ్చు" అన్నాడు కోబ్రా.

మరుక్షణం వాళ్ళంతా గౌరవంగా తలవంచి వరు సిగా నిష్క్రమించారు.

అప్పుడే ఓ విషయం చటుక్కున గుర్తుకొచ్చింది.

"మిస్టర్ కోబ్రా!" పిల్చాను.

"ఎస్" అన్నాడతను, టేబుల్ మీది కాఫీకెటిల్ వేపు కదుల్తూ.

"రాత్రి నేను చూసింది ఈ స్త్రీలలో ఎవ్వరినీ కాదు" అన్నాను దృఢంగా.

(సశేషం)

## ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్ట చివరిబొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం ఉండేటట్లుగా ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలోగాని, పోస్టుకార్డు సైజు తెల్ల కాగితంపై వ్రాసి ఈ నెల 10వ తేదీలోపు మాకు చేరేటట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతోపాటు, తమ నెంబరుకూడా వ్రాయాలి. సభ్యులు కానివారు తమ వ్యాఖ్యాలతో 30 పై.లు స్టాంపులు పంపాలి.

మాకు వచ్చిన వాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు రు. 20లు నగదు బహుమతి పంపుతాము. ఫలితాలు వచ్చే నెల మాసపత్రికలో చూడండి.

## మీరే ఎన్నుకోండి?

ఈ నెల ప్రచురింపబడిన నవలలు, కథలు, హాస్య రచనలలో ఏది ఉత్తమమైనవో, మాసపత్రికలో ప్రచురించబడిన బ్యాలెట్ పత్రంలో వ్రాసి పంపండి.

ఉత్తమ నవలకు రు. 200/-లు, ఉత్తమ కథకు రు. 100/-లు, ఉత్తమ జోక్కు రు. 20/- బహుమతి ఇవ్వబడుతుంది. ఇలాగే యీ మూడు ఉత్తమ రచనలను సరిగ్గా ఎన్నిక చేసిన పాఠకులకు ఒక్కొక్కరికి రు. 10-/లు బహుమతి వుంటుంది.

## "హోమ్ డెలివరీ"

'హోమ్ డెలివరీ' సభ్యత్వము తీసుకుంటే, మీకు కాపీలు గ్యారంటీగా చేరుతాయి. పైగా పత్రిక ఖరీదులో కొంత తగ్గింపు లభిస్తుంది. సభ్యత్వము కోసం మీరు రు. 5/-లు పంపండి. మీకు ప్రతినెలా పత్రిక మరియు సప్లిమెంట్ రెండూ కలిపి రు. 5/-లకే వి.పి. ద్వారా పంపబడతాయి.



# క్రైమ్‌లో తమాషాలు

## పాత సైకిలు!

"ఇదో అప్పలసామీ!"

"అమ్మా!"

"నీతో ఓ ముఖ్యవిషయం మాట్లాడాలి" అంది సుజాత పాలగిన్నె పక్కన పెడుతూ.

"సెప్పండమ్మా!"

"మా పాత సైకిల్ లేదూ? దాన్నమ్మేసి కొత్తది కొందామనుకుంటున్నాం. ఎవరికైనా కావాలేమో కనుక్కుని పుణ్యం కట్టుకుందూ?"

"అయ్ బాబోయ్! ఆ సైకిలాండి? దాన్సంగతి నాకు బాగా తెల్సండి. ఓరోజు నేరకపోయి అయ్యగారి దగ్గర అడిగి తొక్కేనండి. దాన్తస్సదియ్యా! ఇటు తిప్పితే అటు పోతుంది. అటు తిప్పితే ఇటొస్తుంది. ఆమడ దూరం పోయేనో లేదో ఊరకుక్క లెంటబడ్డాయండి. అర్థంగాక దిమ్మెరపోయేను.

తర్వాతెల్సింది. స్టాండు రోడ్డుకు రాసుకుంటూ ఒహటే సంగీతం మోతండి. ఆ మోతకే కుక్కలెంట బడ్డాయండి. ఎదురుంగా మడిసివస్తే బిరేకేసినానండి. ఆగితే ఒట్టండి. తిన్నగా ఎల్లి ఆ మడిసిని ముద్దెట్టుకుంది.

దారిన పోయే నలుగురూ మూగి నాకీపు సేరేపినారండి. నావల్ల కాదు తల్లోయ్ సెమించు." అంటూ పాలచెంబందు కుని జారుకున్నాడు అప్పల్సామి.

సుజాత నిరుత్సాహపడలేదు.

ఆ రాత్రి భర్త గోపాలం కంచంలో మజ్జిగ వడ్డిస్తూ అంది. "ఉగాదికి మనిద్దర్నీ రమ్మని నాన్న ఉత్తరం రాసేడు. ఐదురోజులు ఆఫీసుకి సెలవు పెట్టండి!"

"కుదర్దు. ఆఫీసరు ఎవ్వడికీ సెలవియ్యనన్నాడు. వెళ్తే నువ్వొక్కర్తివే వెళ్ళరా!" అన్నాడు గోపాలం.

సుజాత పుట్టింటికి జేరిన రెండోరోజే గోపాలం నించి ఉత్తరం వచ్చింది.

'ప్రాణసఖి సుజాతకు!

నీ గీత ముందు నారాత పల్టీకొట్టింది. నీ ఆగర్భ శత్రువు అంతమైంది. అంటే, సైకిలు! ఈ వార్త విని ఎగిరి గంతేశావేమో, అసలే మీ ఇంటి చూరు చిన్నది. అసలు విషయమేవి(టంటే, నిన్ను బండెక్కించిన రోజు రాత్రి ఓ టీ కొట్టుముందు సైకిలాపి, లోన టీ తాగి వచ్చి చూస్తే బైట సైకిల్ లేదు ఎవ్వడో దొంగవెధవ కాజేసేడు. నా దుఃఖంలో పాలుపంచుకోడానికి వెంటనే వస్తావు కదూ? ఇప్పటికే వేదనతో వేడెక్కిపోయింది. నా కపాలం. ఇహ సాగదం లేదు కలం. ఉంటాను.

ఇట్లు నీ—గోపాలం!'

ఉత్తరం చూడగానే హుటాహుటీన ఇల్లు జేరిన సుజాత కొయ్యబారి పోయింది!

"వచ్చావా సుజా! రా, రా, అసలేం జరిగిందంటే....
నా సైకిల్ కాజేసిన ఆ దొంగ వెధవ, మన్దానికి బ్రేకుల్లేవని తెలీక, స్పీడుగా తీసికెళ్ళి సెంటర్లో ఓ రిక్షాకి గుద్దేడుట. పోలీసులు వాణ్ణి స్టేషన్‌కి తీసికెళ్లారు. రిపోర్టు యిద్దామని స్టేషన్‌కివెళ్తే అక్కడ కనిపించింది మన సైకిల్.

ఈ దొంగవెధవ యింతకుముందు అనేక సైకిళ్ళు కాజేసి తప్పించుకు తిరుగుతున్నాడుట. అటువంటి కేడీని మన సైకిల్ పట్టించింది మరి...." అంటున్న గోపాలం మాటలేవీ సుజాతకి వినిపించడంలేదు.

గోడవారగా ఆనించి ఉన్న డొక్కుసైకిల్‌ని మింగేసేలా చూస్తూ నిల్చుండి పోయింది సుజాత.

—లలితకుమారి, హైద్రాబాదు-1

## "ఎగ్జిమా?"

ఒక స్కిన్ స్పెషలిస్ట్ హోటల్‌కు వెళ్ళాడు.

"ఏమున్నాయి?" అని సర్వర్‌ను అడిగాడు.

"ఇడ్లి-దోసె, వడ, ఉప్మా...." అని సగంలోనే ఆపి కాలు గీరు కోసాగాడు సర్వర్.

అది చూచి డాక్టర్ "ఎగ్జిమా?" అని అన్నాడు.

"అదిక్కడ లేదు. వేరే హోటల్‌కు వెళ్ళండి." అన్నాడు సర్వర్.

—చాగాపురం నాగేశ్వరరావు, గద్వాల



